# స్వాతంత్ర్యోద్యమంలో
# ఖిలాషాపురం

రచన :

**పెర్మాండ్ల యాదగిరి**

ఖిలాషాపురం

17 సెప్టెంబరు 1988

నలుబదియవ

హైదరాబాదు రాష్ట్ర

విమోచనదిన మహోత్సవ సందర్భంలో

ప్రచురణ :

**సారస్వత వికాస సమితి**

ఖిలాషాపురం

రఘునాథపల్లి మండలం, జనగాము తాలూకా

వరంగల్ జిల్లా

SWATANTRYODYAMAMLO KHILASHAHPUR

*By*

*PERMANDLA YADAGIRI*

**PRICE Rs. 20/-**

ప్రచురణ సంఖ్య : 4
ప్రథమ ముద్రణ : 17 సెప్టెంబరు 1988
ప్రతులు : 500


వెల : రు. 20/-

ముఖచిత్ర రచన : శీలా వీర్రాజు

ప్రతులకు :
పెర్మాండ్ల యాదగిరి
ఖిలాషాహపురం
రఘునాథపల్లి మండలం
వరంగల్లు జిల్లా

ముద్రణ :
మాధవీ ప్రింటర్స్
కుత్బిగూడ
హైదరాబాదు-27.



పెర్మాండ్ల రామయ్య          పెర్మాండ్ల కిష్టమ్మ

# అంకితం

నాకీ జీవితాన్ని ప్రసాదించిన

నా తల్లిదండ్రులు

పెర్మాండ్ల కిష్టమ్మ

పెర్మాండ్ల రామయ్య

గారలకు

శ్రద్ధాంజలి ఘటిస్తూ

ఈ గ్రంథాన్ని సమర్పిస్తున్నాను

— పెర్మాండ్ల యాదగిరి

# సారస్వత వికాస సమితి

## బిలాషాహపురం

శ్రీ పేర్మాండ్ల యాదగిరి స్వాతంత్ర్య సమరవీరుడు. ఆనాడు హైదరాబాదు రాష్ట్ర విమోచన కోసం సాగిన పోరాటంలో చురుకుగా పాల్గొన్నాడు తన 17 వ ఏటనే తెలంగాణా సాయుధ పోరాటంలో చేరి నిజాం నిరంకుశ పరిపాలన నెదురొడ్డినాడు. అజ్ఞాత జీవితాన్ని గడుపుతూ తుపాకి ధరించి "ఖబడ్దార్! ఖబడ్దార్! నైజాం పాదుషా హే!" సింహగర్జన చేసిన గెరిల్లా సైనికుడు కొంతకాలంపాటు కారాగార శిక్ష కూడ అనుభవించినాడు. ఆయన మా ఊరివాడు కావడం మాకు గర్వ కారణం. సర్దార్ సర్వాయి పాపన్న కాలంనుండి వస్తున్న వీరోచిత సముజ్జ్వల సాంస్కృతిక వారసత్వాన్ని కాపాడడంలో ఆయన తన బాధ్యతను తాను నిర్వహించగలుగుతున్నందులకు శ్రీ యాదగిరిని అభినందిస్తున్నాం. అతని అనుభవాల్ని మా సంస్థ తరపున పుస్తక రూపంలో ప్రచురింప గలుగుతున్నందులకు మేమెంతో ఆనందిస్తున్నాం.

ఇటువంటి వీరసైనికుల అనుభవాల్ని, ఆలోచనల్ని పుస్తక రూపంలో ఒకచోట కూర్చడం భవిష్యత్ పరిశోధకులకూ, చరిత్రకారులకూ ఉపయోగకరంగా ఉంటుందని విశ్వసిస్తున్నాం. యువకులకు ఆదర్శప్రాయంగానూ ఉండి ఉత్తేజాన్ని కలిగిస్తుందని ఆశిస్తున్నాం.

ఈ పుస్తక ప్రచురణలో మాతో సహకరించిన ఉదారులకూ విద్యావంతులకూ, గ్రామ ప్రజలందరికీ కృతజ్ఞతాభివందనాలు. మమ్ముల్ని ప్రోత్సహించి ముందుకు నడిపించిన శ్రీ పేర్వారం రాములు, ఐ.పి.ఎస్, శ్రీ పొన్నాల వెంకట రామనరసయ్య, ప్రముఖ పారిశ్రామికవేత్త శ్రీ పొన్నాల లక్ష్మయ్య, శ్రీ పేర్మాండ్ల జగన్మోహన్‌గారలకు మా ధన్యవాదాలు.

ఇట్లు,
జనగాం నరసింహారెడ్డి
అధ్యక్షుడు.

కావేరి గోపయ్య
కార్యదర్శి.

ఉపాధ్యక్షులు :
లగిశెట్టి అంజయ్య
త్రిపురారి శ్రీరామమూర్తి

సహాయ కార్యదర్శులు :
ముమ్మాడి రామకృష్ణయ్య
నాగులగాని నరసయ్య

ది 17-9-1988

నాగభైరవ కోటేశ్వరరావు
తెలుగు విశ్వవిద్యాలయం సిండికేటు సభ్యుడు
అధికార భాషా సంఘం సభ్యుడు
కేంద్ర సాహిత్య అకాడమీ సభ్యుడు

టెలిఫోన్ ఆఫీసురోడ్డు
చీరాల-523155
ప్రకాశం జిల్లా
ది 5-9-1988

## సందేశం

జగన్నాథం
తమ్ముడూ !

తెలంగాణా పోరాటాలకి పుట్టిల్లు, అభిమానానికి అగ్రభూమి. ఆ పోరాటాల్లో ప్రత్యక్షంగా పాల్గొన్న శ్రీ పెర్మాండ్ల యాదగిరి పుస్తకం రాయడం హర్షదాయకం. వారి కార్యక్రమం నిర్విఘ్నంగా సాగుగాక ! ఇలాంటి మంచి పనులు ఎన్నైనా చేయండి. చేయించండి.

మీ అన్నయ్య,
— నాగభైరవ

# శ్రద్ధాంజలి

మాకు పూర్వీకులు సంపాదించిన స్థిర, చరాస్తులు ఏమీ లేవు. మా తండ్రిగారైన స్వర్గీయ పెర్మాండ్ల రామయ్యగారు పేద కుటుంబములో పుట్టి స్వంత కాళ్ళపై నిలబడి వృద్ధిలోనికి వచ్చిన వ్యక్తి కావటం ఒక విశేషం. శ్రీ నెల్లుట్ల కేశవరావు, శ్రీ లింగాల వెంకట రంగా రెడ్డి, దొరల భూములు చెరి 50 ఎకరాలు కౌలుకు తీసుకొని కాస్తు చేస్తూ చిన్న చిన్నగా మధ్య తరగతి కౌలుదారుగా ఎదిగినాడు. అందులో వచ్చే ఆదాయంతోనే మరో 45 ఎకరాలు వేరే వారి వద్ద కొని పట్టాదారుగా చలామణి అయ్యాడు. ఈ భూములకు తోడుగా నాడు కల్లు ముస్తాజర్ (కంట్రాక్టర్) గాను, చిన్నగా బట్టల వ్యాపారం కూడా చేసేది. ఆ వచ్చే ఆదాయంతో మా కుటుంబము కాస్త కుదుట బడింది. ఇక మా తండ్రిగారి స్వభావము ఏ విషయాన్నైన చాల ముక్కు సూటిగా, కుండ బద్దలు కొట్టినట్లుగా వ్యవహరించే వాడు. దొరల జులుంలు, లంచాలు, వేధింపులు, వారి గుమస్తాల దోపిడీలు, కుట్రలు, దగా చేయడం లాంటివి ఎదిరించ కున్నా గిట్టని వాడుగా నిలిచాడు.

దొరల గుమస్తాలకు మా తండ్రిగారంటె ఏ మాత్రం సరిపడేది కాదు. అందుకే దొరల చెవుల్లో జోరీగల్లాగా జొరబడి కపట బుద్ధితో నచ్చజెప్పి, యిచ్చిన కౌలు భూములను, తిరిగి లాక్కునేలా చేశారు. కారణం వీడు దినదినం మన కన్నా ముందు వెళ్ళేటట్లు ఉన్నాడు, ఆర్థికంగా దెబ్బ తీస్తే తప్ప, తమ చెప్పు చేతుల్లోకి రాడని ఊహించారు, ఉన్న భూములు కాస్త ఊడ బెరికినారు. దానితో ఆర్థిక పరిస్థితులు

తల్లక్రిందులైనవి. ఉన్న పశువులకు సైతం మేతలేకుండా చేయటంతో ఆవుల నుంచ దెబ్బ తిన్నది. పంటలు లేవు, అప్పుల బాధలు అందుకు తోడు నిల్వగా కౌలు భూములు తిరిగి పొందేందుకు చట్టపరంగా కోర్టుల చుట్టూ ప్రదక్షణాలు, అప్పటి పరిస్థితి తలచు కుంటేనే ఒళ్ళు జల దరిస్తుంది. అందుకే దొరల చేత, దొరల గుమస్తాల చేత కౌలు దారుకు ఎలాంటి ఇబ్బందులు ఎదురౌతాయో అవన్నీ మా తండ్రి గారు అనుభవించారు. అయినా దొరలకు, వారి శాపేదారులకు దేహీ అని వేడుకోలేదు. వారికి లొంగ లేదు. తలవంచలేదు

ఇక స్వర్గీయ పేర్వారం నంతాజీగారి గూర్చి నాలుగు మాటలు చెప్పకపోతే అసలు నాకు తృప్తి ఉండదు. వీరు నాకు అన్న కావాలి. మా కుటుంబము, వీరి కుటుంబము వేరువేరు కుటుంబాలయినప్పటికి, ఒకే వాడలో ఉండి, ఒకే గూటి పిల్లలవలె కలసి మెలసి అన్యోన్యత, ఆప్యాయతతో నొకరి కష్ట సుఖాలలో మరియొకరు పాలువంచుకుంటూ ఉండేవారము.

మా తండ్రిగారు దొరలతో ఏ విధంగా కష్టాలను అనుభవించాలో, అదేవిధంగా వీరి పాలివారు దొరల అండనచేరి వీరి చిన్న వయస్సులోనే నానా బాధలకు గురిచేశారు.

అటు మా తండ్రిగారు, ఇటు సంతప్పగారు ప్రత్యక్షంగా అనుభవించినవి, నేను విన్నవి, కన్నవి కావటంచేత ఆ అనుభవంకూడ నన్ను ఈ ఉద్యమంలోనికి దూకటానికి పురికొల్పిందేమో నా మనస్సు యని ఒక్కొక్కసారి నాకు అనిపిస్తుంది

అయితే అదే ఉద్యమ రీత్యా కొన్ని సమస్యలయెడల మా సంతప్ప గారితో విభేదించటమేకాదు, ఎదిరించిన సంఘటనలు కూడ కొన్ని లేకపోలేదు. అట్టి సందర్భాలలో కూడ వారే తమ్మీ! కోపం తగ్గలేదురా ఇంకా! అంటూ పలకరించేవాడు ఎంతో ఆప్యాయంగా.

అందుకే నన్ను కనిపెంచి కొంతకో కొంచైనా విజ్ఞానమిచ్చిన మా తండ్రిగారికి, నాకెంతో అనుభవమిచ్చిన సంతప్పగారికి ఎంతో ఋణపడి ఉన్నాను. ఆ ఋణం తీర్చుకోవాలంటే వారికి మనసారా శ్రద్ధాంజలి అర్పించుకోవటమే నాకు తృప్తి, ఋణ విముక్తి.

ఖిలాషాపురం — పెర్మాండ్ల యాదగిరి.

ది 17-9-1988

# కృతజ్ఞతలు

ఈ రచన చెయ్యడానికి నాకు కొంతంత ధైర్యం యిచ్చి, నీవు ఎట్లా వ్రాస్తే అట్లాగే ఉండనివ్వు. నీవు మాట్లాడుతున్న భాషలో ఉంటేనే అందంగా వుంటుంది దీన్ని మరెవ్వరితోనో మంచిగా ఉండా లని వ్రాయిస్తే, నీ భావం చెప్పలేకపోవచ్చని సలహా యివ్వటమే కాదు, ఇది పుస్తక రూపంలో వెలువడటానికి ఎనలేని సహాయ సంపత్తుల నిచ్చి ఆదుకున్న నా పల్లెవాడు, ఇంకా నా వాడవాడు, అంతేనా– వయస్సులో నా కన్న చిన్నవాడు, అయినా చదువులో నేనందుకోలేనంత పెద్దవాడుగా ఎదిగి, ఓరుగల్లు కాకతీయ తెలుగు సింహాసనం మీద కూర్చుండి తెలంగాణ ఉత్తర దిశకు తెలుగు వెలుగును పరచుమ్ముతున్న చిరంజీవుడు, పేర్వారం జగన్నాథం నావాడు కావటం, నాకెంతో గౌరవం, నా ఊరికెంతో గర్వకారణం.

అయినా ఇది ఒక పుస్తక రూపంలో సమగ్రంగా వ్రాయాలనే తలంపు మాత్రం 1973 నుండి నన్ను వేధిస్తూనే ఉంది. అది నా శక్తికి మించిన పనియని, అసాధ్యమని అనుకుంటూనే విషయ సేకరణకు పూనుకొన్నాను తీరిక వేళలో. నేను ఆ రోజుల్లో ఉమ్మడి కుటుంబ ఆస్తుల గొడవల్లో ఇరుక్కొని కోర్టులు, పోలీసు స్టేషనుల చుట్టూ ప్రదక్షణలు, దీనికి తోడుగా ఆర్థిక చిక్కుల వలయంలోపడి గిలగిల్లాడ టముతో అంతరాయం కలిగింది ఆ చిక్కులు ఇప్పటికి తొలగ నప్పటికి ఇక లాభం లేదు, వ్రాయాలనే పట్టుదల వచ్చింది.

ముఖ్యంగా శ్రీ చొల్లేటి నృశింహ్మరామశర్మగారు ఆయుర్వేదం గురించిన వివరాలు, శ్రీ హనుమాండ్ల అగయ్యగారు నాటి విద్యా సంగీత సాహిత్య కళల గురించి, శ్రీ మంగు వెంకటయ్యగారు ఆర్యసమాజ్, హిందూ పరిషత్‌తోపాటు జాతీయోద్యమ పుట్టుపూర్వోత్తరాల, కాంగ్రెస్‌కు సంబంధించిన కొన్ని సంఘటనలు, శ్రీ హనుమాండ్ల రహరి, శ్రీ ఎర్రం భద్రయ్య, శ్రీ లగిసెట్టి శ్రీశైలం, శ్రీ చిలువూరు పద్మయ్య మొదలగువారు, నాటి అనుభవాలను చెప్పకు పోతుంటే అప్పుడు తెలిసింది నా పల్లెకు ఇంత చరిత్ర వుందా! అని

ఇక ఆంధ్ర మహాసభలు, కమ్యూనిష్టు పార్టీ, గెరిల్లా పోరాటాల సంగతి సరేసరి. ఆ పోరాటాల్లో నేను పాల్గొన్నాను గనుక, నా అనుభవాలు, నాతో కలిసి పనిచేసిన నాటి గెరిల్లా మిత్రుల జ్ఞాపకాలు, సంఘటనలు తెలుసుకోగలిగాను.

శ్రీ మంగు వెంకటయ్యగారి డిట్టిప్పుడి పటాల ప్రకారం ఆయా సంవత్సరాలలో జరిగినవని భావించడం జరిగింది. ఖచ్చితంగా ఫలానా తేది అని చెప్పలేక పోయినప్పటికి ఆ జరిగిన సంఘటనలు వాస్తవికతకు అతి దగ్గరగా పోవటానికి ప్రయత్నించాను.

అడుగడుగునా నా రచన పర్వాలేదురా అని ముందుకు నడిపిన శ్రీ కేశిపెద్ది నారాయణరాజుగారికి, ఇంకా ఆలోచిస్తూ కూర్చుంటే అసలుకే ఎసరొచ్చి వాలికిపోతే! అని హెచ్చరించిన శ్రీ మంగు సంజీవయ్యగారికి, ఇది చదువుతుంటే నిజంగా ఆ పోరాటాలన్ని కళ్ళ ముందు కదలాడినవని చెప్పిన నాటి పోరాట మిత్రుడు శ్రీ గుజ్జుల పిరయ్యగారికి, నా వంకరటింకర చిత్తుప్రతిని ఎంతో ఓపికతోను మరెంతో శ్రద్ధతోనూ, విసుగు విరామ మెరుగక అందంగా వ్రాసి యిచ్చిన

శ్రీ ముమ్మడి రామకిష్టయ్యగారికి, ఆయనతో సహకరించిన శ్రీ నాగుల గాని నరసింగంగారికి నేనెంతో ఋణపడి యున్నాను ఆ ఋణం ఇంక నేను తీర్చుకోలేను కూడా

అట్లాగే ఈ పుస్తకానికి అందంగా నా భావాలకు తగ్గట్టుగా ముఖ చిత్రాన్ని చిత్రించిన శ్రీ ఏలా పీర్రాజుగారికి నా ధన్యవాదాలు ఈ పుస్తక ప్రచురణలో సహకరించిన కాకతీయ విశ్వవిద్యాలయం అధ్యాపకులు డా॥ ఎ. భూమయ్యగారికి, మాధవీ ప్రింటర్స్ అధినేత సాహితీ వేత్త శ్రీ టుట్లకొండయ్య కృతజ్ఞతాభివందనాలు. అందరికి మరో సారి మనసారా హృదయపూర్వక కృతజ్ఞతలు అర్పించుకొంటున్నాను.

శిలాషాహపురం
ది 17-9-1985

గ్రంథకర్త యాదగిరి.



"తెలంగాణా అమరవీరుల స్మారక ట్రస్టు"
మఖ్దూం భవన్, హిమాయత్‌నగర్, హైదరాబాదు-29.

# ఒక ప్రశంస

"ఇది నా వూరు-నేను జన్మించిన వీరగడ్డ"

ఈ పుస్తకం, ఖిలాషాపురం గ్రామంలో మొదటి నుంచి చివర వరకు, తెలంగాణా స్వాతంత్ర్య పోరాటములో వచ్చిన పరిణామాలకు ప్రజల్లో వివిధ రూపాలతో వచ్చిన చైతన్యమునకు, వారా పోరాటాలలో పాల్గొనిన విధానాలకు అద్దము పట్టుచున్నది.

ఖిలాషాపురము జనగాము తాలూకాలోని ఒక ప్రధానమైన గ్రామము. దీనికి చారిత్రిక ప్రాధాన్యము గూడా ఉన్నది. "మొగలు పాదుషా ఔరంగజేబు నెదిరించిన విప్లవవీరుడు సర్దార్ సర్వాయి పాపన్న మా ఊర్లో కట్టించిన ఎత్తైన కోట, బురుజులు అనునిత్యం ఆ తేజాన్ని కలిసుంటాయి".

ఈ పుస్తకమును వ్రాసినవారు నైజాం నిరంకుశత్వానికి, రజాకార్ల దౌర్జన్యాలకు వ్యతిరేకంగా జరిగిన సాయుధ పోరాటములో స్వయంగా పాల్గొనిన ఖిలాషాపురం నివాసి శ్రీ మైదమ్మాడ్ల యాదగిరి గారు.

ఈ పుస్తకము నందు శ్రీ యాదగిరిగారు, ఆరంభము నుండి ఖిలాషాపురము ప్రజలు జమీందారుల మరియు జాగీర్దారుల ఫ్యూడల్ దోపిడికి, నైజాం ఫ్యూడల్ విధానాలకు వ్యతిరేకంగా ఏ విధంగా పోరాడారో కండ్లకు కట్టినట్లు వివరించారు.

ఖిలాషాపురము గ్రామము, నా మిత్రుడు కాకతీయ విశ్వవిద్యాలయమునందు తెలుగు ప్రొఫెసర్‌గానున్న శ్రీ పేర్వారం జగన్నాథంగారి స్వగ్రామం కూడా. వీరు రచించిన వృషభ పురాణంలో "స్వకీయం" శీర్షిక క్రింద తమ గ్రామం గురించి ఈక్రింది ఆసక్తికరమైన విషయాలు వ్రాశారు. దానిని క్రింద పొందుపరుచుచున్నాను.

"నాకు పదమూడు సంవత్సరముల వయసున్నప్పుడు దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. ఐనా హైదరాబాదు రాష్ట్రానికి విముక్తి లభించ లేదు. ఇక్కడ నిజాంరాచరికాన్ని కూల్చదోయడం కోసం తెలంగాణాలో ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం క్రింద సాయుధ పోరాటము సాగింది. మా ఖిలాషాపురము గ్రామంలో ఖాస్గీ బడిలోను, ధర్మబడిలోను నాకు సహచరులుగా నుండిన శ్రీ పెరుమాండ్ల యాదగిరి (ఈ గ్రంథకర్త), శ్రీ గుజ్జుల వీరయ్య, శ్రీ గుజ్జుల నారాయణ వంటి యువయోధులు సాయుధపోరాటములోకి దూకినారు. జనగామలోని ఆంధ్ర బాషాభివర్ధని పాఠశాలలో కూడా నాకు పైతరగతిలో ఉండిన, చీటకోడూరు, వడ్లకొండ గ్రామాలకు జెందిన విద్యార్థులు కొందరు తుపాకి బట్టి సాయుధ పోరాటాన్ని నడిపించారు. అంతేకాక ఆ బడిలో మాకు పాఠాలు చెప్పిన పంతులు__శ్రీ గానుగుపాటి నారాయణరెడ్డి గన్ను చేత బట్టినారు. ఆ తర్వాత కొద్దికాలములోనే ఆయన రజాకార్ల చేత, పోలీ పురము గ్రామంలో [illegible] మా గ్రామానికి

జెందిన చాగంటి (గాదె) రాజయ్య, గొల్లపల్లి రాంమల్లయ్య అనే వారు కూడా రజాకార్లచేత అమానుషంగా చంపబడ్డారు. మా ఊరంతా ఏకమై, వడిసెలలు, బల్లాలు, బర్సీలు ధరించి రజాకార్ల నెదిరించి పోరాడిన నాటి క్షాత్ర తేజస్సు నేటికి నా కన్నుల్లో కదలాడుతుంది."

ఇది క్లుప్తంగా చెప్పబడిన బిలాషాహపురము వీరగాథ.

దీనినే పెరుమాండ్ల యాదగిరిగారు ఈ పుస్తకములో వివరంగా చెప్పారు.

ఇది దేశభక్తులందరు, స్వాతంత్ర్య సమరయోధులందరు చదువ దగిన పుస్తకము.

21-10-1988 రావి నారాయణరెడ్డి

# వందనములు

నా యీ "స్వాతంత్ర్యోద్యమంలో ఖిలాషాహపురం" అను పుస్తకానికి, తమ అమూల్యమైన సందేశాన్నివ్వమని కోరగానే, మొదట కాస్త అశక్తత చూపిస్తూ 'నేనెందుకయ్యా వ్రాసేది' అంటూ అందుకున్నారు. చకాచకా కమ్మలు తిరగేస్తూ, హెడ్డింగులు చూస్తూ, నావంక కేసి చూసి 'సరే అసాంతం చదువుతాను. కాస్త ఓపిక, తీరిక కావాలి' అన్నారు. అంతే; ఎంతో సంతృప్తి కలిగిందినాకు. నెమ్మదిగా, ఎంతో ఓపికతో చదివి సంతృప్తి చెంది "ప్రశంస" రూపంలో సందేశాన్నిచ్చి నా యీ కృషిని సార్థకం చేసినారు.

నిజాం నిరంకుశ ప్రభుపాలన ఒకవైపు, జమీందారీ జాగీరుదారీ దొరల దోపిడీ మరొకవైపు, నల్లేరు పై బండివలె సాగిపోతున్న నాటి ఆ రోజుల్లో, 'నీ బాంచెను దొర, నన్నాదులు దొర,' అని వస్తులున్న భార్యాపిల్లలు, దయనీయంగా కాళ్ళ మీదపడి విలపిస్తున్న, ఆ దిక్కు దిక్కులేని బానిసల గూడుగా వున్న దిక్కు తోచని రైతన్నను. వెన్ను తట్టి లేపి ముందుకు నడిపి, వీరతెలంగాణా సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటానికి శంఖారావం పూరించి, రథసారథియై నడిపించిన విప్లవ యోధుడు శ్రీ రావి నారాయణరెడ్డి గారికి, నేనే విధంగా ఋణం చెప్పుకోగలను నా వినమ్ర మనస్సుతో వందనాలు తప్ప!

పెద్మాండ్ల యాదగిరి
(గ్రంథకర్త)

# ఈ రచన గురించి

మన గ్రామానికి సంబంధించినంతవరకు పోరాటాలు చాలావరకు సవివరంగానే పేర్కొనబడినవి

— తెలంగాణా పోరాట ఆశయ సాధనము అందువల్ల ప్రజల జాగృతికావడం వగైరా వివరాలు బాగా వివరించచమైంది.

— పోరాట దళ విభజన, ఎత్తుగడలు తదితర విధానాలు, బాగా వివరించడమైనది.

— ఈ రచన చదివినంతవరకే, ఇందులో తొలగించవలసిన సంఘటనలు లేవు. చేర్చవలసినవి చాలా అరుదుగానే ఉన్నవి.

— ముఖ్యంగా మన గ్రామ పోరాట చరిత్రంతా వివరంగా, చాల అద్భుతంగా అప్పటినుండి యిప్పటివరకు చాల జ్ఞాపకాలతో వ్రాశారు ఇందుకు నాకెంతో సంతోషం కలిగింది

— రచన చదువుచున్నంతసేపు టైం తెలియకపోవడమేకాదు, ఆ పోరాట గాథంతా నా కన్నులలో మెరిసినట్లు జలదరించింది ఈ మన గ్రామ చరిత్ర రచన చెరగని ముద్రగా, వీర చరిత్రగా చాలావరకు నిజాయితీతో కూడుకొన్న రచనగా దీనిని గమనించడంలో ఎలాంటి సందేహంలేదు

— కావున మీచే రచించబడిన ఈ ప్రథమ రచన గాకుండ ఇక ముందు ఇటువంటి నిజాయితీతో కూడుకొన్న కొన్ని విప్లవకర రచనల ద్వారా మన గ్రామమేకాకుండా దేశ యువజనులకు చదువరులను మేలుకొలిపి ప్రజాసేవలో పాల్గొని బడుగువర్గాల అభ్యున్నతికి పాటుపడి, అందుకు తోడ్పడగలరని ఆశించుచున్నాను

ఇట్లు,

— గుజ్జుల వీరయ్య

స్వాతంత్ర్య సమర యోధుడు

ఆచార్య పేర్వారం జగన్నాథం
తెలుగు శాఖాధ్యక్షులు
కాకతీయ విశ్వవిద్యాలయం
వరంగల్లు - 506009

1/703 సి-1-C, మిథిలానగర్
బాలసముద్రం, హనుమకొండ
వరంగల్లు - 506001
ది. 17-9-1988

# నలభై సంవత్సరాలకు ముందు

తెలుగు తల్లి బిడ్డలం తెలంగాణ వీరులం
మాతృ దేశ ముక్తి కొరకు పోరు సల్ప కదలినాం
ఎట్టి వసుల గట్టిపెట్టి జబర్దస్తి నెగురగొట్టి
స్వేచ్ఛగాను బ్రతుకు కొరకు ఐక్యమయ్యి నిలచినాం

## 1

ఆనాటి తెలంగాణా సాయుధ పోరాట కాలంలో అజ్ఞాతంగా ఉండి పోరాటం సలిపే దళం గ్రామంలో ప్రవేశించి 'ఊరేగుతున్న సమయంలో ఉత్సాహం ఉరకలు వేసేటట్టు గానం చేసిన మార్చింగ్ సాంగ్ ఇది. అనాడు వీళ్ళను 'సంగపోళ్ళు' అనేవారు అట్లా ఊరేగిన పిదప గ్రామ చావడి వద్ద గుమి గూడిన ప్రజల్ని ఉద్దేశించి దళ నాయకులు ముందుగా కొన్ని పోరాటం గేయాలు పాడి ఉద్రేకాన్ని రగుల్కొలిపి పోరాటం ఆశయాల్నీ ఆదర్శాల్నీ ప్రజల కర్తవ్యాల్నీ గురించి ప్రసంగించేవాళ్ళు. ఆ పిదప దళం వేరే చోటికి వెళ్ళిపోయేది. ఈ 'సంగపోళ్ల' ఊర్లో ప్రవేశించగానే ముఖ్యంగా ముగ్గురు రాష్ట్రస్థాయి నాయకులకు

జీజీలు వలికేవాళ్ళు. ఆ నాయకులు రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, మఖ్దూం మొహియుద్దీన్‌గారలు. ఈ తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటం అంతటికీ మా జనగామ తాలూకా కేంద్ర స్థానంగా ఉండేది. అప్పుడు జనగామ తాలూకాలో మా ప్రాంత నాయకులుగా నల్ల నర్సింహులు, సి. యాదగిరిరావు గారలుండేవారు. వీళ్లు అప్పుడప్పుడు మా ఊరికి రహస్యంగా వచ్చి వెళ్ళుతుండేవారు.

తెలంగాణా సాయుధ పోరాటం ప్రారంభం కావటానికి ముందు మా ఊరికి చెందిన కొందరు విద్యార్థులం జనగామలో చదువుతుంటూ ఉండేవాళ్ళం. స్వాతంత్ర్యోద్యమం, ఆంధ్రోద్యమాల ప్రభావంతో అప్పు డప్పుడే జనగామలో ఆంధ్ర భాషాభివర్ధనీ పాఠశాల వెలసింది. దీనికి పోటీగా జనగామలోనే మునీర్ అహమద్ మెమోరియల్ పాఠశాల ప్రారంభించబడింది. జనగామలో పాలకొండకు వెళ్ళే మార్గంలో ఉన్న స్వర్గీయ పెంచారపు రాజిరెడ్డిగారి ఇంటిని పది రూపాయలకు కిరాయకు తీసుకొని మా ఊరికి చెందిన విద్యార్థులమంతా అందులో ఉండేవాళ్ళం. స్వర్గీయ పేర్వారం నరహరి, స్వర్గీయ రామానుజపురం వరదయ్య 'మున్షీ' పరీక్షలకు చదువుతుండేవాళ్ళు. నారాయణపురం గ్రామానికి చెందిన మా బంధువు - ఉస్సారి రామోజీ కూడ మాతోపే ఉంటూ మున్షీ పరీక్షకు చదువుతుండేవాడు. ఇది మెట్రిక్యులేషన్‌కు సమంగా నిర్వహింపబడిన ఉర్దూ భాషా పరీక్ష. మా గ్రామానికి చెందిన మరికొందరు విద్యార్థులు యర్రం చంద్రమౌళి, యర్రం శ్రీశైలం, కలకుంట్ల యాదగిరి, కల కుంట్ల అంజయ్య గారలు కూడ విద్యాభ్యాసం కోసం జనగామకు వచ్చి కొద్ది రోజులు మాత్రమే ఉన్నట్లు గుర్తు. వీళ్ళంతా మరో ఇంట్లో ఉండే వాళ్ళు. స్వర్గీయ మంగు యాదగిరి, స్వర్గీయ పుష్పాల అదారి. మంగు

సుదర్శనం, ఆలేట యాదగిరి, పేర్వారం జగన్నాథం ఆంధ్ర భాషాభివర్ధనీ పాఠశాలలో ఐదవ తరగతి చదువుతుండేవాళ్ళు. ఈ పాఠశాలకు మా ఊరివాడే అయిన తాడూరి వెంకటేశ్వరస్వామి అప్పుడు మొట్టమొదటి ప్రధానోపాధ్యాయుడు. ఈతని అగ్రజుడు స్వర్గీయ శ్రీనివాసస్వామి కూడ ఇదే పాఠశాలలో అధ్యాపకుడుగా ఉండెడివాడు. ఈ సోదరుల తండ్రి గారైన స్వర్గీయ తాడూరి లక్ష్మయ్య పంతులు మా ఊర్లో నాకే కాక ఇంకా చాలా మందికి అక్షరాభ్యాసం చేయించిన 'మహోపాధ్యాయులు'. గాదె వెంకటయ్య ఈతని అనుజుడు స్వర్గీయ గాదెమల్లయ్య మునీర్ అహమద్ మెమోరియల్ పాఠశాలలో ఐదవ తరగతి చదువుతుండెడివాళ్ళు.

నేమంతా ఆరవ తరగతికి వచ్చే నాటికి అంటే — 15 ఆగస్టు 1947 నాడు దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. అదే సమయంలో తెలంగాణాలో రైతాంగ సాయుధ పోరాటం ఉధృతరూపం ధరించింది. మరొకవైపు రజాకార్ల బెడద ఎక్కువైంది. ఊర్లకు ఊర్లనే పెట్రోల్ పోసి తగుల బెట్టడం పిట్టల మాదిరిగా మనుష్యుల్ని తుపాకితో కాల్చడం గడ్డివాముల్లో సజీవంగా దహించడం స్త్రీలను అమానుషంగా మానభంగం చేయడం ఆనాడు రజాకార్లకు రోజువారీ కార్యక్రమంగా మారింది. ఇక్కడ ఒక్క సంఘటన జ్ఞాపకం చేస్తాను. ఒకగ్రామంలోని ధర్మసత్రంలో ఒకనాడు సాయంత్రం ఆంధ్ర మహాసభ వారి సభలు జరిగినాయి. బుర్ర కథ కూడ చెప్పినాడు. మా ఊరి విద్యార్థులమంతా ఈ సభలకు హాజరై మా 'ఠికాన' కు తిరిగివస్తున్నాము. అప్పటికే చాలా రాత్రి అయింది. మధ్యలో వడ్లకొండకు వెళ్ళే దారిలో ఉన్న మోరీ వద్దకు చేరే సరికి కొందరు ఆకతాయి జనం మమ్మల్ని అల్లరి పెట్టినారు, 'అందేరా సభ' అని ఎగతాళి చేసి బూతుమాట అన్నారు. వెంటనే నేను ప్రతిస్పందించి అట్లాంటి బూతుమాటలతోనే తిరిగి బదులు

వేలికినాను. అంతటితో వాళ్ళంతా రెచ్చిపోయి నన్ను కొట్ట వచ్చినారు. అప్పుడు నాతోటి విద్యార్థులు నన్ను కాపాడినారు. ఇంటికి వచ్చిన పిదప ఇక ముందు నుంచి ఎప్పుడూ అనువుగాని చోట అధికంగా మాట్లాడ కూడదని నన్ను మందలించినారు. మరికొంత కాలానికి జనగామలో ఉండి మేము చదువులు కొనసాగించటం ప్రమాదంగా పరిణమించింది. అందువల్ల మేమంతా మా చదువులకు స్వస్తి చెప్పి, ముల్లెమూటలు సర్దుకొని, ఘోరున వర్షం కురుస్తుండగా అర్ధరాత్రి కాలి నడకన బయలుదేరి అతి రహస్యంగా మా స్వగ్రామం చేరుకున్నాం. అదే సమయంలో హనుమకొండలోని బంధువుల వద్ద ఉంటూ మర్కాజీ పాఠశాలలో చదువుతుండే పెర్మాండ్ల యాదగిరి కూడ చదువు మానేసి స్వగ్రామం చేరుకున్నాడు. ఎక్కడా మా చదువులు ఆగిపోయినాయో అక్కడినుండి పెర్మాండ్ల యాదగిరి సాయుధపోరాట చరిత్ర ప్రారంభమవుతున్నది. ఆ తరువాత రెండేండ్లకు మా ఊరి విద్యార్థుల జట్టులో నుంచి నేనొక్కడ్ని మాత్రమే చదువు కొనసాగించినాను.

పెర్మాండ్ల యాదగిరి నాకు చిన్నాయన వరుస వాడు. ఈతని తండ్రి స్వర్గీయ పెర్మాండ్ల రామయ్య నాకు తాత అవుతాడు. రామయ్య తాత పరమ భాగవతోత్తముడు. ప్రతినిత్యం తిరుమణి తిరుకాపులేనిదే వచ్చి నీళ్ల కూడ ముట్టేవాడుకాదు. క్రమం తప్పకుండా వైష్ణవ పత్రికను తెప్పించుకుంటూ ఇంటి అరుగులమీద కూర్చుండి భగవన్నామ స్మరణతో కాలక్షేపం చేస్తుండేవాడు. నాకు మంచి చెడ్డల తారతమ్యం తెలిపినవాడు. నాకే కాదు మా నాయన గారికి జీవితానుభవాల్ని నూరి పోసినవాడు. అందుకే మా నాయనగారు కూడ ఈయనపై ఎంతో గౌరవాన్ని ప్రదర్శించేవాడు. మా యాదగిరి చిన్నాయన ఈ గ్రంథాన్ని

తన తల్లిదండ్రులకు అంకితం చేసి వాళ్ళ ఋణం తీర్చుకుంటున్నందుకు నేనెంతో ఆనందిస్తున్నాను. ఆయన్ని అభినందిస్తున్నాను. అభివందన చందనాలు సమర్పిస్తున్నాను.

యాదగిరి చిన్నాయన నాకు ఖాస్గీ బళ్ళలో సహాధ్యాయి. మా వాడలోని వాడు. ఇంటి ప్రక్కనే ఇల్లు ఆత్మలు కలిసిన కుటుంబ మిత్రులం. స్వర్గీయ ఎర్ర చంద్రయ్య, స్వర్గీయ తిరువాయిపాటి నరసింహస్వామి గారలు మాకానాడు చదువులు చెప్పిన ఖాస్గీ పంతుళ్ళు. స్వర్గీయ గులాం దాయార్, స్వర్గీయ కోటప్ప పంతులు, స్వర్గీయ హనుమాండ్ల అగయ్య గారలు మాకు 'ధర్మబడి'లో చదువు చెప్పిన పంతుళ్లు. బడి చదువులు నచ్చకనో, అచ్చిరాకనో కోదండాలు ఎక్కడం, గోడకు కుర్చీలు వేయటం వంటివి మా యాదగిరి చిన్నాయన నా కంటే ఎక్కువ సార్లే చేసి ఉంటాడు. వీళ్ళ ఇంటిలో ఒక్క అల్లనేరెడు చెట్టు, ఒక రామ సీతాఫలం చెట్టు, ఒక కొబ్బరి చెట్టు, ఒక తాటి చెట్టు ఇంకా కొన్ని చెట్లు ఉండేవి. అల్ల నేరెడు పండ్ల కోసం ప్రతి రోజు ఆ చెట్టు క్రింద గుమిగూడటం, రోజుకొక్క సారైనా తన్నుకోవటం మా కలవాటు. పగలంతా మా పెంటపురం బావిలో ఈతలు కొట్టటం తప్పనిసరి కార్యక్రమం. మా బట్టల్ని మేము సబ్బు పెట్టి తెల్లగా ఉతుక్కోవటం, ఉతికిన వాటిని స్వయంగా ఇస్త్రీ చేసుకోవటమంటే మాకు సరదా. ఇత్తడి గిన్నెలోనో లేక చెంబు లోనో నిప్పులు పోసి ఇస్త్రీ చేయటం మేమానాడు నేర్చిన విద్య. బట్టలు ఉతుక్కోవడానికి మేము అప్పుడప్పుడూ 'బల్లాలబోడు' కు వెళ్ళేవాళ్ళం. ఆ బోడు మీద రంగనాయకుల గుడి వెంట అక్కడక్కడా వర్షపు నీళ్ళు ఆగి గుండములవలె ఉండేవి. ఆ గుండములలో బట్టలుతుక్కొని స్నానాలు చేసి మెల్లగా ఇల్లు చేరుకునేవాళ్ళం. ఇక గోలీలాట, బొంగరాలాట, చిల్లగోనె ఆట

లంటే మాకత్యంత ప్రీతిపాత్రమైనవి. అట్లా మా బాల్యం ఆటపాటలతో అనురాగాలతో పోట్లాటలతో గడిచింది.

## 4

ఇక్కడ మళ్ళీ మొదటికి వస్తాను. తెలంగాణా సాయుధ పోరాటం సమయంలో చదువులు మానేసి జనగామ నుండి మేమూ, హనుమకొండ నుండి యాదగిరి చిన్నాయన మా స్వగ్రామం చేరుకున్నామని ఇంతకు ముందే తెలిపి ఉన్నాను. రజాకార్ల దురాగతాల కారణంగా ప్రజలు తమ ఆస్తి పాస్తుల మీద, చివరికి ప్రాణాల మీద కూడ ఆశలు వదులు కున్నారు. తెలంగాణం నిప్పు కుంపటి వలె మండి పోతున్న రోజులవి. పెద్దలు పనీ పాటలు వదలి, పిన్నలు చదువూ సంధ్యలు ఆపి క్షణమొక యుగంగా కాలాన్ని ఈడుస్తున్నారు. చచ్చే ముందైనా నవ్వుతూ చావా లన్న వేదాంత ధోరణితో మేము పేకాటలతో కాలక్షేపం చేసేవాళ్ళం. ఆనాడు 'అడ్డు కర్ర' మా కభ్యాసంలో ఉన్న ఆట. ఈ అడ్డుకర్రలో నేను అరితేరిన వాణ్ణిగా ఉంటిని. రజాకార్లు నిజాంపోలీసుల నుండి గ్రామాల్ని రక్షించుకోవడం కోసం మరొకవైపు యువకులతో గ్రామ రక్షక దళాలు ఏర్పడినాయి. అట్లా మా ఊర్లోనూ బలమైన రక్షక దళాలు ఏర్పడి చురుకుగా పని చేసినాయి. గుజ్జుల వీరయ్య గ్రామ రక్షక దళ నాయకుడుగా ఉండెడివాడు. ఈయన ప్రతినిత్యం రక్షక దళాల్ని వెంట తీసుకొని రాత్రంతా ఊర్లో గస్తీ తిరిగేవాడు. ప్రతి రాత్రి కనీసం ఒకటి రెండు సార్లయినా మా ఇంటికి వచ్చి మా నాయన గారిని 'సంతన్నా' అని లేపి పలకరించి వెళ్ళేవాడు. రజాకార్ల వాహనాలు ఊర్లో ప్రవేశించడానికి వీలు లేకుండా అన్ని బాటల్లోనూ లోతైన కందకాలు త్రవ్వినారు. తెల్లగ తెల్లవార్లూ వాడవాడకూ ఎల్లుని నెగళ్ళు మండుతుండేవి. ఆ నెగళ్ళ

వద్ద రక్షక దళ నాయకులు కాపలా పడుకునేవారు. అక్కడ నేనుకూడ పడుకోవాలని అమితోత్సాహాన్ని ప్రదర్శించేవాణ్ణి. ఐతే మా నాయనగారు నన్ను వదిలేవారు కాదు. ప్రతి ఇంట్లో వడిశెలలూ, బల్లాలూ, బర్శీలూ నాటు తుపాకులూ తప్పకుండ ఉండేవి. మా ఇంట్లో కూడ తరతరాలుగా వచ్చే పాతకాలం నాటి ఆయుధాలూ ఒక 'బజ్జాయి' ఉండేవి. వీటిని ఉద్యమ ప్రారంభంలోనే కమ్యూనిస్టులు తీసుకొని వెళ్ళినారు. గ్రామ రక్షణకోసం అవసరమైన నాటుతుపాకులవంటి ఆయుధాల్నీ మందుగుండు సామగ్రినీ మా ఊర్లోనే తయారు చేసేవారు. రజాకార్ల లారీలు గ్రామాన్ని ముట్టడించడానికి వస్తున్నాయని తెలిసికోగానే సర్దార్ సర్వాయి పాపన్న నిర్మించిన కోట బురుజుల మీద కాపలా కాసే వ్యక్తి డప్పు కొట్టేవాడు. అప్పుడు వెంటనే ఇంటికొక వీరుడు వీరభద్రుడై విజృంభించి ఊరు చుట్టూ వలయాకారంగా ఏర్పడి గ్రామాన్ని రక్షించుకొనేవాళ్ళు. ఇంటికో వీర వనిత అపర కాళికగా శివమెత్తి శత్రువుల కండ్లలో కారంచల్లి ఆత్మ రక్షణ చేసుకునేది.

గ్రామ రక్షక దళానికి నాయకత్వం వహించిన కారణంగా గుజ్జుల వీరయ్య మీద రజాకార్ల కన్ను పడింది. ఆతణ్ణి అంతం చేయాలని వాళ్ళు నిర్ణయించుకున్నారు. ఇది తెలిసిన గుజ్జుల వీరయ్య మొత్తానికే సాయుధ పోరాటంలో చేరినాడు. ఆయన కొంతకాలం ఆదిలాబాదు ప్రాంతంలోనూ పోరాటం నడిపిన విప్లవయోధుడు. ఇది ఆయన జీవితంలో ఒక మలుపు. అంతా మా ఊరికి చెందిన గుజ్జుల నారాయణ వంటి మరికొందరు యువయోధులు సాయుధ పోరాటానికి అంకితమైనారు.

అప్పుడప్పుడూ మా ఊరికి వచ్చి వెళ్ళే 'సంగపోళ్ళ' నుండి నేను పోరాటం పాటలు రాసుకొని కంఠస్థం చేసి పాడుకుంటూ ఆనందించే

వాణ్ణి. ఉద్యమకారుల్ని చూసి ఉప్పొంగి పోయేవాణ్ని. జనగామలోని ఆంధ్ర భాషాభివర్ధనీ పాఠశాలలో నాకు పాఠాలు చెప్పిన పంతులయ్య స్వర్గీయ గానుగుపాటి నారాయణరెడ్డి సాయుధ పోరాటంలో చేరినాడు. ఒకనాడు ఈయన్ని రజాకారులు పోలీపురం గ్రామంలో వెంటాడి పట్టుకొని కాల్చి చంపినారు. ఈతని స్మృత్యర్థం—

"ప్రజలు పడెడూ బాధ చూచి ఓర్వంలేక
పంతులయ్యా పనికి, స్వస్తి చెప్పొచ్చావు
త్యాగమూర్తివి నీవురా। కామ్రేడ్। ధన్యమూర్తివి నీవురా।
రాకాసి నైజాము రాక్షసాచర్యలను
రూపుమాపి ప్రజలు సుఖియించుటకుగాను
రంగాన దూకినావూ। కామ్రేడ్। రాక్షసుల తరిమినావూ।"

అనే ప్రజాగీత మొకటి వెంటనే ప్రచారంలోకి వచ్చింది. దీన్ని నేను అనాడే దళ నాయకులనుండి సేకరించి కంఠస్థంచేసి ఉంటిని. ఇదే ఆంధ్ర భాషాభివర్ధని పాఠశాలలో నాకు పై తరగతిలో ఉండిన చీట కోడూరు ముకుందారెడ్డి, వడ్లకొండ గ్రామానికి చెందిన ఇంకా మరి కొందరు విద్యార్థులూ సాయుధ పోరాటంలో ప్రవేశించినారు. మున్సి పరీక్షకు తయారవుతూ ప్రౌఢస్త్రమానం జనగామలో మా ఇంట్లోనే గడిపే చీటకోడూరు నారాయణరెడ్డి కూడ తుపాకి చేతబట్టి సాయుధ పోరాటంలోకి దూకినాడు. వీళ్ళంతా అప్పుడప్పుడూ దళంతో కలిసి మా ఊరికి వచ్చినప్పుడల్లా నా ఉద్రేకానికి ఉత్సాహానికి అవధులుండేవి కావు. అంతకుముందు కొద్ది రోజుల క్రితమే పాఠశాలలో నాకు సహచరులుగా ఉన్నవాళ్ళనూ, పాఠాలు చెప్పిన పంతులయ్యనూ కొత్త వేషంతో పోరాట దళంతో చూసేసరికి నాకొక విధమైన అనుభూతి

కలుగుతుండేది. వీరావేశం ముంచుకొని వచ్చేది. అయితే ఏం లాభం? అప్పటికి నా వయస్సు కేవలం 13 సంవత్సరాలు మాత్రమే.

తెలంగాణంలో సాయుధ పోరాటం గ్రామగ్రామంలో ప్రజ్వరిల్లిన రోజులవి. రేణికుంట రామిరెడ్డి, కుక్కారం రామిరెడ్డి, రజాకార్లతో పోరాడి వీరమరణం పొందిన వార్తలు మా కప్పుడు అందుతుండేవి. విప్లవవీరుడు స్వర్గీయ ఆరుట్ల రామచంద్రారెడ్డికి కొన్ని అద్భుత శక్తులున్నాయనీ ఆ మహిమలతో ఆయన పోలీసుల కన్నుగప్పి అంతర్ధానమవుతుంటాడని కొన్ని గాధలు జనంలో ప్రచారమైనాయి. ఇలాంటి వార్తలు విన్నప్పుడల్లా నాలోని ఉడుకు రక్తం ఉరకలు వేస్తుండేది. ఇదీ ఆనాటి పోరాట చరిత్ర. అదిగో అటు తమ ప్రాణాల్ని బలిదానం చేసిన త్యాగధనులు. ఇదిగో ఇటు తమ సర్వస్వాన్ని కోల్పోయిన కిరితాయులు. వాళ్ళు అమర వీరులు. వీళ్ళు అకాజ్యోతులు.

ఇక అసలు విషయానికి వస్తాను. తెలంగాణంలో సాయుధ పోరాటం సాగుతున్న కాలంలో అంటే 1947 ప్రాంతంలో నాకు 13 సంవత్సరాల వయస్సు. యాదగిరి చిన్నాయనకు 17 సంవత్సరాలు. ఆయన దృఢ చిత్తం కలవాడు. కటువుగా కనిపించేవాడు. కట్టె విరిచినట్లు మాట్లాడే స్వభావం ఉన్నవాడు. కాకి బేరాలకు తావిచ్చేవాడుకాదు. పట్టిన పట్టు వదలనివాడు. సంఘ చింతన చేసేవాడు. అవసరమైతే ఏవరినీ లెక్క చేయనివాడు. ఆటపాటల్లోగానీ, చదువు సంధ్యల్లోగానీ మేము సహచరులం.

ఒక రోజు ఎప్పటిమాదిరిగా యాదగిరి చిన్నాయన నాతో ఆట ఆడడానికి రాలేదు. అతని ఇంటికి వెళ్ళి మా 'కిష్టాయి' నడిగినాను.

సమాధానం రాలేదు. మావాడతో అడిగిచూసినాను... ఆయనకీ తెలియలేదు. ఊరంతా వెదకినాను. జాడ కనిపించలేదు. [illegible] అడిగినాను. మౌనంగా ఉంది మాట్లాడలేదు. [illegible]

నాను. రాతి గుండెను ప్రదక్షించింది. తూర్పున 'రావిచెట్టు' నడిగినాను. దాని ఆకులు తాకుల్లా కదలాడినాయి. ఉత్తరాన మా 'పెంటపురంబావి' నడిగినాను. కల్లోల జలధివలె కనిపించింది. దక్షిణాన 'ధర్మబడి' నడిగినాను. 'సంఘం శరణం గచ్ఛామి' అన్నమాటలు దాని గోడల సందుల్లోనుంచి సన్నగా వినిపించినాయి. మరెక్కడికి వెళ్ళినట్లు? ఆయన ఏం చేస్తున్నట్లు??

"గద్దె దిగరా నైజాం రాజా వద్దోరిపోరా!
సాగదోరీ నీ కసాయి పాలన
స్వాతంత్ర్యోజ్వల జగత్తులో
పోరాటఫలమున నీ ప్రభుత్వమును
గోరి గట్టుటే నిక్కము రా!"

అన్న పాట తెలంగాణా ధరిత్రిలో ప్రతిధ్వనించింది.

ఇక చదివి మీరె పోల్చుకోండి
పెర్మాండ్ల యాదగిరిని.

పేర్వారం జగన్నాథం

# సవరణలు

| పుట | పేరా | పంక్తి | ఉన్నది | ఉండవలసింది. |
|---|---|---|---|---|
| 8 | 1 | 2 | స్ఫూర్తినిస్తున్నదిగా | స్ఫూర్తినిస్తున్నట్లుగా |
| 10 | 3 | 1 | ఇక | ఇక్కడ |
| 22 | 2 | 4 | వంచిన | వచ్చిన |
| 23 | 3 | 7 | ( — ) | (మెచ్చుకొనే విధంగా) |
| | | 11 | రావల్సింది | రావలసిందె |
| 27 | | 5 | కొండెల్లి | కొంపెల్లి |
| 34 | | 1 | శ్రీ నృసింహశర్మ దాశ్లేటి | శ్రీ దాశ్లేటి నృసింహ శర్మ |
| | | 4 | మదికొండ, మెట్టుగుట్ట | మదికొండ మెట్టుగుట్ట |
| 39 | | | యువనాయకుడై | యువనాయకుడైన |
| 40 | | | అట్టడుగుపడిన | అట్టడుగున పడి |
| | | 11 | కట్టూరి | కటుకూరి |
| 69 | | 3 | అగ్నిగుండం | అగ్నిపర్వతం |
| 77 | | 2 | కాంమానక | కాలిమాదక |
| 88 | | 3 | అరకు | వరకు |
| 89 | | 5 | గ్రామాన్ని | గ్రామాల్ని |
| 96 | | 5 | ఎందుకు | ఎందరు |
| 97 | | 10 | క్షణక్షనికి | క్షణక్షణానికి |
| 111 | 2 | 3 | దారక | దొరక |
| 112 | 1 | 7 | స్వరూపులైలు | స్వరూపులైన |
| 125 | | 6 | బొండ్ల | బెండ |

110 - 111 పుటలు అటు-ఇటుగా పడినవి. గుర్తించవలెను.

## ౧ వూరు –

# నేను జన్మించిన

కత్తి ముందా? లేక కలం ముందా? అనే ప్రశ్నకు పెద్దలు విద్యావేత్తలు—ఏది ముందంటారో నాకేమీ తెలియదు. కాని నా మట్టుకు నేను కత్తే ముందంటాను. ఎందుకంటారా? నా ఊరు చరిత్ర కాస్త వెనక్కు వెళ్ళి తెల్సుకుంటె నాకు తెల్సింది కత్తేనని.

నేటికి మూడువందల సంవత్సరాల క్రితం మొగల్ చక్రవర్తుల పాదాలక్రింద మన దేశం నలిగిపోతుంటె, మన సీమలు వల్లకాడులౌతుంటె, చూస్తూ సహించలేని వీరులెందరో, మొగల్ సామ్రాజ్యానికి ఎదురు తిరిగారు. అటు వీర శివాజీ మహారాష్ట్ర మొదలు ఉత్తర భారతాన్ని వూపివేస్తున్న రోజుల్లోనే, దక్షిణంలో ముఖ్యంగా మన తెలుగు గడ్డపై మన సర్వాయి పాపన్న మొగల్ చక్రవర్తుల తాబేదారులైన గోలుకొండ నవాబుల, పైశాచిక పరిపాలనపై తిరుగుబాటుకు సర్వశక్తులను సమీకరించాడు, ఆ పరిపాలనలో అణగిమణగి

నిద్రాణంలో వున్న పల్లె యువకుల కూడగట్టాడు.

మా గడ్డపై ఆ కోటను నిర్మించుటకు ఒక సమయమున స్థల పరిశీలన జరుపుచుండగా, ప్రక్కనే యున్న ఒక పొదలో నుండి కుందేలులేచి హోపన్న వెంటయున్న కుక్కను తరిమిందట: ఆ సామెత ఈ కోటకు వుంది.

ఇది ఒక సంభవం కావచ్చు. మరి ఏది సంభవం? పల్లీయుల చేత శౌర్యం ఎట్లా వచ్చింది? బహు ఖండాలలో రవి అస్తమించని సామ్రాజ్యాన్నేలిన, తెల్లదొరతనాన్ని తన చిన్న చీవి మీదికి ఎట్లా తరిమింది? ఈ కెంపూ వాస్తవమే అయితే—ఆ సాధు జంతువులైన కుందేళ్ళు కుక్కపై తరమకూడదని ఏమైనా వుందా?

ఈ విశాల భారతాన్ని ఏలుతున్న క్రూర చక్రవర్తులను కుందేళ్ళలాంటి సాధుజనమే తరిమి కొట్టింది. శాంతి కొరకు, స్వేచ్ఛ కొరకు, మొండి హోపన్న తన కత్తిని ఝుళిపించాడు. తర్వాతే శాంతి ఏర్పడింది. అప్పుడు స్వేచ్ఛ ఏర్పడింది. ఇక సాఫీగా సాగింది కలం. సాగింది ముందుకు. ఈ గడ్డమీద వంద సంవత్సరాలకు కలం నడిచినట్లుగా దాఖలాలు వున్నవి నేటికి. ఆదే శ్రీ పాగాల శరభయ్యగారి కుమారుడు శ్రీ కొట్టూరయ్యగారు నేటికి సుమారు రెండు వందల సంవత్సరాల నాడు తన కలంతో (ఘంటము) "బసవ రాజీయం", "చింతామణి" అను శైవ్య గ్రంథములను తాటియాకుల పైన వ్రాసుకొన్నవి నేటికి వారి నాలుగవ మనుమడైన శ్రీ పాగాల

జమీందారి వద్ద భద్రపరచబడియున్నవి, ఆ తాళపత్ర గ్రంథములు.

నాడు గౌడ కులానికి చెందిన సర్వాయి పాపన్న ఈ కోటను నిర్మించి మొగల్ చక్రవర్తులకు ఎదురుతిరిగి ప్రాణాలొడ్డితే, నిన్న మొన్ననే అదే గౌడ కులానికి చెందిన మరో వీరుడు – నిజాం పరిపాలనకు, జమీందారీ, జాగీరుదారీ, భూస్వామ్య విధానం రద్దు కొరకు సాగిన సాయుధ రైతాంగ పోరాటానికి, ఆయుధాన్ని చేత ధరించి ఈ కోటపైనే షహీదా జాస్తూ ప్రాణాలొడ్డింది అమరుడైన మన గొల్లపల్లి రాంమల్లయ్యగారు. తర్వాతే శాంతి ఏర్పడింది. అందుకే నా కలం ముందుకు సాగుచున్నది.

## ప్రకృతి ఒడిలో సుందరంగా ఒద్దుతున్న నా పల్లె

మా గ్రామం హన్మకొండ హైదరాబాద్ రహదారికి (లీ) ఐదు కిలో మీటర్ల దూరం రఘునాథపల్లి రైల్వేస్టేషన్‌కు సరిగ్గా పడమటి దిశలో వుంది. దాని పేరు "ఖిలాషాపురం".

నాడు ఎవరైనా గ్రామానికి రావలిస్తే ఖిలాను (కోట) చూస్తూ పయనిస్తే నది, దట్టమైన కంచలు, క్రిక్కిరిసిన మోదుగలు, వేపలు, సంద్రలు, తుమ్మలు, తాటితోపుల మధ్యనుండి వంకర టింకరగా యున్న బాటలు, ఒంటరిగా పట్టపగలు నడిచినా భయపడక మానరు ఏ వ్యక్తి అయినా. అలా నడచి వచ్చిన వ్యక్తికి నాడు నేడు గ్రామ

ముంగిటిలో యున్న రావిచెట్టు సుస్వాగతం పలికి చల్లని గాలితో సేదదీరుసుంది.

ఇక మా గ్రామ ప్రధాన వీధిగుండా నడుస్తూ గ్రామ నది బొడ్డుకు చేరుకోగానే నాలుగు బాటల కూడలి మధ్యన ఎత్తైన ఒక చావడి దానిపై నాటి విజయ సంకేతంగా యున్న ఒకనాటు ఫిరంగి, చిన్ని గుండ్లు పదుపుగా తర్కసమిచ్చేవి. ఆ ఫిరంగిని చూడగానే, ఎవ్వరికైనా ఓహో ఇది పరగట్లా, ఇదేనా మొగల్ సామ్రాజ్యానికి, గోలుకొండ నవాబుల పతనానికి ఛోలిదెబ్బ కొట్టింది ఇక్కడేనా? అని అనుకొని అక్కడి నుండి తిన్నగా ఉత్తరము వైపుకు తిరిగి పంద గజాలు నడుస్తామో లేదో, కోట ముఖ ద్వారం వచ్చేస్తుంది.

ముందు దక్షిణం వైపు అతి సామాన్యంగా వున్న ద్వారం నుండి తూర్పు దిశకు తిరగ్గానే, అతి బ్రహ్మాండమైన ఎత్తైన దుర్భేద్య మైన ప్రధాన ద్వారం వచ్చేస్తుంది. ఆ నిర్మాణాన్ని తలపైకెత్తి చూస్తూ పదడుగులు వేశామో లేదో, ఒతి చిన్నదైన మూడవ ద్వారం వచ్చేస్తుంది. ఆ ద్వారంనుండి విశాలమైన కోటలోకి ప్రవేశించాలంటే, పూర్తిగా చేతులు భూమికి ఆనిచ్చి వంగి నడవటమో లేక కూర్చుండి పోవటమో జర్గాల్సిందే.

శత్రువు దుర్భేద్యమైన ఎత్తైన ద్వారాన్ని పగులగొట్టి రాగల్గుతే ఈ చిన్న సామాన్యమైన మూడవ ద్వారం ద్వారా లోనికి ప్రవేశించా లంటె ఇరువైపుల కోట నుండి ఆ నాటి సలసల కాగే నూనెను పైన

క్రుమ్మరించేవారట, ఇది ఎట్లాగో తప్పుకున్నా శత్రువు ఏ విధమైన పోరాటాన్ని సలపకుండా కూర్చుండి నెమ్మదిగా కోటలోకి ప్రవేశించుటకు సాహసిస్తే శత్రువును అతి సులువుగా దెబ్బకొట్టే విధంగా నిర్మించబడింది.

ఇక మనం యివన్నీ దాటి లోనికి ప్రవేశించగానే విశాలమైన స్థలం, మధ్యలో ఎదురుగా మరో ఎత్తైన బురుజు దర్శనమిస్తుంది. అప్పుడు గాని మనకు ఈ దుర్భేద్యమైన దుర్గాన్ని వశపరచుకున్నంత అనుభూతిని పొందలేము. ఆ సంతోషం తోటె కోట ఉత్తరం వైపు నడుస్తూ నైరుతి మూలకు ఎక్కి పిట్టగోడ ప్రక్కన నిలబడి చూస్తుంటె ప్రకృతి ప్రసాదించిన దృశ్యాలు మన కళ్ళముందు కదలాడుతాయి, తెర మీది దృశ్యంలా.

ఆలయించిన పిదప తన భూభాగపు ఎల్లలను నిటారుగా నిలబడి చూస్తుంటె, కొండలు, కోనలు, దట్టమైన అడవులు, మధ్య మధ్యన పచ్చిక మైదానాలు, సెలయేరుల్లా పారిన నదుల ఒంపు సొంపులు, దూరంగా సోపానంమాలుగా నింగిని చుంబిస్తున్న గోపాల స్వామి కొండ సానువులు, కాస్త దిగువకు చూస్తే పులి బొద్దులు, అక్కడ నుండి దక్షిణ దిశకు గ్రామాన్ని పడమటి వైపు నుండి చుట్టేస్తూ సాగిన కొండలు, మధ్య మధ్యన మానవ నిర్మిత తటాకములు, మన కళ్ళముందు ప్రకృతి ప్రసాదించిన సరస్సులా కనువిందుగా కనిపిస్తాయి.

కోటకు నైరుతి మూలన సుమారు రెండు (2) కిలోమీటర్ల

దూరంలో గరుగుబాయి ఆయకట్టున, అమరవీరుల సమాధులు, మనకు ఇప్పటికీ స్ఫూర్తి నిస్తున్న విగా ఆ విశాల ప్రదేశమంతా వందలు వేలుగా మన కళ్ళముందు కదలాడుతుంటె నిశ్శబ్ద గంభీర వాతావరణం మనల్ని చుట్టేసి నిలేస్తుంది. ఒక నిమిషం మౌనంగా అక్కడి శౌర్యానికి, పరాక్రమానికి తోడునీడగా నిలిచిన వీర హనుమాన్ విగ్రహం ఆ సమాధుల రక్షిస్తున్నట్లుగా వుంది నేటికీ.

కోటకు అతి సమీపంగా వీరులబండగా నేటికి పిలుస్తారు. ఇక్కడ నాడు బహుశా సమావేశమయ్యేవారేమో, లేక కోటలోనుంచి త్రవ్విన సొరంగమార్గాన ఇచటనుండి వచ్చి పోయేవారేమో, ఇంకా కోటకు దగ్గరగా పడమటికి నడిచి నైరుతి వైపున చిట్టెపుగడ్డ దర్శనమిస్తుంది. ఇక్కడ ఆయుధాలకు కావలసిన ఉక్కును కొలుములలో కరుగబోసి చేసేవారేమో. అందుకే కరుగ బోసినప్పుడు వెళ్ళి ఇనుముతో వున్న మట్టి పెళ్ళలు, కొలుముల నుండి తీసిన నల్లటి బూడిద నేటికి వుంది ఈ స్థలంలో.

ఉత్తరాన్నే ఉన్న పచ్చిక మైదానాల్లో వందలు వేల సంఖ్యలో ఆవుల మందలుండేవని, అవి గోవులగూడెం అనే స్థలంలో విశ్రాంతి తీసుకొనెవనియు, ఇక్కడే మరో చిన్న బురుజు కూడా వుంది. ఈ బురుజు పై నుండి ఇటు గోవులను పరికించటానికి, అటు ప్రధాన దుర్గానికి సంకేతాలిచ్చేటందుకు గాని ఉపయోగపడేదని ప్రతీతి. ఇంకా ఎన్నో, ఎన్నెన్నో.

నాడు దట్టమైన అడవులు, పచ్చిక మైదానాలు, కొండలు, కోనలతో చూడముచ్చటగా వుండే, నేడు వీటి స్థానంలో పచ్చని పంట పొలాలు, ఆ పైరులనుండి చల్లని పిల్లగాలులు వీస్తుంటే, ఆ అందమైన పంటచేలను, కోట పై భాగం నుండి తిలకిస్తుంటె, గుబురు గుబురుగా పెరిగిన చింతలు, వేపల మధ్య నుండి కనిపించే పెంకు టిల్లు, గుడిసెలు అక్కడక్కడ చెదురుమదురుగా వున్న మిద్దెలు, ఆలయగోపుర శిఖరాలు, శ్రమజీవుల కదలికలు, పిల్లల కేరింతలు, వింటూ చూస్తూ అలాగే మైమరచి ఉంటారు ఎవ్వరైనా.

అయితే సర్వాయి పాపన్న కోటను నిర్మిస్తున్న కాలంలో గ్రామం మాత్రం ఈకోట చుట్టూగాక, కోటకు దక్షిణం వైపు నేడున్న పోశమ్మ, హనుమాండ్ల గుడి ముందు నుండి పశ్చిమంవైపున ఉండేదని నాటి ఆనవాళ్లు చెబుతున్నవి.

నిన్న మొన్న వెలసిన ప్రభుత్వ గృహాలకు కావలసిన రాయి రప్ప వాటి కొరకు ప్రజలు త్రవ్వకాలు జరుపగా, ఈ స్థలములో నాటి శివంతుల పునాదులు, మధ్యన వుండే అరుగులు, శివంతుల నుండి నీరు వెళ్ళటానికి ఉపయోగించిన పొడవాటి దృఢమైన మట్టితో చేసి కాల్చిన గూనలు (పైపులు) సున్నంలో నిర్మించిన చెక్కుచెదరని మనసాలలు (గదికి గదికి మధ్యన ఉండే స్థలం) నాటి పురాతన చేద బావులు ఇప్పటికి ఉన్నవి. వీని ప్రక్కనే 'రాసప్ప బావి' అనే పేరు గల బావి నేటికిని వ్యవసాయానికి ఉపయోగంలో ఉంది. నాడు ఈ గ్రామాన్ని ఏ చిన్నపాటి రాజు పాలించాడో తెలియదు. ఆ రాజుగారి

ఇంటికి కావలసిన మంచి నీటికి త్రవ్వినదై యుండాలి. అందుకే రాస, రాసప్ప బావియని నేటికి వాడుకలో పిలుస్తుంటారు.

ఈ విషయం చరిత్రకారులు, పురావస్తు శాస్త్రజ్ఞులు నిర్ణయించాలి తప్ప నా లాంటి సామాన్యుడు నిర్ణయించలేడు.

ఏది ఏమైనా ఇక్కడి ప్రతి అడుగు నేలకు గ్రామానికి ఎంతో చరిత్ర ఉంది, అని చెప్పటానికి సాహసించడములో తప్పులేదేమో.

అంతేనా! ఒకానాడు వీరత్వానికే ప్రసిద్ధి చెందిందేకాదు, విద్య, వైద్య, జోతిశ్శాస్త్రంలోనూ, సంగీత, సాహిత్య, నాట్యకళా రంగాలలోనూ, మరెంతో ప్రఖ్యాతి చెందింది. నాడేకాదు నేడుకూడ, అందుకే ఈ గడ్డమీద పుట్టడం నా అదృష్టమని సగౌరవంగా చెప్పుకొంటాను నేను.



# జమీందారి - భూస్వామ్య విధానం

మా గ్రామం నిజాం నవాబుగారి స్వంత పరిపాలనలో వుండేది. నిజాం స్టేట్ యంత్రాంగముతో, దీనికి సంబంధము లేదు. అందుకే దీన్ని "సర్ఫెఖాస్" అంటారు. (ప్రత్యేకించి స్వంతం అన్నమాట) ఈ సర్ఫెఖాస్ గ్రామాల ఆదాయం నవాబుగారి స్వంత ఖర్చులకు మాత్రమే ఉపయోగపడుతుంది. నిజాం స్టేట్‌లో సర్ఫెఖాస్‌లుగా యున్న గ్రామాలన్నిటికీ తాలూకా షర్కి అని (అంబర్‌పేట) జిల్లా, అత్రాప్‌బల్దా అని (పట్టణం చుట్టూఉన్న ప్రాంతం అని అర్థం) పర్యవేక్షణలో ఉండేది.

ఈ గ్రామ ప్రజలు పరిపాలనా సంబంధమైన, లేక తమ దైనందిన వ్యవహారములు పరిష్కరించుకొనుటకు, తాలూకా లేక జిల్లా వెళ్ళాలంటే, నేరుగా హైద్రాబాద్ నగరానికె వెళ్ళాల్సి వచ్చేది. సామాన్యులు అట్టడుగున పడి నలుగుతు, ఇంత వ్యయ ప్రయాసాలకు ఓర్చి వెళ్ళదలచినా పందమైళ్ళు ప్ర యా ణ

సౌకర్యాలు లేని ఆ రోజుల్లో ఎవరికి సాధ్యం? ఈ ఇబ్బందుల వల్ల సర్కార్ అంటే (ప్రభుత్వం) ఏమిటో నాటి ప్రజలకు తెలిసిందికాదు.

వారికి తెలిసిందల్లా, వారి మీద ప్రతి నిత్యం పెత్తనం చేస్తు స్వారీచేసే దొరలు, దేశ్‌ముఖ్‌లు, పిల్ల జమీందారులు, వారి గుమస్తాలగు పటేల్ పట్వారీలు. వీరికి జోహుకుమ్ లా (ఆజ్ఞలు) ఉండి ఎంతటి ఘాతుకాలకైనా వెనుదీయని గుండా గుంపులు మాత్రమే.

ఇక ముగ్గురు పెద్ద దొరలు - ఒకరు లింగాల వేంకట రంగారెడ్డి, మరొకరు వెల్లుట్ల కేశవరావు, మూడవవాడు లంగ రాజా కేశవరావుగారలు. మొదటివాడు పన్నెండు గ్రామాల జమీందారు. రెండవ వాడు పది గ్రామాలకు, మూడవవాడు ఐదు గ్రామాలకు జమీందార్లు. ఈ ముగ్గురికి తమ గ్రామాలలో పటేల్, పట్వారీ, మాలి, హోదాలు గల వతన్‌లు, వీరి వీరి ఇష్టం వచ్చిన వారినే గ్రామాధికారులుగా నియమించనూవచ్చు, లేదా తీసెయ్యనూవచ్చు. సర్వాధికారాలు ఈ దొరలవే. ఇక పిల్ల భూస్వాములు ఇద్దరు. ఒకరు నర్సయ్య పంతులు (మంగు సింహాద్రి) మరొకరు రాంసింగ్ పంతులుగారలు. ఈ ముగ్గురు దొరలకు ఉన్న భూమిలో 80 శాతము, పిల్ల దొరలకు 5 శాతం మిగతా 15 శాతం భూముల్లో ఇనాంలు పట్టాలు, తదితరములు. (ఈ శాతం లెక్కలు సుమారుగా వేశాను).

ఇందులో సారవంతమైన మెట్ట, నీటి పారుదల కల్గిన మాగాణి, చక్కటి తోట భూములు, దాదాపు దొరల స్వంత సేద్యం క్రిందనే. పట్టి దుబ్బలు, గరిక నేలలు, చౌడుభూములు, ఒంపులు, వర్రెలు, సారహీనమైన భూములన్నీ అక్కచిక్కిన రైతులకు కౌలుదార్లకిస్తూ. ఏటికి విపరీతమైన కౌలు రేట్లు. పశులమేత భూములకు పుల్లరి. సుంకం వేరే. మేకలకు గొర్రెలకు సుంకం అదనం. ఈ విధంగా నాటి మాటల్లో చెప్పాలంటే తోక సుంకం కట్టాల్సిందే. చిన్నా పెద్దా లేదు. తోక తాగే నిమిత్తం.

ఈ కౌలుదార్లు మొదట తమ భూస్వాముల భూములన్నీ ఉచితంగా దున్నిన తర్వాతనే తమ భూములు దున్నుకోవాలి. దొరల అదనుకు విత్తనాలు, నాట్లు ముగిసిన తర్వాతనే వీరి పనులు. గొడ్లను ఉచితంగా సరిపోను మందలు పెట్టాలి. వంతుల వారిగా తమ గొర్రెలను, మేకలను ఇచ్చుకోవాలి. పండుగలకు, అదనపుగా విందులు, వినోదాలు, చావు పుట్టుకలకు, పెండ్లి పేరంటాలకు సమర్పించుకోవాలి. అంతేనా ఈ అక్కచిక్కిన కౌలుదారులు, రైతులు, తమ ఇండ్లలో పెండ్లో-చావో-పుట్టుకో జరిగినా నజరానా రూపంతో ఇచ్చుకోవాలి. ఇంతటితో ఆగిందా లేదు. ఏ కులాన్నీ వదలలేదు. ప్రతి వృత్తిదారు తమ వృత్తిని బట్టి వెట్టి చాకిరి చేయాల్సిందే. గౌడుల గోడు మరీ అధ్వాన్నంగా వుండేది ఆ రోజుల్లో.

ఈ తాటి, ఈత చెట్లుగీసి కల్లు తీసేది గౌడులైనా వాటి మీద ముస్తాజర్లు (కాంట్రాక్టర్లు) గా వుండేది పెత్తనం చేసేది మాత్రం దొరలే. ప్రతి సంవత్సరం జరిగే వేలం పాటలలో ఈ దొరలే ముందుండి అతి తక్కువ వేలంకు పాట పాడి తీసుకొని తదుపరి అత్యంత లాభాలకు ఈ గౌడుల నెత్తినరుద్ది వారి రక్త మాంసాలను పీల్చి పిప్పి చేసేవారు. ఇక 365 రోజులు వారికి కావలసినంత కల్లు, వారు చెప్పి పంపిన వారికి ఉచితమే. పటేలు, పట్వారీలకు, వారి గుమస్తాలకు, సేరీదార్లకు, చివరకు సేరీలో ఉన్న పెద్ద జీతగాండ్లకు, ఉచితంగానే పోయాలి. అంతేనా- పెండ్లి, పేరంటాలు, మొదలగునవి వస్తే గౌడులు వస్తులతో పడి చస్తున్నా వేళకు మాత్రం కల్లు గీసి తీసుక రావలసిందే.

## నా చిన్ననాటి ఒక అనుభవం

వడ్డేపల్లి పింగళి దొరలు ఈ ఊరు సూపులా పట్టారట. వారికి ప్రతి నెల చెల్లించవలసిన పన్ను చెల్లించ నందులకు వసూళ్ళ నిమిత్తం వచ్చాడు ఒకతను. వాడు అజానుబాహుడు. ఎత్తుకు తగ్గ దొడ్డు, కోరమీసాలు కలిగి తలకు పెద్ద రుమాలు చుట్టి, నెత్తిన కొసలు ఎగురుతుంటె మరో చివరికొస వెనుకవైపు సొక్కి కట్టాడు. భుజానికి నడుముకు బెల్టు బిగించి వుంది. ఆ బెల్టుకు ఒక జెంబియా (బాకు) నిలువు కత్తి (తల్వార్) భుజాన తగిలించాడు. ఇక చేతిలో తోలుతో అల్లిన హంటర్. ఈ వాలకం చూచినంతనే కెవ్వుమని కేకేసి నంతలోనే నా

నెక్కురు తడిసింది. ఏడ్చుకుంటూ ఇంటికి పరుగెత్తాను.

ఆ రాక్షసున్ని చూచిందే తడవుగా గౌడులు గజగజలాడి పన్నులు చెల్లించాల్సిందే. చెల్లించని వారికి కొరడా దెబ్బలు వారి మోకులు నరికి వేయుటము, ఆ రాక్షసుడి కాళ్ళపై బడి, భార్యాపిల్లలు ఎంత విలపించినా కరుగని రాతి గుండె, ఆ భీభత్సకాండ జరుగుతుంటె ఏమిటీ? అనే నాథుడేలేడు ఆనాడు. ఈ విషాద సంఘటన ఇప్పటికి నాకళ్ళముందు కదులాడుతుంటె ఒళ్ళు జలదరిస్తుంది నేటికి.

## కౌలుదార్ల, పేద రైతుల దుస్థితి

దొరల ఇండ్లలో ప్రత్యేక కార్యక్రమాలు జరిగితే, పాలు, పెరుగు, నెయ్యి, కూరగాయలతో సహా తెచ్చి యిచ్చుకోవాలి. ఇందులో ఈ దొరల చల్లని చలువ, కరుణ కలిగి కనికరిస్తారేమో యనే ఆశతోటి అమాయకులు ఒకరికి మించి మరొకరు యిచ్చుకొనేవారు. వీటిని ఆసరా చేసుకొని దొరలు, దొరసాండ్లు పుణ్యం, పురుషార్థం మోక్షం కొరకు గుళ్ళల్లో నిత్య నైవేద్యం అన్నదానాల సంతర్పణలు, దాన ధర్మాలు చేస్తుంటె, అవి పుచ్చుకొని ఆహో-ఓహో, ఎంత వైభవం, ఎంత త్యాగం, కీర్తించే స్వాములోర్ల వంశంమీద, బ్రతికి నోరిమీద, చచ్చినోరి మీద, రేపు పుట్టెటోళ్లమీద కవితలల్లి ఆకాశానికెత్తి హారతులిస్తూ గానం చేస్తుంటె ఆ తన్మయత్వంతో వోలలాడి అత్తగారి

సౌమ్ము అల్లుడు దానం చేస్తున్నట్లు దానధర్మాలు జోరుగా సాగిపోయేవి.

నలుదిశల దేదీప్యమానంగా ప్రకాశిస్తున్న ఈ దొరల జ్యోతి కీర్తి ప్రతిష్టలకు ఎంత చమురు కాలితే ఇంత ప్రకాశిస్తుంది జ్యోతి. ఈ జ్యోతికి అడుగున కాలుతున్న చమురు నెవరు చూస్తారు? ఆ చమురే శ్రమ జీవులు కంటబడి పెట్టు కొని సమర్పించుకొన్న కన్నీరు. ఆ కన్నీరునే పన్నీరుగాను, వినోదాలు విందులకు గాను మార్చుకొన్నారు ఈ దొరలు.

అంతేనా! వాడు ఎంతటి నీడానికైనా మరెంత ఘోరమైన ఘాతుకానికైనా సందేహించరు. ఈ పేదోళ్ళ యింటిలో చక్కటి ఆడపడుచున్నా అనుభవించుటకు సంకోచించని ధీరులు. ఇదేమి అన్యాయమన్నా వారి క్రింద ఉండె రౌడీలు తెల్లవారే సరికి కొంపకు నిప్పంటించి, పంట పొలాలను నాశనం చేసి, ఎదురు తిరిగినవాడి శవాన్ని దొరక్కుండా చెయ్యగల దిట్టలు.

తమ తోటలోని ఏ అందమైన పుష్పాన్నైనా త్రుంచి, ఆస్వాదించి నలిచి పారేసె హక్కు వున్నట్లుగా తమ గ్రామాల లోని ఏ ఆడపడచునైనా అనుభవించి వెల్లగొట్టె హక్కు వున్నట్లుగా మెదిలేవారు. పైగా ఈ దొరలు ఎవరు ఎందరిని చెఱ పడితె అంతటి మొనగాడు, ధీరులు శూరులుగాను, వెలామని

అయ్యేవారు. ఆ విధంగా చెయ్యనివాడు ఎవ్వడైనా వుంటె వాడు పుట్టి పనికి మాలిన చవట క్రింద లెక్క.

అందుకే 20 సంవత్సరాల క్రితం 1968లో శ్రీ ఆచార్య పేర్వారం జగన్నాథంగారు శ్రీ రంగరాజు కేశవరావుగారు రచించిన "ఇంద్ర ద్యుమ్నీయం" అను గ్రంథమునకు పీఠిక వ్రాస్తూ—రావుగారు "బహు భాషా పండితుడె కాదు, ధైర్య సాహసములు గలవాడు, వేటలో దిట్ట. ఎంతటి దారుణానికైనా వెరపడని తెలుపుతూ" ఒకప్పుడు జిల్లా కలక్టర్ (నాటి అవ్వల్ తాలూక్ దారు) గ్రామమునకు రాగా రావుగారు ముప్పతిప్పలు పెట్టిరట. దొంగ సంతకములు, దొంగముద్రలు, కూట తయారుచేసి ప్రభుత్వ రికార్డులను తారుమారు చెయ్యటమేకాదు అతి నైపుణ్యంతె చెదలు పట్టించి వాటి కనుకూలముగా మార్చు కొన్నారట—" "ఇంకనూ రావుగారికి డబ్బు కొరత ఉంటె—" రాత్రులందు దొంగల ముఠా వచ్చుచున్నట్లుగా వారి క్రింది ఉద్యోగులతో తతంగము చేసి తుపాకులు ప్రేల్చి ప్రాణరక్షణము కొరకనే నెపంతో షావుకారుల నుండి డబ్బు తీసుకొని, అవసరము తీరగానే తిరిగి యిచ్చేవారట." ఇటువంటి కొన్ని గడుసరి పనులు తప్ప మిక్కిలి ఉదారవాసులని, దానశీలుడు, దయామయుడు, సాహిత్య గోష్ఠులతో నిత్యము కళకళ లాడెడి దట"— అని అతి సున్నితంగా మెత్తగా దెబ్బకొట్టినట్లె కొట్టి, పొగడినాడు.

మరొకరు శ్రీ నెల్లుట్ల కేశవరావుగారు. మంచి విలాస పురుషుడు, డబ్బును మంచినీళ్ళ ప్రాయంగా వాడితే, ఇంకొకరు శ్రీ లింగాల వేంకటరంగారెడ్డి వట్టి పిసినారు. వీరి బంగ్లా ముందు కూరగాయలమ్మో అని అరిచేవారు టపిక్కున ఆపి బంగ్లా దాటిన తర్వాతగాని అరువరు. పొరపాటున చెవులవారు విన్నారో, ఇక వారి జేరం చెల్లినట్లే. వీరు కొనేవి పావు కిలో. అందుకు వారిని నానా విధాల పిండి పీడించి కొన్నదాని కన్న కొసర్ల రూపంలో రెట్టింపు లాగి, యిచ్చే నాల్గణాలలో మూడు అణాలే యిచ్చి, ఆ ఒక్క అణా కొరకు మళ్ళీరా, రేపురా మాపురా అని విసిగించటం వీరి నైజం. అందుకే ఆ గంప లమ్మలు పోతేపోయింది అణా అంటూ వెళ్ళిపోయేవారు.

## పిల్ల జమీందార్లగు పటేలు, పట్వారీ, గుమాస్తాల ప్రభావం

ఈ పిల్ల జమీందారులు, దొరల గుమస్తాలుగాను, పటేలు పట్వారీలుగాను, ఉండి దొరల వ్యవసాయం, తదితర వ్యైరవీలు చూచెవారు. అందులో వీరు —

రాంసింగ్ పంతులు : వీరు నెల్లుట్ల దొరవారికి "ముఖ్త్యార్ అమ్" (పవర్ పట్టా) కలిగినవారు. వీరికి దాదాపు 600 ఎక రాల వరకు భూమి వుండేది.

మంగు నర్సయ్య పంతులు : వీరు పట్వారీగా పనిచేసేవారు.

పీరికి సుమారు 900 ఎకరాల వరకుభూమి కలిగినవారు. వీరినే సింహాద్రి పంతులు అని గూడ పిలుస్తారు.

శ్రీ భాష్యం వరదాచారి : వీరు మాలీ పటేల్‌గా పనిచేసేవారు. వీరికి సుమారు 400 ఎకరాలకు పైగా వుండేది.

ఇక గులాం రసూల్ పంతులు, శేఖ్ అలీగారలకు చెరి రెండొందల ఎకరాల వరకు భూములున్నవారు. వీరు దొరల వద్ద పంతులవారిగా గుమస్తాలుగా పటేలు పట్వారీలుగా పనులు చేసేవారు.

నాడు వీరిదంతా ఒక ముఠా, దొరల గుమస్తాలే గాక అంతరంగిక సలహాలిచ్చేవారూను. వీరి సలహా లేనిదే దొరలు ఏమి చెయ్యలేని నిస్సహాయులు. ఒక్కమాటలో చెప్పాలంటె దొరలు చేసే ప్రతి పని వీరికి తెల్సినదనటమేకాదు, అనుమతి కూడ అవసరం. అందుకే నాడు "దొరల కన్న మిన్న - దొర తొత్తులో యన్న" - నాటి సామెత వీరికి అక్షరాల వర్తిస్తుంది. వీరు నాడు చేస్తున్న కొన్ని నీచపు పనులను వివరించుకొని కాస్త దూరంగా వుంచుటకు ప్రయత్నించిన దొరనే మట్టుపెట్టు టకు వెనుకాతలేదు. అందుకే వీరు ఎంతటి దారుణానికైనా తెగించుటకు వెనుకాడరని అర్థం చేసుకోవచ్చు.

ఉదా : నెల్లుట్ల కేశవరావుగారి అన్నయగు శ్రీ వేంకట రామారావుగారు తమ శైతులు, కౌలుదార్ల భూ సంబంధమైన వ్యవహారములు, మంచిచెడులు, ప్రభుత్వ కార్యభాధకులుకూడ

చూచుకొనేవారట. ఆదాయ వ్యయములు ఎప్పటికప్పుడు పరిశీలించేవారట. వీరు తప్పుడు పనులకు దిగినా, లేక తనకు తెల్పక చేసిన పనులకు చీవాట్లు పెట్టేవారట. అందుకు వీరు ఆ వయస్సులోనే యింతకు దిగితే, ముందు ముందు మనకు కొరకరాని కొయ్యలా తయారుకావచ్చునని, కుట్రపన్ని పందేళ్ళ షికారుకు ప్రోత్సహించి తీసుకెళ్ళి ఊరికి దక్షిణం వైపు కొంత దూరాన ఉన్న గుండ్లపై నిలబెట్టి మిగతా వారంతటూ కుందేళ్ళను లేపి తరుముకు వస్తున్నట్లుగా నటించి పొరపాటున తుపాకి గుండు కుందేలుకు బదులు దొరవారికి తగిలించినట్టుగా వారిని కాల్చి చంపి నమ్మించారు దొర కుటుంబాన్ని. గ్రామ ప్రజలను. వీరు ఎంతటి చురుకుతో, మనం అర్థం చేసుకోవచ్చు.

ఆనాడు సామాన్య జనం వీరి గురించి ఈ విధంగా పాడుకునేది. నేటికి అప్పుడప్పుడు సమస్యలు, సందర్భాలను బట్టి ఇప్పటికీ పూరి జనం పాడుకుంటారు.

రాసు పోసు రాంసింగు పంతులు
రవికెలు విప్పేర రసూలు పంతులు
వొట్టి మాటలు వొత్రె వరపయ్యగారు
సాన పెట్టి నమలక మింగె నర్సయ్య పంతులు

ఆనాటి ప్రజల స్థితిగతులకు, వీరి దురంతాలు; ఆగడాలు, సామాన్యుడి ఎదలో నుండి పొంగిన భావోద్రేకం, యదార్థానికి

పట్టం పట్టింది.

## నిజాం నిరంకుశ పరిపాలన - పోలీసు పాత్ర

ఆనాడు గ్రామంలో సర్వశాసపోలీసు సాధారణ (సివిల్) స్వతంత్రంగ పరిపాలన పులి పంజా క్రింద మేకపిల్ల బ్రతుకులా వుండటం దే ఆశ్చర్యం లేదేమో అనిపిస్తుంది.

మా గ్రామ పోలీసు ఠాణాలో (స్టేషన్) ఒక జమెదారు, దఫెదారు, ఇద్దరు జవానులు, పోలీసు పటేలు, వీరికితోడు సేఠ్ సింధీలు (ఎలవాటు) ఇది ఠాణా బలగం.

ఒక వైపున దొరలు, వారి తొత్తులు, మరోవైపున నిజాం గారి ఈ బలగం అమానుషంగా ఆసాములపై బడి దోచుకు తినటమే కాదు, నిర్బంధాలు కూడ లెక్కలేనన్ని. ఒక్క మాటలో చెప్పాలంటే పోలీసు నిర్బంధ శిబిరంలో ఉన్న ఖైదీలుగా నాటి జనం ఉండటమంటే అతిశయోక్తి కాదేమో.

వివిధ సంచార జాతులను కూడ వదిలిపెట్టలేదు. ముఖ్యంగా బంజారా (లంబాడీలు) వడ్డెర, ఎరుకల, బాలసంత మొదలగు జాతులు నేర తెగ్గ పిడికిలితో బంధింపబడి ఉండేవారు. వీరి ప్రతి కుటుంబ పెద్దకు ఆ కుటుంబ సభ్యుల సంఖ్యను పేర్కొని ప్రభుత్వ ధృవీకరణ పత్రం తప్పనిసరిగా ఉండేది. (దాన్నే గొట్టపు చీటీ అనేవారు). అది ఎల్లప్పుడు నడుముకి కట్టుకొని ఉండాలి. ఈ పత్రము వానకు నానకుండాను, జీర్ణించుకు పోకుండా ఒక ఇనుప రేకు గొట్టం చేయించుకొని అందులో ఆ పత్రం పెట్టి నడుముకు బిగించుకోవాలి ఖైదీలాగా.

ఇక వీరు ఎక్కడికెళ్ళాలన్నా ఏ పని చేయాలన్నా ముందు పోలీసు పటేలు, జమేదారు, దఫెదారుకు అనుమతి కోసం చెరొక కోడిపిల్లను ఇచ్చుకోవాలి. తర్వాత ఏ ఊరికి వెళ్తున్నది, మరెప్పుడు తిరిగివచ్చేది విన్నవించుకొన్న తర్వాత ఆజ్ఞ తీసుకొని ఆ వెళ్ళిన గ్రామం నుండి అక్కడి పోలీసుపటేలు గారికి కొంత సమర్పించుకొని వారితో చీటీ వ్రాయించుకొని తిర్గి యిల్లు చేరకముందే ఠానాలో హాజరై వారిని కల్సిన తర్వాతనే భార్యా పిల్లల ముఖం చూపటం. ఇది అనాటి ఆనవాయితీ. అందుకే ఆనాడు పోలీసు పటేలుగారి జనరల్ డైరీ (దినచర్య పుస్తకము-రోజ్ నామ్ చా)లో తప్పనిసరిగా ఈ క్రింద విధంగా తెలుగు ఉర్దూ మిశ్రితమైన భాషలో వ్రాయబడేది.

1. ఆజ్ రాత్ ఠీక్ బారాబజె గౌసుగస్తు ఛాయగా లంతా ఖైర్యత్.
   (ఈ రోజు రాత్రి పన్నెండు గంటలకు పర్యటనచేయగా అంతా నిమ్మలమే లేక ప్రశాంతమే).
2. సునారె మాల్ గల్వాయించనూ లేదు.
   (అవుసుల వారు ఏలాంటి వస్తువు కరుగించలేదు).
3. బందేకు జాన్వర్లు రానులేదు.
   (బంజరు దొడ్డికి పశువులు రాలేదు).
4. మౌజెకు ముసాఫిర్లు, భికారీలు, వగైరాలు రాలేదు.
   (గ్రామానికి ప్రయాణికులు, అడుక్కు తినేవారు తదిత

రులు రాలేదు).

5. చోరీ - డాకీ జరుగలేదు. మౌజె అంతా ఖైరియత్.
(దొంగతనం, దోపిడి జరుగలేదు. గ్రామం నిష్మ్రలమే.)

ఇది అనాటి తెలుగు భాషకు నిజాం పరిపాలనలో పల్లెల్లో సహితం పట్టిన చెదలు యిది. కాదు కుష్ఠు వ్యాధి.

నాటి ఉర్దూ భాషకు చెదలుపోయి, తెలుగు భాషకు నేడు ఇంగ్లీష్ రూపంలో కుష్ఠు సోకి నుడి ముదురుపాకంలో పడి అమ్మను మమ్మీ, నాన్నను డాడీ, అంకుల్, ఆంటీ, యాంటీ అనే వికృత రూపం ధరించి తెలుగు భాషను ముక్కలు ముక్కలుగా నరికి చివరకు ఏమౌతుందో వూహించలేనంత దిగజారిపోయింది. లేదా ఏమిటంటె నాడు బలవంతంగా, నేడు ఇచ్ఛికంగా సాగిపోతున్నది నవీనత పేరుతో.



# నిజాం ప్రభుత్వం —
# నిర్బంధ వెట్టి చాకిరి

నాడు తహసీలుదారో లేక తాలూక్‌దారో (కలెక్టర్) గ్రామాలకు పర్యటనకు బయలుదేరితే 15 రోజులముందే గ్రామానికి చప్రాసో, జవానో వచ్చి వార్తను అధికారయుతంగా తెల్య జేయటంతో పని ప్రారంభమౌతుంది.

బాటలన్నీ బాగుచెయ్యటం, ఇరువైపుల రాళ్ళు పెట్టి సున్నం వెయ్యటం (బాటలు బాగుచెయ్యటం మాల మాదిగల వంతైతే సున్నం వెయ్యటం చాకలివారి వంతు). వారుండే విడిది స్థలం చదునుచేసి వంచిన డేరాలు బిగించడం, ఆ వచ్చే సాహెబు గారికి తన ఇంట్లోకన్నా మరిన్ని వసతులు వుండే విధంగాను, అంతే విశ్రాంతికి, వినోదానికి, కాలకృత్యాలకు, వారి జనానా (కుటుంబ సభ్యులు భార్య మొదలగువారి) వస్తేగిస్తే ప్రత్యేక సదుపాయాలు, జనాన్ని కప్పిపెట్టటానికి ప్రత్యేక తెరా, వీటన్నిటికీ, గాలిబాటలకు ఇరుపక్కల, ఆ క్షణంలో దారులు నిర్మించి సున్నం కొట్టి, గడ్డిపోచ లేకుండా శుభ్రంగా వుంచాలి. ఆ వచ్చే అధికారికి ఏ వంటలు ఇష్టమైనవో వండేవాడు ఒకరోజు ముందే వేంచేసి, తగిన సరుకులన్నీ తెప్పించుకొనేవాడు. బియ్యం, ఉప్పు, పప్పులు, నెయ్యి, మసాలా దినుసులన్నీ కోమట్లవంతు. గొర్లు, మేకలు గొల్లలవంతు. పాలు, పెరుగు, నెయ్యి, కూర

గాయలు రైతుల పంతు. నీళ్ళు తెచ్చుట వాటికి కావల్సిన కుండలు, స్నానానికి వేడి నీరు కాచుటకు కుమ్మరుల పంతు. ఇక చాకలి, మంగలి వారి పంతుకు ఇదీ అదీ అని లేదు. మరి మాల మాదిగల పంతు కావల్సిన పంట చెరుకు ఒకటేమిటి అన్నీ—

'ఆ వచ్చే నవాబు ఒక్కడే అయినా వారికి సదుపాయాలు, కలిపించటంలో గ్రామాధికారులు తదితరులకు ఒక పెద్ద విందు భోజనాలు, పండ్లు ఫలహారాలు, వంటల గుమగుమలు ఆ ప్రాంత మంతా గుబాలింపుల వాసనలె. ఈ యేర్పాట్లకు అన్నితరగతుల వారు, ఆ నవాబు తిరిగి వెళ్ళేవరకు రాత్రిలవళ్ళు వెట్టి చెయ్యాల్సిందే.

తీరా నవాబుగారు వచ్చిన రోజు విశ్రాంతి, ఇక తెల్లవారి, వారి వారి హోదాలు, అంతస్తులను బట్టి, మొదట దొరలు దేశముఖులు, కల్సుకోవటం, ఆ కల్సుకోవటం పూరికె కాదు సుమా వారి అంతస్తును బట్టి, ఒక మంచి పళ్ళెంలో, అది బంగారుది కావచ్చు, లేక వెండిది కావచ్చు (ఇవి వారొస్తున్నా రంటెనే ప్రత్యేకంగా చేయించి ఉంచినవి) అందులో తప్పులేక ఫర్మాయిష్ (  ) తో చేయించిన నగిషి వస్తువులు బంగారం లేక వెండితో చేసినవి అందులో వుంచి వాటిపై పట్టు వస్త్రం కప్పి, ఎడమ చేత పట్టుకొని, కుడిచేత్తో వంగి వంగి సలాం పెడ్తూ నవాబుగారి ప్రక్కకు పెట్టి, వెన్ను చూపక వంగి వంగి సలాంలు కొడ్తూ వెనక్కు రావలసింది. ఆ కార్య క్రమాలు పూర్తి అయిన తర్వాత ఎప్పుడో తీరికగా వాటిని నవాబుగారు చూచి మెచ్చుకొని అప్పుడుగాని కల్సుకొని మాట్లాడు

టకు అనుమతి లభించదు.

అందుకే ఈ నవాబుల పర్యటన దొరలు, దేశ్‌ముఖ్‌లకు జమిందార్లకు తప్ప సామాన్యునికి ఏ విధంగాను అక్కరకు రాదు. పైగా వీరి పర్యటనతో మరింత కృంగి పోతుంది జనం.

ఈ పర్యటనకు అయిన ఖర్చు భరించింది గ్రామస్తులు. ఆ పేరుతో స్థానికాధికారులు ఓ నెలరోజులు హాయిగా మెక్కటానికి సరిపోను గ్రాసం అన్ని విధాల లభించినట్లే లెక్క.

ఇది ఆనాటి నవాబుల పర్యటన విశేషాలు. నా చిన్నతనంలో అవ్వల్ తాలూక్‌దార్‌గారు గ్రామానికి వచ్చారు. వారి విడిది నేటి **Z.P.H.S.** స్కూల్ గ్రౌండ్‌లో మొత్తం డేరాలు, చిన్న చిన్న దాటలు, తీర్చిదిద్దిన ఏర్పాట్లు నా కళ్ళారా చూడటం జరిగింది.

## మొహర్రం వేడుకలు - హిందువుల అవస్థలు

గ్రామంలో ముస్లింల జనాభా హిందువుల జనాభానుబట్టి పోల్చిచూస్తే, వారిజనాభా శాతంకన్నా తక్కువే అయినా వారి పభావం మాత్రం ఊహ కందనంత బలంగా ఉండేది.

ఆనాడు హిందువులు తమదేవతా విగ్రహాల ఊరేగింపులు జరిపితే తప్పనిసరి అనుమతి పొందాల్సి ఉండేది. వాటికి కొన్ని షరతులు విధించేవి. ఆ షరతులు ఇవి —

1. ముస్లింలు ఉన్న వీధులకు వెళ్ళగూడదు.
2. మసీదులున్నచోట ఏలాంటి వాయిద్యాలుగాని, చప్పుడు గాకుండా మౌనంగా వెళ్ళాలి. భజనలు, కీర్తనలు, మరే విధమైన పాటలు పాడుకుంటూ వెళ్ళగూడదు.

ఈ నిబంధనలు అతిక్రమిస్తే ఇక వారి ఆగ్రహానికి, అగడాలకు అంతుండదు. పైగా ప్రభుత్వం వారిదాయె.

ఇక వారి పండుగలలో అతి ముఖ్యమైనది మొహర్రం. ఈ మొహర్రంలో (పీరీల పండుగ) వీరికి ఏ హద్దులు, షరతులు ఏమీలేవు. ఎంతైనా స్వైర విహారం చెయ్యొచ్చు. ఆ పది రోజులు మౌనంగా ఉండి విషాదాన్ని వెలిబుచ్చే ఈ మొహర్రం హిందువులకు విషాదాన్ని కల్గిస్తుంది. ప్రతిరోజు ఉదయం మొదలుకొని సాయంత్రం వరకు పీరీల నెత్తుకొని డప్పులతో ఊరేగటం, ఇంటింటికి కుడకలు, దట్టీలు, డబ్బులాగటం, ఇక రాత్రులందు అలావ (అగ్ని గుండం) చుట్టూ హిందువులు ముస్లింలు అస్సేన్, హుస్సేన్ అంటూ ఎగరటమే కాదు, ఆ అలావ మంటలకు కావలసిన కర్ర గురించి వారు చేసే రాక్షసత్వం అంతా ఇంతా కాదు. వారి కంటబడిన కర్రను అది ఎవ్వరిదైనా అడగనక్కరలేదు. పనికివచ్చే కర్రేకాదు, ఎడ్లు, వ్యవసాయపు పనిముట్లు, పైబడని వారి ఇంటి తెక్కలు సహితం తెచ్చి అలావలో వేసి బూడిద పాలు చేసేది. అలావలో వేసినదానికి అడిగే హక్కే లేదు. అందుకే ఈ పండుగన్ని రోజులు, రైతులు

తమ తమ పనిముట్లను ఇతర కర్ర వస్తువులను వాటి కంటబడ కుండా జాగ్రత్తగా దాచుకొనేవారు.

## కృష్ణాష్టమి (గోకులాష్టమి)

హిందువులు-ఈ గ్రామం వరకు గోకులాష్టమి ఆ నెల రోజులుండగనే ఆ పండుగ కొరకు ఎంతో ఉత్సాహంతో ఎప్పుడా యని ఎదురు చూసేవారు గ్రామస్థులు. ఈ గ్రామంలో మతకలహాగాని, వైపరీత్యాగాని, లేక ముస్లింలకు నవాబ్ గా గాని ఎంతో పెద్ద ఎత్తున తెందురోజులు మహావైభవంగా జరుపుకొం టారు మనవారు.

అష్టమినాడు కృష్ణుడు జన్మించటంతో ప్రారంభమైన పండుగ వేడుకలు, తెల్లవారి ఊరంతాకల్సి దైవ విగ్రహంతో ఊరేగుటమేకాదు చిన్న ముంతలలో చల్ల-రంగు-నీరు పోసి ఉట్లు గొట్టటం, చిన్న పెద్ద, ఆడ మగ భేదం లేకుండా ఒకరిపై నొకరు రంగులు చల్లుకోవటం, భజనలు, కర్రసలు, కోలాటాల పాటలతో ఊరేగుతుంటె వచ్చే దైవానికి (సాక్షాత్తు ఆ కృష్ణుడే వస్తున్నట్లుగా ఇంటింటి ఇల్లాండ్రు) వస్త్రాలంకరణ చేసుకొని ఎదురుగా వచ్చి హారతులివ్వటం ఓ ప్రత్యేకత. ఈ ఉత్సవాన్ని చూడటానికి చుట్టుపట్ల గ్రామాల నుండి తరలి వచ్చేది జనం.

ఈ ఉత్సవం ఆనాడు మహావైభవంగా జరిగినా ఈనాడు కూడా పెద్ద ఎత్తునే జరుగుతుంటుంది. ఈ పండుగకు తెలుగు

వారంతా ఏకమౌతారు. ఇసుకవేస్తే రాలనిజనం వచ్చి చేరుతుంది. అందుకే దీనికి ఏ అనుమతి, ఏ షరతులు లేకుండానే సాఫీగా సాగిపోతుంది ప్రతి ఏడూ..

## గ్రామంలో తొలి ప్రభుత్వ పాఠశాల

మన గ్రామంలో నిజాం ప్రభుత్వ తొలి పాఠశాల 1325 ఫసలీ 1914లో నెలకొలిపినట్టుగా తెలుస్తుంది. ఈ తొలి పాఠశాల స్థాపించుటకు ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నది శ్రీ రంగరాజు గోపాలకిషన్‌రావుగారని, వీరి సహాయ సహకారాలు అందించారనియు, శ్రీ కొండెల్లి రాంకిషన్‌రావుగారు ఆ రోజుల్లో నిజాం ప్రభుత్వ విద్యాశాఖలో సిరిస్తేదారుగా (నేటి U.D.C.) ఉండేవారని తెలుస్తున్నది. ఈ పాఠశాలతోపాటు "టపాఖానా" (తపాలా) కూడ వచ్చినదని తెలిసింది. ఈ తపాలాకుమాత్రం నాటి ప్రభుత్వము కొన్ని షరతులు విధించి యిచ్చినదట. అవి, ఇవి—

1. మూడుసంవత్సరముల వరకు పోస్టుమాస్టర్, పోస్టుమాన్ కు జీతభత్యములు గ్రామస్తులే భరించాలి.
2. వీరిద్దరికి రూ॥లు 15, 10 రూపాయలకు జీతాలు యివ్వాలి.
3. జీతభత్యాలు పోను ప్రతినెల కొంత ఆదాయాన్ని చూపాలి. ఇందుకు గ్రామదొరలు, షావుకార్లు, మోతుబరి రైతులు గ్రామ పెద్దలు, తప్పనిసరిగా కార్డులు, కవర్లు కొని ఇత

రుల కిచ్చి వ్రాయించి పోస్టులో వేయించేవారట. ఆ విధంగా తపాలాను ఖాయపరచు (స్థిరపరచు) కోవటం జరిగింది.

ఈ తొలి పాఠశాలను, తపాలాను నడిపించుటకు శ్రీ మంగు వీరన్నగారిని నియమించినారు.

వీరు 1910 నుండి 1918 వరకు గిర్దావర్ (R.I) పని చేసినారట. వీరిది జన్మస్థానం హస్నకొండయనియు, వీరు ఈ గ్రామ నివాసులైన, సుప్రసిద్ధ సంగీత విద్వాంసులైన శ్రీ హనుమాండ్ల రాములుగారి అల్లుడు. వీరు తెలుగు-ఉర్దూ-పారసీ భాషలో దిట్టయుని, అంతేగాక కొన్నిరోజులు గిర్దావర్‌గా పని చేసినందువల్ల, భూ సంబంధమైన వ్యవహారములతో అనుభవం గడించినందువల్ల వీరిని ఈ గ్రామదొరలు విధిగా ఉద్యోగానికి "ఇస్తెఫా" (రాజీనామా) యిప్పించి నియమించినారు. ఈ దొరల రైతుల-కౌలుదార్ల, లావాదేవీలు, ప్రభుత్వంతో పైరవీలు దొరల తరఫున చూచేవారు. అందువల్ల గిర్దావర్ ఆదాయం కన్నా ఈ ఆదాయమే మెరుగ్గా ఉండేదని, దొరల అండ ఉండటం వలన గ్రామంలో పలుకుబడి కూడా హెచ్చుగానే యుండేదట.

ఈ పాఠశాలలో విద్యాబోధన మాత్రము ఉర్దూయే. గ్రామంలో ముస్లింల ప్రభావం మరియు అధికార భాష ఉర్దూ కావటం, ముఖ్యంగాను, దొరల, ధనికవర్గాల పిల్లలకు ఉర్దూ పారసీ నేర్పితే భవిష్యత్తులో ఆదరణ ఉంటుందని ఒకవైపు

మరొకవైపున ఉర్దూ వ్యాప్తి జరిగి నిజాం ప్రభుత్వానుకూలంగా ప్రభుశక్తితో మెలగగలరని ప్రభుత్వ ఆశయం.

1325 [1914] లో ఏకోపాధ్యాయ పాఠశాల 1331 [1920]లో ఇద్దరు ఉపాధ్యాయులుగాను వృద్ధి పొందింది. తర్వాత 1345 [1934] నుండి 1350 [1939] వరకు ఉన్న ఉపాధ్యాయులు శ్రీ మహ్మద్ గులాం తాయర్, శ్రీ కోటప్ప పంతులుగారు పనిచేసినారు. వీరి కాలంలోనే నా మిత్రులు కీర్తి శేషులైన శ్రీ పేర్వారం నరహరిగారు, కీ.శే. మంగు యాదయ్య తండ్రి రామచంద్రయ్యగారు, కీ.శే. పుప్పాల ఆచారిగారు, శ్రీ బాల్నె యాదగిరిగారు ఇంకా మరి కొంతమంది మిత్రులు నాటి "ఖాయిదా" (ఉర్దూ బాలశిక్ష) లో ఉంటిమి. శ్రీ లగిశెట్టి శ్రీశైలంగారు, కీ.శే. బాల్నె విశ్వనాథంగారు, 2 లేక 3వ తరగతిలో ఉండిరి.

ఆ నాటి పాఠశాలలోనూ, ఇవతలగూడ లంటరానితనం, అస్పృశ్యత, వీరు శూద్రులు, వారు మాల మాదిగ అనే తేడా బలంగా ఉండేది. అందుకే వేరు వేరు ప్రదేశాలలో కూర్చుండటం ఆ రోజుల్లో అతి సాధారణ విషయం. మేము బడి నుండి రాగానే ఇంట్లో ప్రవేశించకముందే ఒంటిమీది బట్టలు తీసివేయటమో, కాస్త పసుపునీళ్ళు చల్లుకోవటమో జరిగిన తర్వాతనే ఇంట్లోకి ప్రవేశించాలి అనాటి దినచర్యల్లో ఇది అతిముఖ్యం.

అయితే తెలుగు నేర్చుకోవటానికి ఖానిగిలో (ప్రత్యే

తర) బడులుకూడ నడుస్తుండేవి. అవి నడిపిన వారిలో ప్రప్రథములు శ్రీ మంగు రామయ్యగారు అని తెలిసింది. ఇక శ్రీ ఎడ్ల చెంద్రయ్యగారు, వీరు తెలుగు-ఉర్దూ-పారసీలో మహాపండితుడు. వీరు మాటకొ పద్యం, పారసీ బాపతుది చదివేది. శ్రీ తాడూరి లక్ష్మయ్య పంతులుగారు, ఇంకా చాతాని తిరువ్వాళి రంగయ్యగారు ప్రథములు. నేనూ నామిత్రులు, శ్రీ ఎడ్ల చంద్రయ్యగారి వద్ద కొన్నిరోజులు చదివాము. అందులో మాతోపాటు శ్రీ మంగు హన్మయ్యగారు, శ్రీ మంగు శ్రీహరిగారు (నేటి L.L.B.) వుండేవారు. శ్రీ తిరువ్వాళి రంగయ్యగారి వద్ద చదువుతున్న రోజుల్లో ప్రధానంగా కట్టె పలక మీద విద్య. దానిమీద ఇటుక పొడి పోసి దిద్దటము వస్తే ఇక అదే పలకకు బొగ్గుపొడి ఆకుల పసర్లు నూరి ఆ పలకకు రాసి ఎండబెట్టి తర్వాత బలపపు రాతితో వ్రాసుకుపోయేది. అప్పుడు పెద్ద బాలశిక్ష, దాశరథి, సుమతి శతకాలు కంఠస్థం అయ్యిందంటె డాక్టరేటు పట్టా పొందినంత గొప్పతనం. గొలుసుకట్టు వృత్తరాలు, చదవటం వ్రాయటం వస్తే గొప్ప ఘనత. తల్లి, తండ్రులు నా కొడుకు పెద్ద బాలశిక్ష, దాశరథి సుమతి శతకాలు ధారాళంగా చదువగలడని సగౌరవంగా చెప్పుకొని మురిసేవారు.

మేము రంగయ్యగారి వద్ద చదువుకుంటున్న రోజుల్లో ఏ రాత్రో విద్యార్థులు లేచి వెళ్ళి వారి ఇంటిముందు పడుకునేది. ఇందులో ఎవరు ముందు వెళ్ళితే వారు 'శ్రీ' అని రెండో వారు 'చుక్క' అని ఇక మిగతా వారికి వరుసక్రమంలో

దెబ్బలు తప్ప మరేమి లేవు. అందుకే దెబ్బలు తప్పుకోవటానికి ముందే వెళ్ళి కూర్చుండేది.

ఇక నా విషయానికొస్తే నన్ను ఎప్పుడూ అరచేతను అంగరక్షకులకు పైగా వచ్చి సగౌరవంగా అమాంతం లేపి పట్టు కొని లేక ఈడ్చుకొని బడిలో వేసిన రోజులే మహా ఎక్కువ ఉన్నవి. ఈ బడి ప్రభాతం ప్రార్థనతో ప్రారంభమై సాయం త్రం దీపారాధన (దీపం జ్యోతి పరబ్రహ్మం) చేసి ఇంటికి తిరి గొచ్చేది.

## నాటి మన వైద్యులు - వారి పట్టుదలలు

1930 కి పూర్వమే గ్రామంలో నిజాం ప్రభుత్వం తర పున ఆయుర్వేద వైద్యశాల (దవాఖాన) స్థాపించబడింది. ఈ వైద్యశాల స్థాపనకు శ్రీ రంగిరాజు కేశవరావుగారే ప్రయత్నం చేసి అనుమతి పొందినారు. దానికి ప్రథమ వైద్యుడు శ్రీ రామా నుజపురం జగ్గయ్యగారు. వీరు అప్పటికే ఆయుర్వేద వైద్యంలో పేరు ప్రఖ్యాతులు సంపాదించినవారు. ఆ రోజులలో వీరికి 12, 15 రూపాయల వేతనం యిచ్చేవట ప్రభుత్వం.

శ్రీ జగ్గయ్య గారి కుమారుడైన శ్రీ రంగనాథస్వామి గారు మరియు చాల్లేటి నృశింహ్మ రామశర్మగారు వీరిద్దరు జగ్గయ్యగారివద్దనే వైద్యం నేర్చుకొన్నారట. వీరిదరు గురువును మించిన శిష్యులుగా వైద్యంలో మంచి అనుభవం సంపా దించారు.

ప్రభుత్వం ఈ ఆయుర్వేద వైద్యశాలను మరెన్నో రోజులు నడుపలేదు. 1940 కి తొలిపే ఆయుర్వేదాన్ని రద్దుచేసి. దాని స్థానంలో యునాని ప్రవేశపెట్టింది. ఇది ప్రత్యేకం ముస్లిం లను మాత్రమే ఉపయోగించుటకు హైద్రాబాద్ నుండి యునాని వైద్యులను నియమించింది.

ఈ రెండు రకాల వైద్యాలు అట్టడుగున వున్న వారికి ఆ రోజుల్లో ఏ మాత్రం అందుబాటులో లేదు. ఇది దొరలకు, ధనిక, మధ్య తరగతి ప్రజలకే ఉపయోగపడింది.

నిరుపేదలకు అందుబాటులో ఉన్నది మంత్రాలు, యంత్రాలే వారి వైద్యం. కడుపు నొచ్చినా, తలనొప్పి కలిగినా మరే యితర జబ్బులు వచ్చినా బైండ్ల వారు మంత్రించిపెట్టి పసుపో, కోడిపిల్ల గొర్రె పిల్లతో పై నుండి త్రిప్పి వేయుటమొ అంతకు తగ్గకపోతే దేవున్ని అడుక్కోవటమొ (ఆ రోజుల్లో సిగాలూగించి చెప్పేదాన్ని దేవున్ని అడుక్కోవటం అంటారు.)

ఆ రోజులలో ఆయుర్వేద చికిత్సా విషయంలో శ్రీ చొల్లేటి నృశింహ్మ రామశర్మగారికి శ్రీ రామానుజపురం రంగనాథ స్వామిగారికి చికిత్సా విధానంలో విభేదాలు రావటం, ఎవరి చికిత్స సరియైనదో నిరూపించుకొనుటకు ఆయుర్వేదంలో కొమ్ములు తిరిగిన మహామహులను తెలంగాణా నలుమూలల నుండి రప్పించి సభలు పెట్టి, వారి వారి ప్రశ్నలు, అందుకు సంబంధించిన సాక్ష్యాధారాలను వైద్య గ్రంథాలను ఇరువురును

ఉపసంహరించినారట. తర్వాత వారేమి తీర్పు నిచ్చిరో తెల్యదు కాని, వారిరువురు వారి ప్రతిభాపాటవాలను ప్రజల తీర్పుకె వదిలిపెట్టున్నది. ఎందుకనగా—శ్రీ చొల్లేటి నృసింహ్మ రామ శర్మగారు "భిషగ్విజయం" అను ఆయుర్వేద నాటకం రచించి, అదీ జబ్బులకు పేర్లు పెట్టి - వాటి నయం కొరకు వాడే వస్తు వులను ప్రదర్శింపచేశారు. ఇక శ్రీ రామానుజపురం రంగనాథ స్వామిగారు "ధన్వంతరీ విజయం" అను వీధి భాగవతం రచించి ప్రదర్శింపచేశారు. శ్రీ శర్మగారిది పండితులకు తప్ప పామరులకు అర్థంగాని పాండిత్యంతో వుంది. శ్రీ స్వామిగారిది వీధి నాటకం అవటంవల్ల అటు పండితులకు, ఇటు పామరులకు జన సామాన్యానికి బాగా హత్తుకుపోయింది. అసలు ఏ జబ్బు వస్తే రోగి ఎలా ఉంటాడు? ఆ రోగికి ఏమివ్వాలి? అనేది సామాన్యుడు అర్థం చేసుకొనే రీతిలో ప్రదర్శింపబడటంవల్ల పండితుల సంగతేమిటో గాని జన సామాన్యం బాగా మెచ్చు కుంది.

నాటి పట్టుదలలన్నీ, వారు నడచిన దారులు అవి. మరి ఈనాడో?

## సంగీత సాహిత్య కళా రంగాలలో

ఆనాడు మా గ్రామం కవులకు, పండితులకు, సంగీత సాహిత్య మొదలగు కళా రంగాలలో ముందంజ వేసి నలు దిశల ప్రకాశించింది. ఇందులో ముఖ్యంగా కొందరిని పరిచయం

చేయకపోతే ఆ లోటు ఉండే ఉంటుందని భావిస్తున్నాను.

శ్రీ చొల్లేటి నృశింహ్మ రామశర్మగారు "భిషగ్విజయం" "గంగాదేవి అలుక" నాకు తెలిసిన రచనలు. ఇంకా మరెన్నో అముద్రితాలు.

శ్రీ నృశింహ శర్మ చొల్లేటిగారు "తోడు నీడ" ముద్రితము. ఇంకా మరెన్నో....

శ్రీ రామానుజపురం రంగనాథస్వామిగారు "ధన్వంతరి విజయం" ఇంకెన్నో రచనలు.

శ్రీ చొల్లేటి లక్ష్మణ శర్మగారు పంచాంగ కర్త, వాస్తు శాస్త్రములో దిట్ట.

ఇట్లా ఇంకా మరెందరో మహామహులు ఉన్నారు. వీరందరి కన్న మిన్న శ్రీ రంగరాజు కేశవరావుగారిని సాహిత్య రూపంలో నేను పరిచయం చేయడము హాస్యాస్పదమే ఔతుంది.

పైన పేర్కొన్న మహనీయులను కూడ నేను పరిచయం చేయతగం కాదు. ఇంత పెద్దవారున్నారని గర్వంగా చెప్పుకోవడమే నాకు గర్వకారణం.

## సంగీత

శ్రీ రంగరాజు కేశవరావుగారు ఉన్నిరంగాలతోపాటు వీణ, సితార, ఫిడేలు, ఫ్లూటు వాయించటంలో నేర్పరి యని,

వీరి సోదరులగు శ్రీ నర్సింహారావు, వెంకటకిషన్‌రావుగారలకు సంగీతములో శిక్షణ యిచ్చి తమంతటి వారిని చేసినారట. ఈ ముగ్గురు సోదరులు సంగీత కచేరి చేస్తే ఆ రోజులలో మరెవ్వరు ఈ పరగణాలో సాటిరారేవని వినికిడి.

వీరి శిష్యుడే శ్రీ హనుమాండ్ల రాములుగారు. వీరు వీణ, సితార్, ఫ్లూటు వాయించటంలో గురువును మించిన శిష్యుడైనా డని ఆ రోజులలో గద్వాల, కొంపెల్లి సంస్థానాలలో యాదగిరి గుట్ట, మునికొండ, మెట్టుగుట్ట దేవస్థానాలలో దేవస్థాన సంగీత విద్వాంసులుగా ఉంచేవారట. వీరు ఆ దేవస్థానాల వారు వర్షాచల రూపంలో ప్రతి సంవత్సరము ఆర్థిక సహాయం లభించే వారట.

శ్రీ హనుమాండ్ల రాములుగారి శిష్యుడుగా శ్రీ జంపాల రాములు ఫ్లూటు, నాదస్వరము (సౌన్నాయి) వాయిద్యంలో మంచి నేర్పును పొందినారు. ఫ్లూటు వాయించటంలో ప్రతిభా నేర్పరి అయినప్పటికి వానితో జీవనం గడపడనే కారణంతో చనిపోయేవరకు నాదస్వరం (సౌన్నాయి) పై బ్రతుకు బాట సాగించినాడు.

## వాస్తు శాస్త్రము

శ్రీ చిలుపూరి వీరమల్లయ్యగారు వాస్తు శాస్త్రములో మంచి అనుభవం సంపాదించారు. వీరి ఆధ్వర్యములోనే నేటి బాలాజీ

గుడి, గోపురం, మంటపం నిర్మించినారట. ఈ నిర్మాణంలో వీరికి తోడుగా కొమురవెల్లి దేవస్థానంలో ఉన్న వాస్తు శాస్త్రజ్ఞుడు, సహాయకారిగా ఏనుగుల మల్లయ్యగారు ఈ నిర్మాణంలో పాల్గొన్న ప్రముఖులు. శ్రీ వీరమల్లయ్యగారి కుమారుడు శ్రీ చిలువూరు పద్మయ్యగారు కూడ తండ్రిని మించిన తనయుడే. వీరు యిప్పటికి ఈ గ్రామమే కాదు ఈ ప్రాంతంలో ముగ్గు పోయని ఇల్లు, భవంతి, మేడ లేదంటే ఆశ్చర్యం కాదు. ఇంకా——

శ్రీ నక్కాస చెన్నయ్య - వీరి వృత్తి దర్జీ పని యైనా నగిశీలు చెక్కడంలో నక్కాషి అనే పేరే బాగా వాడుకలోకి వచ్చింది. వీరు కట్టె పనిలో మేటి. కట్టెను మైనంలా మలిచి, తొలచి వివిధ దేవతా విగ్రహాలను చెక్కడం వాటి రూపాలను బట్టి రంగులు వేయటంలో వీరికి వీరే సాటి. నాడు వాడుకలో ఉన్న పల్లకి కట్టెతో ఎన్నెన్నో అలంకరణ వస్తువులు, ఆట బొమ్మలు చేసేవారు.

అంతేగాదు మట్టి కుండలపై రకరకాల చిత్రాలను చిత్రించేవారు. వీరు పోశమ్మ జాతర సందర్భములో బోనాల కుండలపై చిత్రించిన రామ చిలుకలను దూరంగా వుండి చూస్తుంటె అవి అందులో ఉన్న పదార్థాన్ని తినడానికి వచ్చి వాలినవా అన్న భావన తప్పనిసరి కలిగేది. ఇప్పటికీ వీరి కుమారుడైన శ్రీ నర్సయ్యగారు విగ్రహాలను, పల్లకీలను చేయటం, రంగులు

వేయటం జరుగుతున్నప్పటికి తన నైపుణ్యానికి తగ్గ పోషణ, ప్రోత్సాహం లభించక వృద్ధంగి పనిలో నిమగ్నుడైనాడు.

మనం ఇంత వరకు గ్రామంలో, నిజాం నిర్బంధ శిబిరంలో బిక్కు బిక్కుమని దారి తెన్నూ తెలియక బ్రతుకు నీడ్చుకుంటూ వస్తున్న బడుగు జీవుల పైనే "గోటి చుట్టుపై రోకటి పోటు" అన్నట్లు భూ మదాంధులు, వారి తొత్తులు పిండారీలవలె పడి బక్క చిక్కిన రైతుల రక్త మాంసాలనే గాక మూలుగులను సైతం పీల్చి పిప్పి చేశారు.

ఈ దోపిడి, ఈ వెట్టి చాకిరి, ఈ ఒంటరానితనం నుండి వీరు విముక్తులు కావాలంటె నాడు ముస్లిం మతమైనా క్రిష్టియన్ మతమైనా స్వీకరిస్తే తప్ప మోక్షం లేదనుకున్నారు అంటరాని తనంవారు.

అయినా మన తెలుగుజాతి ఔన్నత్యాన్ని, సంస్కృతిని దాని గొప్పదనాన్ని కాపాడటంలో మాత్రం ఎందరో మహాశయులు వెనుకాడలేదు. ఉర్దూ సంస్కృతిని ఉగ్గుపాలలోనే రంగరించిపోసి ముస్లిం మత వ్యాప్తిని పెంపొందించాలనుకున్న నిజాంనిర్ణయానికి మనవారు అడ్డుకట్టలు వేశారు. వారికున్న కొద్ది పాటి వసతులతోటె పాఠశాలలు పెట్టి తెలుగు విద్యావ్యాప్తికి మన సంస్కృతిని కాపాడటానికి ఎనలేని కృషి చేశారు. దానిని మరింత ముందుకు తీసుకపోవటంలో వెనుకంజ వేయలేదనటానికి మన గ్రామ పండితులు, కవులు, ఉపాధ్యాయులే సాక్ష్యం.

ఏదీ ఏమైనప్పటికీ నిప్పులు కురిసిన ఈ తెలుగు నేలపై ఎంత కాలముంది ఈ వేడిమి, వడ గాడ్పులు? ఈ నిప్పులు చెరిగిన నేలపై చల్లని వర్షం కురిసి పచ్చని పంటలు పండి నట్లుగా జాతీయోద్యమ ఋతుపవనాలు ఆరంభమైనవి. ఉద్యమాల, పోరాటాల మేఘాలు క్రమ్ముకు వస్తున్నవి. అవి వర్షించక తప్పదు. ఈ నిప్పులు చెరిగిన నీచులు ఆ ప్రవాహములో కొట్టుకపోక మానరు.

# ఆర్య సమాజ్ - హిందూ పరిషత్

అది 1930. ఆంధ్ర జన కేంద్ర సంఘం ఆధ్వర్యాన జోగిపేటలో తొలి ఆంధ్ర మహాసభ జరిగింది. దీని ప్రభావం మెల్లమెల్లగా పల్లెలకు ప్రాకుతున్న సమయం. 1931లో దేవరకొండలో రెండవ ఆంధ్ర మహాసభ జరగటం మూలంగా నల్లగొండ జిల్లాలో ఉద్యమం చైతన్యం పొంది హిందువుల ఐక్యత ముందుకు సాగుతుంది.

మహాత్మా గాంధీగారి నాయకత్వాన నడుస్తున్న హరిజనోద్యమం హైద్రాబాద్‌శాఖకు 1932లో తొలిసారిగా యువనాయకుడై శ్రీ రావి నారాయణరెడ్డిగారు కార్యదర్శిగా యుండటం, ఇదేకాలంలో "ఇత్తెహాదుల్ ముసల్మాన్" అనుసంస్థ "అంజుమన్ తబ్లిక్ ఇస్లామ్" (ఖాక్‌సార్) పార్టీ శాఖను నెలకొల్పి హిందువులను ముస్లింలుగా మార్చుటకు తీవ్రకృషి చేస్తున్న రోజులవి.

ఈ మతంవ్యాప్తిని నిరోధించుటకు ఆర్యసమాజ్-హిందూ పరిషత్‌లు వెలసి కొత్తగా ఇస్లాం మతంలోకి మారిన హిందువులను శుద్ధి సభల పేరుతో తిరిగి హిందువులుగా చేర్చుకోవటం

జరిగింది. ఈ ప్రచారానికి ఆ రోజుల్లో "వైదిక అవర్స్" అను వార పత్రిక మత ప్రబోధంతో వెలువడింది.

ఈ రెండింటి ప్రభావం మన గ్రామానికి సోకిందంటే పెద్దగా ఆశ్చర్యపడవలసిన పనిలేదు. కారణం—అట్టడుగు పడిన, అణగారిపోతున్న మాలమాదిగల నికృష్ట జీవితము, చాలీ చాలని తిండి, అంతకుమించి దొరలకు వారి తాబేదారులకు స్థానిక పోలీస్ నాకా ముందు నిలువెట్టి చాకిరి దొరల ఇంటి ముందు నాకా ముందు పనిఉన్నా లేకున్నా పడియుండాలి. దానినే 'నిలువెట్టి' అని పిలిచేవారు. కుక్కకన్న హీనంగా పడి ఉండాలి. దీనికెలాంటి ప్రతిఫలం లేదు. ఈ బాధల నుండి విముక్తి పొందాలంటె అనాడు బడుగు జీవులకు ముస్లిం మతమే శరణ్యం. అందులో చేరితే కాస్త ఊపిరి పీల్చుకొని కష్టించి బ్రతుకొచ్చని వారి ఆశ.

ఇవన్నీ చూస్తున్న శ్రీ మంగు వెంకటయ్యగారికి మనస్సు చలించింది. వీరెవరో కాదు గ్రామ పట్వారి, పిల్ల జమిందారు గారైన శ్రీ మంగు సింహాద్రిగారి రెండవ కుమారుడు. వీరు గ్రామంలో ఉన్నంతవరకు హరిజన సేవా తలంపు రాలేదు. ఇక్కడి పరిసరాల ప్రభావం అటువంటిది. వీరు గ్రామం వదిలి చదువుకు హైద్రాబాదు ఎప్పుడైతే వెళ్ళారో, అక్కడ ఉద్యమ ప్రభావాలను కళ్లారా చూడటం, ఉద్యమవాదులతో పరిచయం ఏర్పడటంలో వారు ఏదో ఒక రీతిన హరిజనులకు మేలు చేయా

నాకె తలంపు కలిగింది.

నేను హైదరాబాదు నగరంలోని 'గౌలి'లో ఉర్దూ బోధనా ధారగల పాఠశాలలో చదువు కొనసాగిస్తున్నారు. ఆ సమీపం లోనే ఆర్యసమాజ్-హిందూ పరిషత్‌లకు సంబంధించిన విశాలమైన భవనం ఉండేది. అక్కడనే శ్రీ వద్దికొండ నర్సింహ్మారావు గారి ఇల్లు ఉండటం. వీరు మరెవరో కాదు మన గ్రామస్తులైన శ్రీ చొల్లేటి నృసింహశర్మ, శ్రీ చొల్లేటి నృసింహ రామశర్మగారలకు దగ్గరి బంధువే కాక వారి బావగారు కూడ. ఈ బంధుత్వ పరిచయం వల్ల శ్రీ ముంగి వెంకటయ్యగారికి అతి సన్నిహిత సంబంధము ఏర్పడటం, తద్వారా ఉద్యమాలలోకి ఆకర్షింప బడటం హేతువైంది.

శ్రీ వద్దికొండ నర్సింహ్మారావుగారి ఇంటికి నాటి పెద్దలైన మాడపాటి హనుమంతరావుగారు, మందుముల రామచంద్ర రావుగారు, పట్టికోట అళ్వార్ స్వామిగారు, కొండా వెంకటరంగా రెడ్డిగారు, ఇంకా మరెందరో ప్రముఖులు వస్తూపోతూ ఉండటం, వీరంతా కలిసి ఆర్యసమాజ్ భవనంలో కూర్చుండి, చర్చలు సభలు—సమావేశాలు జరుపుతుండటం ఇవన్నీ ప్రతి నిత్యం శ్రద్ధతో గమనించటంతో పరిచయాలు బాగా అయినాయి.

ఇక ఆర్యసమాజ్ తరఫున శ్రీ ముంగి వెంకటయ్యగారి కన్నమంద శ్రీ చొల్లేటి నృసింహశర్మగారు చాపక్రింద నీరులా పని చేస్తున్నారు. వీరు అప్పటికే ప్రభుత్వ ఉపాధ్యాయులుగా

ఉంటూ సమాజ్ కార్యకలాపాలు అతి గోప్యంగా నిర్వహిస్తూ ఉండేవారు. వీరు తమకు తోడుగా మంచి కార్యకర్త, చురుకైన యువకుడు దొరికితే గ్రామాల్లో కార్యకలాపాలు నిర్వహించ వచ్చనే ఆలోచనలో ఉన్న సందర్భములో ఈ మంగు వెంక టయ్యగారు వారికి అండగా దొరకటంతో, ఇక ఈ ఇద్దరు ఆర్య సమాజ్ హరిజనోద్ధరణ కార్యకలాపాలు సాగించుటకు మంచి వాతావరణం ఏర్పడింది.

నాడు శ్రీ కొండా వెంకట రంగారెడ్డి, శ్రీ రావి నారా యణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, ఆరుట్ల లక్ష్మీ నర్సింహ్మారెడ్డి మొద లగువారు హరిజనోద్యమం, ఆంధ్ర మహాసభ కాంగ్రెస్‌లో పుండి పని చేస్తున్నారు.

శ్రీ మాడపాటి హనుమంతరావుగారు, మందుముల రామ చంద్రరావు, వట్టికోట ఆళ్వార్‌స్వామి మొదలగువారు గ్రంథా లయోద్యమంలోనూ, శ్రీయుతులు బలదేవ్ భద్రదేవ్‌గారలు ఆర్యసమాజ్ తరపున నల్లగొండ, అత్రాఫ్‌బల్దా జిల్లాలను చూస్తుండటం వల్లకొండ నర్సింహ్మారావుగారి పరిచయభాగ్యమే.

1934లో ఖమ్మం, 1935లో సిరిసిల్లాలో జరిగిన ఆంధ్ర మహాసభల ప్రభావం మరెంతగానో పనిచేసింది వీరిపైన.

శ్రీ వెంకటయ్యగారు వీరని చూడటం, కలుసుకోవటమే గాక పని చెయ్యాలనె తపన గూడ కలిగించె. హరిజన సేవా

కార్యక్రమాలు, వయోజన విద్యా, అంటరానితనం నిర్మూలన, గో మాంస నిషేధం, కల్లు త్రాగుట మాన్పించుట మొదలగు విషయాలపై కేంద్రీకరించి పని చేయాలనే ఆలోచన తట్టింది. ఈ పెద్దల ఆశీస్సులు, సహాయ సహకారాలు, గ్రామాల్లో కదిలి పనిచేస్తే అండ వుంటుందనే విశ్వాసం ఏర్పడింది.

1935లో 5వ ఆంధ్ర మహాసభ షాద్‌నగర్‌లో జరిగే నాటికి మన గ్రామంలో హరిజనవాడలో రాత్రిపూట వయోజన విద్యాకేంద్రాన్ని స్థాపించి, దానికి తొలి ఉపాధ్యాయునిగా శ్రీ తిరుప్పూరు వెంకటనారాయణను నియమించారు. శ్రీ చాల్లేటి నృసింహశర్మగారు, శ్రీ మంగు వెంకటయ్యగారల పర్యవేక్షణలో విద్యాబోధన సాఫీగా సాగుతున్నది. దానితో పాటు "హైదిక్ ఆదర్శ్" అను వారపత్రికను తెప్పించటము అందులో వచ్చిన సూచనల మేరకు హరిజనుల చైతన్యవంతులను చెయ్యటం. ఈ వారపత్రికతోపాటు మరికొంత సాహిత్యం హరిజన సేవా విభాగానికి సంబంధించిన పుస్తకాలు, కరపత్రాలు తేవటం, వాటిని పంచటము, చదివి వినిపించడం జరుగుచుండేది.

ఈ సందర్భములోనే ఆనాటి హరిజన పెద్దలగు శ్రీ పస్యాకల సాయిలు, కాగ చినఎల్లయ్య, కాగ అబ్బసాయిలు, కాగ ఎఱ్ఱ మల్లయ్య మొదలగువారు శ్రీ వెంకటయ్యగారికి అండగా నిలిచారు.

## నిజాం ప్రభుత్వపు నిఘా

ఎప్పుడైతే హరిజనవాడలో వయోజన విద్యాకేంద్రం

నడుపుతూ, దానినీడలోనే ఆర్యసమాజ్ భావాలు, హరిజనసేవా కార్యక్రమాలు కొనసాగుచుండుటతో నిజాం ప్రభుత్వానికి కన్ను కుట్టింది. స్థానిక పోలీసువారు ఓ కంట నిఘావేసి ఉద్యమాల కదలికలను కనిపెట్టడమేకాదు, సమయం కొరకు ఎదిరి చూస్తున్నారు.

నిజాంస్టేట్‌లో ఈ రెండు ఉద్యమాలతీవ్రత గ్రామాలలో పుంజుకొని కార్యరూపం దాల్చుతున్న తరుణంలో అటు ఆర్య సమాజ్‌ను, దాని వారపత్రికను నిజాం ప్రభుత్వం నిషేధించింది. ఆ నిషేధాన్ని అనరాగ తీసుకొని శ్రీ చొల్లేటి నృసింహ్మ శర్మగారి ఇంట్లో ఉన్న సమాజ్ సాహిత్యాన్ని వశపరచుకొని ఆ నెపంతో శ్రీ శర్మగారిని ఉపాధ్యాయ ఉద్యోగం నుండి తొలగించి వేసింది ప్రభుత్వం. పైగా కేసు నడిపించి కోర్టులో

అప్పటికే గ్రామ పెద్దలు, ఇతరులు, ఎంతో మంది యువకులు ఆర్య సమాజ్ సభ్యత్వం పొందినారు. అందులో మా తండ్రిగారైన శ్రీ పెద్మాండ్ల రామయ్య, శ్రీ పేర్వారం సంతాజీ గారలు కూడ సభ్యత్వం పొందినారు. అప్పటికే మా తండ్రి గారు పశ్చిమ గోదావరి జిల్లా-పెంటపాడు నుండి వెలువడె రామానుజ మత ప్రబోధం చేసె "శ్రీ వైష్ణవ" మాస పత్రికను తెప్పించటము దాన్ని తు.చ. తప్పకుండా ఆచరిస్తుండేవారు.

ఒకనాడు నేను మా తండ్రిగారి పుస్తకాలను పత్రాలను

తిరగేస్తున్న సందర్భములో ఈ రెండు రశీదులు వైష్ణవ పత్రికలో కనిపించగానే నాకు ఎంతో ఆశ్చర్యం వేసింది. మరి ఈ సంతాజీగారి రశీదు మా తండ్రిగారి వద్ద ఉండటమేమిటి? అన్న ప్రశ్న కాస్త చిరాకు కలిగించింది.

వీరు అప్పటికే పోలీసు పటేలుగా పని చేస్తున్నారు. అయినా తన అంతరాత్మ ముస్లింల మతోన్మాదం సహించలేకనే ఆ సభ్యత్వం పొంది నివురు గప్పిన నిప్పులా రగులుతూ హిందువుల సంక్షేమానికి, ఈ ఉద్యమాలకు చేయూత నిచ్చాడు. అది మా తండ్రిగారివద్ద ఉండటం వారిద్దరి అన్యోన్యత, స్నేహం, ఒకే భావనకు కట్టుబడి ఉన్నారనేది నిస్సంకోచంగా చెప్పవచ్చును.

## 6వ ఆంధ్ర మహాసభకు మన గ్రామ తొలి ప్రతినిధిగా — శ్రీ మంగు వెంకటయ్యగారి ప్రవేశం

1937లో నిజామాబాద్‌లో జరిగిన 6వ ఆంధ్ర మహాసభ నాటికి మన గ్రామంలో ఆర్య సమాజ్ ప్రచారం హరిజన సేవా కార్యక్రమాలు, వయోజన విద్యా పాఠశాల, నడుపుతున్న శ్రీ మంగు వెంకటయ్యగారు పెద్దల మన్ననలు, మంచియు చురుకైన కార్యకర్తగా గుర్తింపు పొందగలిగారు.

అందువల్లనే ఈ ఆరవ (6) ఆంధ్ర మహాసభకు ప్రప్రథమ ప్రతినిధిగా మన గ్రామం తరఫున హాజరైనారు. ఆ సభను

వచ్చిన ప్రముఖులు, ప్రతినిధులెందరో పరిచయం కావటం, వీరు చర్చలలో పాల్గొని మన గ్రామ పరిస్థితిని వివరించటంతో తెలంగాణా నలుమూలల నుండి వచ్చిన ప్రతినిధులు, మన గ్రామ సమస్యల్ని ఉద్యమ పరిస్థితిని తెలుసుకోగలిగారు.

ఆ సందర్భములోనే ఆంధ్ర మహాసభ మహిళా విభాగానికి అధ్యక్షురాలైన శ్రీమతి నందగిరి ఇందిరాదేవి (పేరు వడ్ల కొండ నర్సింహ్మశర్మగారి కూతురు. వీరి భర్త ఆ రోజులలో మహబూబ్‌నగర్ జిల్లా జడ్జిగానో తాలూకా జడ్జిగానో పని చేస్తున్నారు.) పరిచయం కావటం మన ఆత్రాఫ్ బల్దా జిల్లా కార్యవర్గ సభ్యులగు శ్రీ లక్ష్మీకాంతరెడ్డి (దీవీనగర గ్రామ వాసి) పరిచయం కావటం జరిగింది.

6వ ఆంధ్ర మహాసభకు ముందే మన గ్రామంలో జరిగిన వైద్య మహాసభకు ఆయుర్వేద మహాపండితులతో పాటు శ్రీ మాడపాటి హనుమంతరావుగారు, శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు, శ్రీ బొజ్జం నర్సింలుగారలు హాజరైనారు.

వీరు మన గ్రామంలో జరుగుచున్న ఆయుర్వేద మహాసభకు రావటానికి ఓ ప్రత్యేకత కూడ ఉన్నదని తెలిసింది. శ్రీ వడ్లకొండ నర్సింహ్మరావుగారిని శ్రీ చొల్లేటి నృసింహ రామ శర్మగారు ఆహ్వానించటము, వారు పై పెద్దలను ఆహ్వానించటము, వారు అందుకు అంగీకరించడము జరిగింది. కాని ఈ మహాసభను "నిజాం ఆయుర్వేదాంధ్ర మహాసభ"గా ప్రకటిస్తే

తప్ప రాలేమని చెప్పటముతో అందుకు వీరు అంగీకరించారు.

ఈ "నిజాం ఆయుర్వేదాంధ్ర మహా సభ"ను 6వ ఆంధ్ర మహాసభ అనుబంధ సంస్థగా తీర్మానించి ఆమోదించారు కూడా.

ఈ మహాసభకు తలవని తలంపుగా ప్రముఖులు రావటానికి అంగీకరించటము, వ్యవధి చాలని తరుణంలో మహాసభను విజయవంతం చెయ్యడం మాటలుకాదు. అంత తేలికైన పనేమీ కాదు.

ఈ మహాసభ ఎక్కడ చెయ్యాలి? ఎలా చెయ్యాలి? వచ్చే ప్రముఖులకు వసతులు, ఇలా తలముసకలతో ఉన్న శ్రీ చాల్లేటి నృశింహ రామశర్మగారికి శ్రీ పేర్వారం సంతాజీగారు స్వయంగా ముందుకు వచ్చి ఆ ఏర్పాట్లన్నీ నేను చూస్తానంటూ బాధ్యతను స్వీకరించారు.

వ్యవధి చాలా కొద్దిగా ఉన్నప్పటికి గ్రామంలోని అన్ని వర్గాల ప్రజలను సమీకరించుకొని ఆ ఉన్న కొద్ది వ్యవధిలోనే అన్ని వసతులు పూర్తి చేసి మహాసభ విజయవంతం కావటానికి తోడ్పడి నాడు,వచ్చిన ప్రముఖుల మన్ననలను అందుకొన్నాడు.

## నిలువెత్తిని మూర్తీంచుకు

శ్రీ మంగు వెంకటయ్యగారు 6వ ఆంధ్ర మహాసభలో పాల్గొన్న ఉత్సాహం, స్ఫూర్తితో గ్రామానికి చేరుకొన్నారు. అంతకుముందు పాఠశాల నడుపుట, ఆర్యసమాజ్, హరిజన

సేవ, సాహిత్యం తెచ్చి పంచుట, ఆదర్శాలను బోధించుటవరకే ఉన్న పరిమితి ఆచరణలో కార్యరూపంలో పెట్టి చూపించే స్థితికి ఎదిగింది ఉద్యమం.

గ్రామానికి ఆర్యసమాజ్ తరఫున ఈ ప్రాంతాన్ని చూస్తున్న శ్రీ బలదేవ్, భద్రదేవ్ గారలతో శ్రీ పడ్లకొండ నర్సింహా రావు, శ్రీ ఉమ్మెత్తల కేశవరావుగారలను ఆహ్వానించుటకు ప్రయత్నాలు మొదలైనవి.

గ్రామంలో నేను యింతకుముందే వివరించినట్లుగా నిలువు వెట్టిదాకిరిని రద్దు చేయుటకు దొరల నొప్పించి మాన్పించాలనేది నాటి విధానం. ఆనాటి ఉద్యమాలు, ఆందోళనల ద్వారాగాని, చిటగలచే విధానంగాని చేసే అంతస్తుకు ఉద్యమం పెరుగలేదు. దొరల హృదయాలను కరిగించి, వారికి నచ్చచెప్పి, వారిలో పరివర్తన తీసుకరావటమే నాటి ఉద్యమ లక్ష్యం.

లక్ష్యం తోనే వీరిని ఆహ్వానించారు. ఆ పెద్దలు గ్రామానికి రావటము, హరిజనులను ప్రథమంగా సమీకరించి వారి బాధలను తెలుసుకోవటము, విద్యా బోధనలో ముందు కొచ్చిన యువకులను అభినందించటముతో పాటు గ్రామ దొర లగు శ్రీ నెల్లుట్ల కేశవరావు, శ్రీ లింగాల వెంకట రంగారెడ్డి మొదలగు వారిని కలిసి ఈ నిలువు ఎట్టిని చేయించుకోకూడదని వారికి నచ్చచెప్పటం వారు సంతోషంగా ఒప్పుకొని ఈ నాటి నుండే మేము మానుకుంటామని దొరలు వాగ్దానం చెయ్యటంతో

అస్పృశ్య సమూహానికి గ్రామంలో తొలి విజయం లభించింది. ఇది ఆనాడు హరిజనులకు కొండంత బలం చేకూరింది. ఏదో పెద్ద తెలిసిన బరువును నెత్తిమీద నుండి దించుకొని హమ్మయ్యా అని ఊపిరి తీసుకొన్నంత ఉత్సాహం పొందినారు.

అయినా దీని వెనకాల మరో గాథ కూడా వుంది. శ్రీ కొండా వెంకటరంగారెడ్డి ముత్యపన్నా దొరయని (దత్తు వచ్చిన వాడు) ఈ వారసత్వం వ్యవహారములు కోర్టులలో నలుగుచున్న సమయం, మాల్లు జాతి (దేవస్వా)లో పైరవీలు చేయున్నందున ఈ పెద్దమాల సహకారం ఎంతో అవసరం. పైగా వీరికి శ్రీ కొండా వెంకట రంగారెడ్డి అంటే ఎంతో అభిమానం. వారి మాటను జవదాటని వారు గాబట్టి ఉద్యమకారుల పని తేలికైనది.

## హరిజన వాడలో గో, హత్య నిషేధం

1938 మన నిజాం రాష్ట్రంలో స్టేట్ కాంగ్రెస్ తరపున సత్యాగ్రహోద్యమం ఆరంభమైంది. అంతవరకు ఉన్న ఆంధ్ర మహాసభ లక్ష్యాలు విస్తృత పరచబడినవి. గ్రామాలలో సభలు జరిపి సత్యాగ్రహ ఉద్యమ లక్ష్యాలను వివరిస్తున్నారు నాయకులు. గాంధీగారి ఉద్యమంలో భాగమైన హరిజన సేవాసంస్థలు గోహత్య నిషేధం, కల్లు త్రాగుట మాన్పించుటకు, హరిజనులలో పరివర్తన తీసుకరావటానికి శ్రీ వెంకటయ్యగారి నాయకత్వాన ఒక పథకం రూపొందించారు.

మాల, మాదిగల కుల పెద్దల ఆమోద మరియు ప్రయోజన

పాఠశాలకు వస్తున్న యువకుల తోడ్పాటు, శ్రీ వెగ్గ లక్ష్మయ్య నాయకత్వాన యువకులు ముందుకు వచ్చారు.

అప్పటికి ప్రతి శుక్రవారం తప్పనిసరిగా హరిజనవాడలో గోవును కోసేవారు. అందులో ముస్లింలకు కొంత హరిజనులు కొంత తీసుకొని భుజించేవారు. ఆ రోజు ఈ యువకులు గోవును కోయకుండా అడ్డు తగిలారు. దీనికి ముస్లింలు అభ్యంతరము తెల్పటముతో కొంత ఉద్రిక్తత పెరిగినప్పటికి మా హిందువుల ఇండ్లల్లో గోహత్య చెయ్యనివ్వం, కాకపోతే మీరు మీ ఇండ్లల్లో కోసుకోండి. మరేమైనా చేసుకోండి. అట్లా అయితే మా కేలాంటి అభ్యంతరము ఉండదని వారికి నచ్చ చెప్పటముతో ఇక విధి లేని పరిస్థితిలో ముస్లింలు వారి ఇండ్లలో కోసుకోవటం ఆరంభించారు. అయినా యిది వరకు తిన మరిగిన వారు కాబట్టి కొంతను దొంగచాటుగా తెచ్చుకొని భుజించేవారు.

ఒకనాడు కాగ బోడ రాములు తల్లి పోశమ్మ గోమాంసాన్ని దొంగచాటుగా తెచ్చి వండుకొంటున్న సమయంలో హరిజన యువకులు శ్రీ వెంకటయ్యగారికి కబురు చేసి, వారు రాగానే హరిజనులందరూ పోశమ్మ ఇంటికి పోవటంతో పోశమ్మ కొడుకు రాములుకు అవమానంగా తోచింది. ఆ పొయ్యిమీద ఉడుకుతున్న మాంసాన్ని తల్లిని కాదని వీధిలోకి తెచ్చి అందరి సమక్షంలో పగులగొట్టి తల్లిని చీవాట్లు పెట్టాడు. దానితో పెద్ద మార్పు వచ్చేసింది. దీనితో పెద్దలు, దొంగచాటుగా తెచ్చుకొని తిందామన్న ఈ పాఠశాలకు వెళ్ళే యువకులు, అట్టి పనిగట్టి

తెసనివ్వరు. పైగా అవమానాలకు గురి కావలసి వస్తుందనే భయంతో మానటం జరిగింది.

## కల్లు త్రాగటము మాన్పించుట

గ్రామాలలో కల్లు త్రాగుట వల్లనే పేద వర్గాలు, ముఖ్యంగా మాలు, మాదిగలు ఆర్థికంగా, సాంఘికంగా ఎంతో వెనుకబడుతున్నారనేది నిస్సందేహం. ఇటు నైజాం ప్రభుత్వం గూడ చట్టపరంగా కాకుండా ముస్లిం మత సంస్థలు గూడా కల్లు త్రాగికూడదని ప్రచారం మొదలుపెట్టాయి. ఇది వారి మత రీత్యా గూడ నిషేధమే. అందువల్ల కల్లు త్రాగటం మానితె మా మతంలోకి తీసుకుంటాము అని ప్రలోభము చేస్తున్నారు.

దీనికి తోడుగా నాడు "బహద్దూర్ యార్ జంగ్" అనే నవాబునాడు 'ఖాక్ సార్' అనే పార్టీ శాఖ పెట్టి మత ప్రచారం ఊరూరా సాగిస్తూ హరిజనులకు కొత్తబట్టలు ఉచితంగా యిస్తూ మతంలోకి ఆకర్షింపబడేటట్లుగా ప్రచారం సాగుచున్నది.

ఇది మన వారికీ కూడా బాగా అనుకూలించింది. గ్రామంలో శ్రీ వెంకటయ్యగారు ఈ వచ్చిన అవకాశాన్ని జార విడువదలచలేదు. ప్రతి సాయంత్రం జనం కల్లు త్రాగే సమయంలో ఈ వయోజన పాఠశాల విద్యార్థులకు మద్దెల, హార్మోనియం యిచ్చి పాటలు పాడిస్తూ గ్రామమంతా తిరిగి చివరకు దిద్దెంకి వరకు చేరి (కల్లు త్రాగే స్థలాన్ని దిడ్డెంకి అని పిలుస్తారు) కల్లు త్రాగుచున్న వారి ముందు ఈ పిల్లలతో పాటలు పాడి

స్తుంటే ఇది త్రాగేవారికీ ఇబ్బందిగా తయారయింది. ఈ ఉద్యమం ప్రతి నిత్యం సాగటంతో త్రాగేవారిలో కొంత పరివర్తన రావడం ఆరంభమైంది. ఆ రోజులలో ఈ పాటలు బాగా పాడేవారు.

"తగని పని యిది తమ్ముడా,
మరణ హేతువు — మద్య పానము
మానవోయి తమ్ముడా—"
"కలుగును మానిన మన దేశమ్మునకు,
కలుగును కల్మి ముదముగ వృద్ధిన్"

ఇం।

"పిల్లలు పృథముగ పెరుగుదురండీ
తల్లిదండ్రులు జగదము మానెదరండీ"

నేను ఈ ఉద్యమ శ్రీ మంగు వెంకటయ్యగారిని కలుసుకునేందుకు హైదరాబాదు వెళ్ళాను. వారిని నాటి జ్ఞాపకాలు తెలుపమని కోరటం వారు చెప్పుతుండగా కోరూ నాటి ఈ పాటలను పాడి వినిపించటానికి ప్రయత్నించారు. ఎంతకూ జ్ఞాపకం రావటంలేదు. ఆ సందర్భములో వారి శ్రీమతిగారైన రుక్మమ్మగారు నాటి పాటలను కొంత కొంత చదివి వినిపించింది. ఇంకా మరెన్నో పాటలుండేవని, అవి జ్ఞాపకం రావటంలేదని తమ నిస్సహాయతను వెలిబుచ్చారు.

ఈ ప్రచారంవల్ల కల్లుత్రాగటం దిన దినం తగ్గుచున్నది.

ఇది గౌడ కులస్థులను / కలవరపెట్టుచున్నది... వారి వృత్తిరాలు
అప్పటికె అంతంత మా ంగళ
దొరలకు రూ॥లు 400లు నాలుగువందల నిజాం నవ్వా-
యులు చెల్లించవలసివుంటె తలకుమించిన భారం అనాడు. ఒక్క
పాలీ పైనకు కడివెడు కల్లు త్రాగి పొలకబోసుకునేంత పోసే
వారట. మరి అనాడు అడకూలి మూడుపైసలు ఇంటిలో
ప్రొద్దస్తమానం కూలిచేసి తెచ్చిన కూలీలో ఏ వస్తువైనా ముడి
కాల చొప్పున అన్ని వస్తువులు కొని మిగిలిన ఒక పైస మగ
వాడు త్రాగటానికి ఉపయోగించేవాడు. నాటి కొనుగోలు పరి
స్థితి అది.

ఈ ప్రచారంవల్ల కల్లు అమ్ముడు పోవటంలేదు; అని ఊరుకున్నారా గౌడవారు, లేదు కల్లు అమ్ముడు పోవటానికి ధరను మరింత తగ్గించారు. ఈ ఉద్యమకారులు మరింత ముందుకు వెళ్ళి మొత్తంమీద ఏ ఒక్కరు త్రాగకుండా నిషేధించారు. గౌండ్లవారికి ముందు నుయ్యి వెనుక గొయ్యిలా వుంది పరిస్థితి. కల్లు గీయకపోతే చెట్లెండిపోతవి. దొరలకు పన్ను కట్టలేరు. బ్రతుకు సాగదు. గీస్తే దినదినం కొద్ది కల్లు నిలువ ఉంటుంది. త్రాగేవారు లేక చెల్లవాలి ఒలక బోయటం తప్ప గత్యంతరం లేదు.

అందుకు శ్రీ దిడ్డెంకి వీరన్నగారు (వీరి ఇంటిపేరేమిటో తెలియరాలేదు వాడుకలో ఈపేరే వచ్చింది) తన కులాన్నంత సమీకరించాడు. కల్లు పారబోసిన దానికన్న కొన్ని రోజులు

ఉచితంగానే పోస్తామని డబ్బు అవసరంలేదని ప్రచారం గావించటమే గాక స్వతహాగా ఇంటింటికి వెళ్ళి కల్లు పెట్టి వచ్చేవారు. వీరు వెళ్ళగానే హరిజన యువకులు వెనువెంటనే అందుకొని ఒలకబోసేవారు. ఇట్లా ఈ సమస్య పరిష్కరింపబడని విధంగా ఒక కొరకరాని కొయ్యగా తయారైంది. మొత్తము మీద ఈ ఉద్యమం గౌడ కులస్తులకు అప్పటివరకు ప్రత్యామ్నాయ జీవన విధానాన్ని చూపలేక పోయిందని మాత్రం విశదమగుచున్నది.

## నిజాం పరిపాలన రజతోత్సవాలు (సిల్వర్ జూ(

1938-39 ప్రాంతంలో నిజాం పరిపాలన రజతోత్సవాల కోలాహలంతో మహావైభవంగా జరిగింది. ఇందుకు కారణం నిజాంగారి మన్ననలను పొందటానికి ఇక్కడి దొరలు, దేశ్‌ముఖ్‌లు, ముస్లింలు కలిసికట్టుగా ఉండి విజయవంతం చేశారు. నాకు బాగా జ్ఞాపకం ఉంది, ఈ ఉత్సవాలకు రఘునాథపల్లి, కంచనపల్లి, అశ్వరావుపల్లి, కోమాళ్ళ, వెల్ది మొదలగు గ్రామాల బడి పిల్లలేగాక ఆయా గ్రామాల యువకులుకూడ పాల్గొన్నారు. ఆ రోజుల్లో ప్రధాన ఆటలు రస్సీ-కసీ అని త్రాడులాగుట, జోన్ పాట్—ఉప్పు బొందలు పరుగు పందెం—హారం, ఎత్తు దూకటం, మూడు కాళ్ళ పరుగు పందెం, ఇంకా మరికొన్ని. ఇక—సాంస్కృతిక పోటీలలో రాజుగారిపై పాటలు, ప్రభు భక్తి నాటకలు, ప్రదర్శించేవే చాలా వరకు.

ఆ టోర్నమెంటుకు మా గ్రామ పిల్లలకు తెల్లని లాక్కా—

నెక్కురు పసుపు పచ్చని అంచులు కలిగి ఉండేవి. ఛాతీపై నిజాం నవాబుగారి కిరీటాన్ని పోలిన బిల్ల, బాడ్జ్ ను ధరించేవారు. అప్పటికే మన గ్రామ జాతీయోద్యమ గాలి ప్రభావం రఘునాధ పల్లి, కంచనపల్లి మొదలగు గ్రామాలకు వీచటం, ఆ గ్రామాల ఉద్యమ నాయకులు కంచనపల్లి మధుసూధనరావు, రఘునాధపల్లి బెల్లె వీరయ్య, మొగుళ్ళపెల్లి భద్రయ్య, మరికొందరు స్టేట్ కాంగ్రేస్ తరఫున కార్యకర్తలుగా జేరి పని చేస్తున్నారు.

ఈ రజతోత్సవాల వేడుకలను పురస్కరించుకొని మన గ్రామానికి విచ్చేశారు. అప్పటికే మన గ్రామము జాతీయోద్య మంత ఎంతో ముందంజ వేసింది. ఉత్సవాలు రెండు మూడు రోజులు జరిగినట్లుగా జ్ఞాపకం.

## ఉత్సవాల ముగింపు

అది రాత్రి సమయం. వేదికమీద పెట్రోమాక్స్ లైట్లు, ఒక్కచక్కటి కందీలల వెలుగులు వెలుగుచున్నవి. మైకుల కాలం కాదు. నాటి గొంతులే మైకులు.

ఆఖరు రోజు కాబట్టి విజేతలకు బహుమతుల పంపకము ఉంటుంది; కాబట్టి చుట్టు ప్రక్క గ్రామాల ప్రజలుగూడా పెద్ద ఎత్తున వచ్చి చేరారు. బహుమతులు పంచటం పూర్తి అయింది. చివరగా నిజాంగారి పరిపాలనపై వారి యశో కీర్తిని పొగడుతూ పాడాలి.

అవకాశం చిక్కింది. అంతకుముందె వేసుకున్న పథకం

ప్రకారం కంచనపల్లి విద్యార్థులు శ్రీ గోపాల సోమయ్య, నారాయణగారలు (వీరిద్దరు అన్నదమ్ములే) అలంకరించిన వేదిక మీదికి ఎక్కి చక్కని గొంతుతో మంచి ఊపునిస్తు లయబద్ధంగా గళమెత్తి —

"అమ్మా తులసీ ప్రేమను వెలసీ
మము పాలింపగ రావమ్మా"...

అంటూ పాడుతుంటే పల్లె వేలకొద్దీ జనం తన్మయత్వంలో మునిగి మైమరచి ఓలలాడింది. ఆ పాట భావం నీ భక్తులమైన మాకు దాస్యశృంఖలాల నుండి విముక్తి పొందు శక్తినివ్వమని కోరటమే.

పాట ముగిసింది. జనం తోసుకుంటూ ముందుకెళ్ళింది. ఆ పిల్లలనిద్దరిని ఎత్తుకోవటమే గాదు, ముద్దాడటమే గాక వారిద్దరిని ఉక్కిరిబిక్కిరి చేశారు.

తలంచినది ఒకటి, జరిగింది మరొకటి. ఈ ఉత్సవాలు ప్రభు భక్తిని రంగరించి పోయటానికి తాని ఎదురు తిరిగి దేశ భక్తిని రగిలించింది. ఇది ఆనాటి సంఘటన. పల్లెసీమలో తెలుగు వెలుగు ఒక మెరుపులా మెరిసింది. ఉరుములా ఉరిమింది. జాతీయోద్యమ కర్తవ్య ప్రబోధం చేసింది ఆ పాట.

**ముస్లింల మత ప్రచారం - హిందూ స్త్రీలను చెఱబట్టుట**

మన గ్రామంలో హిందువులను ముస్లింలుగా మార్చిన సంఘటనలు మొత్తం మీద లేవని చెప్పవచ్చు. కారణం, నేను

తెలుసుకున్నంత వరకు అలాంటి ఆధారాలేమి దొరకలేదు. కాని హరిజనులను ముస్లింలుగా మార్చుటకు వారు తక్కువ ప్రయత్నమేమి చేయలేదు. తెలుగువారిని ముస్లింలుగా మార్చుటకు 'బహద్దూర్ యార్ జంగ్' అనే నవాబు అంజుమన్ తబ్లీగ్ ఇస్లాం, ఖాక్‌సార్ అనే పార్టీల పేరుతో మత ప్రబోధం చేస్తూ పేదైన చోట్ల మారుస్తూ వారికి కొత్త బట్టలు పంచిపెడుతూ వెళ్ళినారు. జనగామలో కూడ ముషీర్ అహ్మద్ అనేవాడు తీవ్రంగా కృషి చేసేవాడు. మన గ్రామంలో కూడ ప్రయత్నించి విఫలులైనారు. జనగామలో ప్రత్యేకించి ముస్లిం బోధనకు ఒక స్కూలును గూడ నడిపారు. ఆ స్కూలును ముషీర్ హై స్కూలుగా పిలిచేవారు.

అప్పటికే మన గ్రామంలో ఆర్య సమాజ్, హిందూ పరిషత్ తరఫున శ్రీ వెంకటయ్యగారు, శ్రీ చొల్లేటి నృసింహ శర్మ గారు హిందూ ధర్మ ప్రచారం గావిస్తూ హరిజనులచేత ప్రతి నిత్యం స్నానం చేయించటం, బొట్టు పెట్టుకోవటం, దైవ ప్రార్థన చేయించటం మొదలగు విషయాలపై, కేంద్రీకరించి పని చేస్తుండటం వలన తురకలకు అవకాశం చిక్కలేదు. అయినా వారు ఆశ వదులుకోలేదు. పరోక్ష పద్ధతులు అవలంబించారు. ఇదితర గ్రామాలలో ముస్లింలుగా మారిన హరిజనులను మన గ్రామములో బంధుత్వమున్న వారిని ఏరి కోరి యిక్కడ మార్చుటకు ప్రయత్నించారు.

ఆ వచ్చిన వారిలో ఒకరు నాగిల్లాపుర నివాసి. ఇతడు

హరిజనులలో పెద్ద భూస్వామి. సుమారు 100 ఎకరాలకు పైగా భూమి కలవాడు. నాగ పెద శివ్వయ్య అల్లుడు గంది సాయిలు మరొకడు కొత్త పెల్లి వాస్తవ్యుడు. మన గ్రామ నాగ చినఎల్లయ్య గారి బంధువులు. వీరిద్దరిని ఆటునుండి జనగామ మునీర్ అహ్మద్ ఇటునుండి కొత్త పల్లి ఫత్తూర్ సాహెబ్ గారలు విశ్వప్రయత్నం చేసినప్పటికి మన గ్రామ హరిజన పెద్దలు నాగ చినయెల్లయ్య, నాగ అబ్బసాయిలు, యువకులు జగ్గు లక్ష్మయ్య మొదలగువారి ప్రతిఘటనవల్ల పూర్చలేకపోయారు.

**హిందూ స్త్రీలను చెరబట్టుట :** ఆ రోజుల్లో హిందూ స్త్రీలను చెరబట్టుట ముస్లింలకు పెద్ద వినోదం, గౌరవం. ఎవరు ఎంత మందిని చెరబడతారో ఎవరు ఎందరిని ఉంపుడుగత్తెలుగా ఉంచుకుంటారో వారు పెద్దమనిషిగా చెలామణి అయ్యేవారు. ఒకసారి హిందూ స్త్రీ బలత్కరింపబడిందంటే, ఆ యువతిని తిరిగి మనలో చేర్చుకోవడం అసంభవం. ఆ యువతి ఎందుకు చెడింది అని ఆలోచించే ఆస్కారమే లేదు అనాడు. అది పతిత, కులట ఇంకా ఏవేవో పేర్లు పెట్టి కుల బహిష్కరణేకాదు, సాంఘిక బహిష్కరణలకు గురి చేసేవారు. ఆ యువతులు విధిలేసి పతి గత్యంతరము లేక ఆ మతంలోకి పోవటమో లేక ఒంటరిగా జీవనం గడుపుతూ ఉండటం జరిగేది. ఒకరిద్దరు ముస్లిం ఆచార వ్యవహారములు అలవర్చుకున్నా, ఎక్కువ సంఖ్యలో కడవరకు ఒంటరిగా జీవించి ఉన్నవారే ఎక్కువ.

ఆనాడు మన గ్రామంలో ముస్లింల మూతుకి చర్యలకు బలియైన వారిలో ముఖ్యులు కొందరు.

1. సరాబు సిద్దయ్య బిడ్డను....ఇమామ్ అలీబేగ్
2. కల్లూరి రాజమ్మను....మహబూబ్ అలీ
3. ముప్పిడి అచ్చమ్మను....తురాబ్ అలి దఫేదార్
4. దాసరి సాయమ్మ....ఖాజా అలీ
5 కమ్మరి జగదాంబ....గులాం నబీ

కంపెని ప్రస్తుతపు పేరు..............గా నాటి చరిత్రకు నేడు సాక్ష్యంగా మిగిలి ఉంది, సజీవంగా, ఇది వ్రాస్తున్న నాటికి.

## రైతు సమస్యలపై రావి నారాయణరెడ్డిగారి ఆగమనం

అది 1939 అనుకుంటా. గ్రామంలో వయోజన విద్యతో పాటు గోవధ నిషేధం, మద్యపాన నిషేధం ప్రజలను సాంఘికంగా చైతన్యం కలిగిస్తున్నప్పటికి రాజకీయంగా కూడ ముందుకు తీసుకపోవాలన్న తలంపు వచ్చింది. పైగా ఏది చేసినా గ్రామస్థులే కదా అన్న చులకన భావం కూడ నాడు ఏర్పడి నట్లున్నది. అందుకే నాయకులను ఆహ్వానించి రైతుల సమస్యలపై చర్చించి వారిని ఐక్యం చేయడానికి పూనుకున్నారు.

ఆదే సంవత్సరము రైతుల స్థితిగూడా అంతగా బాగా లేదు. నాటి ప్రధాన పంటలు జొన్న, కంది, ఆముదము, తిల

వలు మాత్రమే. జొన్న చేలు దెబ్బతిన్నవి. ఆముదము, కంది పురుగుకు బలి అయినవి. రైతులు ఆందోళన చెందుతున్నారు. ఈ అవకాశాన్ని శ్రీ మంగు వెంకటయ్య, శ్రీ భాష్యం రామాచారికి రాజకీయంగా ఉపయోగించుటకు సమయం చిక్కింది.

శ్రీ వెంకటయ్యగారు హైద్రాబాద్ వెళ్ళి ఆర్.ఎస్. మొదలగు నాయకులను కలిసి సంప్రదించారు. వారు కూడా సంతోషంతో రావటానికి అంగీకరించారు. గ్రామంలో పంటలు దెబ్బలు తిన్నవని రకాలు మాఫీ చేయించుటకు నాయకులు వస్తున్నారని రైతులనందరిని సమీకరించారు. ముఖ్యంగా నాటి రైతు సదస్సుకు 1. శ్రీ త్యాగల రాములు 2. శ్రీ దాగంటి మల్లయ్య (రాజయ్య అన్న) 3. గాదె పెద సర్వయ్య 4. శ్రీ గుజ్జుల చంద్రయ్య మొదలగువారు మంచెల గూడెం నుండి 1. శ్రీ రావటి కొమురయ్య (కర్రెన్న తండ్రి) 2. శ్రీ వారాల ఆగయ్య 3. కోదెల పెద మల్లయ్య 4. శ్రీ పెంటపూరి చెన్నారెడ్డి 5. శ్రీ కట్కూరి పెద మల్లారెడ్డి జాపకె గూడెం నుండి 1. శ్రీ మంగు సంపాద్రి, 2. వరదయ్యగారు, 3. శ్రీ పేర్వారం సంతాజీ, 4. మా తండ్రిగారు, 5. కుమ్మరి బుచ్చయ్య, 6. మీసాల రాజయ్య, 7. సాయిలు మొదలగు పెద్ద రైతులను, ముఖ్యులను సమావేశపరిచారు.

ఈ సదస్సుకు శ్రీ రాపె నారాయణరెడ్డి, ఆముల్ల లక్ష్మి నర్సింహ్మారెడ్డి, ఎర్రబత్తి గౌంగిడి మోహన్ రెడ్డి, మంచుముల రామచంద్రరావు, వడ్లకొండ నర్సింహ్మరావు ఇంకా మరి

కొందరు పెద్దలు, ఈ రైతు సదస్సుకు హాజరయినారు. పాడైన పంట చేలను కండ్లారా చూచారు. వాటి పరిష్కారానికి, రకం మాఫీ చేయించటానికి కృషి చేస్తామని వాగ్దానం చేశారు. మీరందరూ ఆంధ్ర మహాసభలో చేరాలని కోరారు. ఐకమత్యంతో మెలగాలని అప్పుడే మన కోరికలు నెరవేరగలవని ఉద్బోధించారు.

ఆ సదస్సులోనే మొట్ట మొదట హరిజనులకు మంచినీటి బావి గురించి, రాత్రి పాఠశాలతో పాటు ఉదయం పాఠశాల కూడ కావాలని కోరటం జరిగింది. దీనికి ఆ వచ్చిన నాయకులు అంగీకరించి, మీరు సగం భరిస్తే హరిజన సేవా సంస్థ నుండి మిగతా సగం యిప్పించగలమని వాగ్దానం చేశారు. హరిజన పిల్లలకు నాగు ఉచితంగా పలకలు, పుస్తకాలు, పంపరము చేశారు. బట్టలకు సగం గ్రామస్తులు భరిస్తే మిగతా సగం భరించగలమని చెప్పారు.

## గ్రామంలో తొలి పఠనాలయం

ఈ సందర్భంలోనే గ్రామంలో ఒక పఠనాలయాన్ని స్థాపించి, రాజకీయ చైతన్యం కల్గించాలనే సూచన వచ్చిన పెద్దలు వెయ్యదమే తమవుగా అప్పటికప్పుడే శ్రీ కోట్లేటి నృసింహరామశర్మగారి ఇంటి ముందున్న గదిలో పఠనాలయాన్ని స్థాపించినారు. తరువాత మెలమెల్లగా అభివృద్ధి పరిచి, దిన, వార, పక్ష, మాస పత్రికలెన్నో తెప్పించటం జరిగింది.

ఇందుకు ముఖ్యంగా గ్రామ షాహుకార్లగు శ్రీ ఎల్లం నారాయణ, సిద్ధయ్య, నరాల వెంకన్న, నారాయణ, చంద్రయ్య, లగిశెట్టి పాపయ్య, కలకుంట్ల రామయ్య, ఎల్లం రామయ్య మొదలగు వారెందరితోటో చందాలు కట్టించి, ఆంధ్రపత్రిక, గోలుకొండ, రయ్యత్, వైదిక ఆదర్శ మరెన్నో పత్రికలు తెప్పించి చదవడం, చదివించడం, ప్రతి సాయంత్రం గుంపులు గుంపులుగా చేరి దేశకాల పరిస్థితులను తెలుసుకోవటమే గాక వాటిపై చర్చలు జరిపేవారు.

మొత్తం మీద మన గ్రామం జాతీయోద్యమ బాటను పయనించడంలో ఈ ప్రాంతంలో వెనుకబడి యుండలేదు. పైగా ఈ ప్రాంతానికి ఒక ఆశా జ్యోతిగా, ఆదర్శ గ్రామంగా రూపు దిద్దుకొన్నది.

## నిజాం ప్రభుత్వ నిర్బంధాలు

1940 హైద్రాబాద్ జిల్లా మల్కాపురంలో జరిగిన 7వ ఆంధ్ర మహాసభకు శ్రీ మంగు వెంకటయ్యగారి ప్రోత్సాహంతో జగ్గు లక్ష్మయ్య, కాగ బుచ్చివీరయ్య, కాగ రాములు కొడుకు వీరయ్య ఇంకా మరికొందరు యువకుల వెంట వేసుకొని పోవటం జరిగింది.

ఈ సభ నుండి తిరిగి వచ్చిన తర్వాత ఉద్యమం ఉచ్ఛ స్థితికి ఏ మేరకు పెరుగుచున్నదో ఆ మోతాదులోనే నిజాం నిర్బంధము గూడ పెరిగింది.

శ్రీ చొల్లేటి నృసింహ్మశర్మగారిని ఉద్యోగం నుండి తీసి వేయడం, మంగు వెంకటయ్యగారిపై తీవ్రమైన ప్రతిఘ్న తేవడం ప్రారంభమైనవి. అవి ఎంతవరకు వెళ్ళినవంటె తండ్రి పట్వారి గిరికి రాజీనామా చేయటమా? కుమారుణ్ణి తొలగించటమా? తేల్చుకోవలసిందిగా శ్రీ సింహాద్రి గారికి హెచ్చరికలు యిచ్చారు.

హరిజన ముఖ్య కార్యకర్తలపై దొంగ కేసులు బనాయించి కోర్టులకు త్రిప్పటం మొదలయింది. ఆనాడు శాగ వీర మల్లయ్య మరి నలుగురి పైన తప్పుడు కేసులు పెట్టి అత్రాఫ్ బల్దా జిల్లా కోర్టులకు (హైద్రాబాద్‌కు) త్రిప్పటం జరుగుతుంది.

అంతకు ముందే శ్రీ బూర్గుల రామకృష్ణారావు, ఉమ్మెత్తల కేశవరావు, మందుముల రామచంద్రరావు తదితరులతో యేర్పడిన ఉచిత న్యాయ సలహా కమిటీ ఈ ఫిర్యాదును వెంక[illegible]య్యగారు అందించటం వారు మన జిల్లా న్యాయ సలహా కోర్టులలో కేసులు చూస్తున్న శ్రీ శ్రీనివాసరెడ్డిగారికి ఈ కేసును అప్పగించటం, వారు కోర్టులో వాదించి వీరమల్లయ్య మొదలగు వారిపై ఉన్న కేసును కొట్టి వేయించటం జరిగింది.

ఈ కేసుతో మనం నెగ్గటముతో మన గ్రామానికే గాక, ఈ ప్రాంతానికె ఒక బలమైన కేంద్రమైంది మన ఊరు.

స్థానిక పోలీస్ దఫేదారు పరాభవం చెందినంత పని అయ్యి, మరింత పట్టుదలతో కక్ష సాధింపుకు పట్టుదలతో

న్నారు. కేసును గెలిచిన మన వాళ్ళు విజయగర్వంతో మరింత ఉత్సాహంగా ఉన్నారు.

ఈ సందర్భములోనే శ్రీరామ నవమి వచ్చేసింది. తొమ్మిదిరోజులు మహా వైభవంగా ఉత్సవాలు జరిగినవి. చివరి రోజు సీతారాముల విగ్రహ ఊరేగింపు అట్టహాసంగా భజనలు—కీర్తనలతో సాగిపోతుండగా అనుమతి లేదని ఆటకాయించి చప్పళ్లు వాయించే వారిని కొట్టటం - వాయిద్యాలను పాడుచేయటంతో రెచ్చిపోయిన జనం దఫేదారును చితకబాదారు. పైగా ఆఘమేఘాల మీద హైదరాబాద్‌కు వెళ్ళి గోలుకొండ పత్రిక సహాయ సంపాదకుడుగా పనిచేస్తున్న శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ మరికొంత మంది పెద్దలను కలిసి వెంటనే పత్రికలో ప్రచురింపజేశారు. "శ్రీరామ నవమి ఊరేగింపు పై దఫేదారు దౌర్జన్యం" అను శీర్షికన వెలువడింది.

ఈ వార్త గోలుకొండ పత్రికలో రావడం పోలీసు ఉన్నతాధికారులు విచారణ జరపడం జరిగింది. కోర్టులో కొన్ని రోజులు కేసు కూడా నడిచింది. తర్వాత వీగిపోయింది.

ఈ విధంగా గ్రామంలో సమస్యలు ఒకదాని వెంట మరొకటి రావడం - కోర్టుల వెంట తిరగడంతో సతమతమౌతూనే హరిజనవాడలో వాగ్దానం ప్రకారం మంచినీటి బావిని త్రవ్వించడం, ఉదయం పాఠశాలను ప్రారంభించి నడపటం పిల్లలకు ఉచిత పుస్తకాలు - బట్టలు యివ్వటం జరిగింది.

ఈ రెండు విజయవంతం కాగానే హరిజనసేవా విభాగం పంపి రావలసిన సహాయం కొరకు శ్రీ రావి నారాయణరెడ్డి గారికి వెంకటయ్యగారు వెళ్ళి వివరించడం, వారు సేవా సంస్థ తరఫున మంచినీటి బావిని, దీనిని తనిఖీ చేయుటకు శ్రీ మంత్రి గొంగిడి మోహన్‌రెడ్డిగారిని పంపడం, వారు స్వయముగావచ్చి పరిశీలించి రిపోర్టు పంపడం జరిగింది.

అదే విధంగా గ్రామములో మరో రెండు వయోజనవిద్యా కేంద్రాలు స్థాపించడం జరిగింది. హరిజనవాడలో ఉన్న పాఠశాలలో ప్రధానంగా చేస్తున్న శ్రీ పెరుమాండ్లగారు ప్రభుత్వ ఉపాధ్యాయుల పదవి దొరకినందున వారి స్థానములో శ్రీ మేడర కోటయ్యను నియమించడం, ఇతను ఏ పేరాడు కేసుతో హరిజనులకు వ్యతిరేకంగా వ్యవహరించడంతో ఇతని తొలగించి శ్రీ ఆశీర్వాదం అనే హరిజనున్ని ఆ స్థానములో నియమించారు.

ఇక గ్రామంలో ఉన్న రెండు విద్యా కేంద్రాలలో ఒకటి శ్రీ వెంకటయ్యగారు స్వయంగా తన ఇంటిలో రెండవది ప్రస్తుతము మా ఇంటి ముందున్న గాదె చెన్నయ్యగారి ఇంటిలో శ్రీ పెరుమాండ్ల దాశరథిగారు (మా అన్నగారు) కొద్దిరోజులు నడిపి నారు. హరిజనవాడలో మరో కేంద్రాన్ని శ్రీ గుజ్జుల వీరయ్య గారు కొద్దిరోజులు నడిపినారు.

మొత్తం మీద మన గ్రామంలో జాతీయ భావ ప్రేరణకు ఆర్యసమాజ్ కానివ్వండి, ఆంధ్ర మహాసభ కానివ్వండి, కాంగ్రెస్ కానివ్వండి, అది ఏదైనా, ఏ పేరుతో ఉన్నా జాతీయ

ఉద్యమ సౌధానికి అహోరాత్రులు కృషిచేసి పునాదులు నిర్మించిన ఘనత శ్రీ చొల్లేటి నృసింహ్మశర్మగారు, శ్రీ మంగు వెంకటయ్యగారలకు దక్కిందని చెప్పక తప్పదు. అందువల్లనే మన గ్రామం జాతీయ ఉద్యమంలో తలమానికంగా ఈ ప్రాంతానికి నిలిచింది.

శ్రీ మంగు వెంకటయ్యగారికి ఆ రోజుల్లోనే ల్యాండ్ రికార్డ్సు (బందోబస్తు శాఖలో) లో ఉద్యోగం వచ్చినా దాంట్లో కొద్ది రోజులే పనిచేసి, ఉద్యోగాన్ని త్యజించి, గ్రామంలో హరిజన సేవా, సాంఘిక సేవా సంస్థలతోను, జాతీయోద్యమాలను నడిపిస్తున్న రాష్ట్ర మహా నాయకుల, పెద్దల సహవాసం లభించి ఈ మహా యజ్ఞంలోకి ఆకర్షింపబడినారు. అందువల్లనే మన గ్రామ తొలి ఉద్యమ నిర్మాతలుగా చరిత్రలో శాశ్వతంగా నిలిచి ఉంటారు.

## రెండవ ప్రపంచ యుద్ధంలో మన గ్రామ వీరుని విజృంభణ; యుద్ధంలో కరువు కాటకి నృత్యం

ఆశ్చర్యంగా ఉందేమో ప్రపంచ యుద్ధమేమిటి? మన ఊరు పేరు ఏమిటని? ఈ ప్రపంచ యుద్ధం 1939లో చిన్నగా ప్రారంభమై 1941 లో తీవ్రరూపం దాల్చి, 1944-45 లో మరీ భయంకరంగా మారి ముగిసింది.

జర్మన్, జపాను వారు ప్రపంచాన్నే జయించి తమ పాదాల క్రిందికి తెచ్చుకొనుటకు ఆ యుద్ధం జరిగింది. అందులో

నాటి మన దేశం బ్రిటిష్ వలసగా ఉండబట్టి, మనకూ ఆ యుద్ధంతో సంబంధముంది. ఇంకా బ్రిటిష్ సైన్యాలు, మన గ్రామ పొలిమేరల్లో, అశ్వరావుపల్లి వెల్ది, కోమాళ్ళ, గ్రామాల వద్ద ఉండి ప్రతినిత్యం యుద్ధతంత్ర తర్ఫీదు పొందుచుండేది. వారున్నన్ని రోజులు ఫిరంగి మోతలు. ఆ మోతలతో ఆ ప్రాంతమంతా దద్దరిల్లేది. ఆ ఫిరంగి దెబ్బలు గోపాలస్వామి కొండలకు గురిచూసి కాల్చటం నేర్చుకొనేవారట నాడు.

ఈ యుద్ధములో మన గ్రామ నివాసియగు శ్రీ గాదె రామస్వామిగారు సైనికుడుగాచేరి బర్మా, మలయా, సింగపూర్, ఆఫ్రికన్ అడవుల వరకు వెళ్ళి కొన్ని యుద్ధాలలో పాల్గొని యుద్ధం ముగిసిన తర్వాత అజేయుడై తిరిగి వచ్చాడు.

ఇతను ఆజానుబాహువు, అందుకుతగ్గ కండలు తిరిగిన బలిష్టుడు, చామనఛాయ, కోలముఖం, కల్గినవాడు మంచి కలుపుగోలుతనం ఉన్న మనిషి. సైన్యంనుంచి తిరిగివచ్చిన తర్వాత, ఈ గ్రామంలోనే ఉండి, కొన్నిరోజుల తర్వాత, తన అత్తగారి గ్రామమైన చిలుపూరులో వ్యవసాయం చేస్తూ, ఈ మధ్యనే మరణించాడు. అందుకే ఈ యుద్ధంతో సంబంధం మన గ్రామానికి

ఈ యుద్ధం ఒకవైపు భయంకరంగా కొనసాగుచున్నది. మరోవైపు భీకరమైన కరువు యేర్పడి ప్రజలు పస్తులతో చావలేక బ్రతికున్న రోజులవి. అప్పుడే రంగూన్, బర్మా బియ్యం అని మన గ్రామంలో కొని తింటూ చెప్పుకొనేవారు. ఆ రోజుల్లో తిండి లేక తెగడిమట్టి చల్లలో కలుపుకొని తినేవారట. అంతే

కాదు, ప్రౌఢస్త్రమాసం పేడలు గంపలు, నెత్తినేసుకొని వాగులు, వొర్రెలు తిరిగి పంప గడ్డలు, కందమూలాదులను త్రవ్వితెచ్చి ఉడుకబెట్టుకొని తినేవాడట.

1940 నుండి 45 వరకు సాగిన యుద్ధం దాని విష ఫలితాలు, ఇటు జాతీయోద్యమాల వెల్లువ, స్టేట్ కాంగ్రేస్ సత్యాగ్రహాలు ఉత్తుంగ తరంగాల వలె లేచి పడుతుంటె మరోవైపున కరువు రాక్షసి గజ్జెకట్టి విలయ (ప్రళయ) తాండవం చేస్తు — కత్తి దుళిపిస్తుంటె గోటిచుట్టపై రోకటి పోటన్నట్లుగా నిజాం ప్రభుత్వానికి లేవీ తోలటం ప్రజలకు పెద్ద సమస్య అయి కూర్చుంది. ఒకపూట తిని మరోపూటకు దాచుకొన్న గింజల్ని బలవంతంగా లాక్కెల్లడమూ, నిజాం ప్రభుత్వానికి నిత్యకృత్యమై

ఈ లేవీకి వ్యతిరేకంగా, వెట్టి చాకిరికి వ్యతిరేకంగా, ఆంధ్ర మహాసభ, కమ్యూనిష్టు పార్టీలు పిలుపునివ్వటంతో అగ్ని గుండం బ్రద్దలై లావా అనే పోరాటం ఎగజిమ్మింది—.

## పఠనాలయం గ్రంథాలయోద్యమంగా మారింది

1945 చివరిలోనో లేక 1946 ప్రారంభంలోనో అంతకు ముందు శ్రీ పొర్లేటి నృసింహదాసు శర్మగారి ఇంటిముందు చిన్న గదిలో నుండి మార్చి ప్రస్తుతం పలకుంట్ల జగ్గయ్యగారు ఉన్న దుకాణం గదిలోకి మారింది. అప్పుడే "జైహింద్ గ్రంథాలయం" అను పేరుతో స్థాపించబడింది. దానికి తొలిగ్రంథ పాలకుడుగా

శ్రీ భాష్యం వెంకటాచార్యులను నియమించటం జరిగింది. రాత్రి
పూట గ్రంథ పఠనముతో పాటు రాజకీయ కార్యకలాపాలకు
నిలయమైంది. చర్చలు, కార్యక్రమాలు సాగించటం ఉధృత
మైంది. హరిజన వాడలో వున్న పాఠశాలలు ఈ గ్రంథాలయా
నికి రాజకీయ ఉప కేంద్రాలైనవి. హరిజనవాడతో అంటరాని
తనం పోగొట్టుటకు సహపంక్తి భోజనాల వరకు వచ్చేసింది
ప్రగతి. హరిజన వాడలను శుభ్రంగా ఉంచుటకు స్వయంగా
కుల మత భేదం లేకుండ అన్ని కులాలవారు చీపుర్లు చేత
ధరించి వీధులను ఊడ్చడము ప్రారంభమైంది. రాత్రులందు,
వీధి నాటకాలు (భాగోతం) ప్రదర్శించడము, భజన మండలులు
స్థాపించి భక్తి కీర్తనలు చేస్తు, యువకుల సమీకరణ చేస్తు,
జాతీయ భావాలను వారికి రంగరించి పోస్తున్నారు ఉద్యమ
పెద్దలు.

ఇక్కడ ఒక చిన్న విషయం చెప్పాలి.

ఆరోజుల్లో ముస్లింలు తమ ఆరాధనమందిరము (మసీదు)
లో ప్రాతఃకాలమున, మధ్యాహ్నము, తిరిగి సాయంత్రం నమా
జుకు పిలుపు యిచ్చేదాన్ని హజా అంటారు మన గ్రామపెద్దలు
ముస్లింల మత పిలుపుతో మనం మేల్కొనటం నచ్చలేదు. అం
దుకు ముందే మనం మన దేవతల మేలుకొలుపు పాటతో ముందు
చెవిన పడాలి, అనే భావం రావటం, దాన్ని కార్యరూపంలో
పెట్టటానికి హరిదాసు నర్సయ్య, మరొకరు మిత్ర అయ్యోరు
(పేరు సరిగా తెలియరాలేదు) చేత రామదాసు కీర్తనలు

}యించేవారు.

ఈ హరిదాసు సర్వయ్యది ముందు ఏ ఊరో తెలియదు కాని వీరిని నాటి గ్రామ పెద్దలు మంగు సింహాద్రి, పేర్వారం వెంకటాడ్, ఎఱ్ఱం నారాయణ, నరాజు నారాయణ, పెర్మాండ్ల రామయ్య మొదలగు పెద్దలు పిలిపించి గ్రామ దక్షిణం వైపు పడ్డెర ఇండ్ల ప్రక్కన కొంత స్థలం యిచ్చి, ఇల్లు కట్టుకొనుటకు అన్ని విధాల సహకరించారు. వీరు ప్రతిరోజు ప్రాతఃకాలంలో గం. 4, ల మధ్య ముస్లింల హజా (ప్రార్థనకు ముందు) కు ముదలే గ్రామంలో చక్కటి గొంతుతో తంబూర మీటుతూ, చిరుతలు వాయిస్తు భక్త రామదాసు మేలుకొలుపు కీర్తనలు ఆలా పిస్తు, వీధుల వెంట వెళ్ళుచుంటె, ప్రజలు ఆ భక్తి కీర్తనలు విని మేలుకొనేవారు. ప్రతి ఇంటి వారు హరిదాసు వస్తున్నాడని విధిగా లేచి తమకు తోచినన్ని బియ్యం పెట్టి పంపేవారు. ఈ విధంగా హరిదాసుకు భుక్తి, ప్రజలకు భక్తి ప్రేరణ జరిగేది.

ఆ పు తర్వాత కొద్ది రోజులకే రామదాసు కీర్తనలు చేస్తు భద్రాచలం నుండి సాక్షాత్తు రామదాసే దిగి వచ్చాడా ? అన్న భావన కలిగే విధంగా తంబూర వాయిస్తు రామదాసు కీర్తనలు చేస్తు తిరిగేవాడు, వీరి ఆచార వ్యవహారాలు, మడి, శుచి శుభ్రత మొదలగునవి చూస్తుంటే, ఇప్పటి రోజుల మాట అటుంచి ఆ రోజుల్లోనే అసలు గుడి పూజారి నైతం ఇంత కట్టుబాట్లతో మెలగలేదేమో అని అనిపిస్తుంది.

వీరు మరెవ్వరో కాదు. అచ్చంగా హరిజనుడు (మాదిగ)

నిజంగా ఇటువంటి వాడెప్పుడైనా హరిజనుడే. హరికి దగ్గర వాడే. వీరు ఏ మూడు గంటలకో లేచి చెరువుకు వెళ్ళి, స్నానం చేసి, పట్టు పంచె కట్టుకొని చంకకు రాగి చెంబు (అక్షయపాత్ర) పఠించి మెడలో రుద్రాక్ష మాలలు వేసుకొని కీర్తనలు చేస్తు పోయేవాడు. ఆ మధుర గానమునకు నిదుర లేచినవారు తోచిన బియ్యాన్ని పెట్టేవారు. అలాగని అడుక్కోవటానికి వేసిన వేషం మాత్రం కాదని చెప్పవచ్చు.

వంటనికి కావలసినవి అర సేరుకు తక్కువ, పావు సేరుకు ఎక్కువ ఉండే అతడొక్కడే ఆ బియ్యాన్ని ఇప్పుడున్న నక్కోరి కిందే ఒక గదిలో స్వయముగా వండుకొని భుజించే వారు.

నాటి భజన మండలిలో సరాబు రామయ్య, కలకుంట్ల జగ్గయ్య, సరాబు సర్వయ్య, లగిశెట్టి విశ్వనాథం, హనుమాండ్ల నరహరి, రాపుల యాదగిరి, పద్మ మల్లయ్య, పద్మ సత్తయ్య మరియు పానుగంటి సిద్దయ్య ఇంకా మరెందరో కోడె వయస్సులో యున్న యువకులు పాల్గొనేవారు. వీరికి భజన పంతులుగా రఘునాథపల్లి గ్రామ నివాసి శ్రీ చాతరాసి వెంకటయ్య గారు, ఇంకొకరు శ్రీ కాటికొండ నారాయణరెడ్డిగారు ఉండే వారు.

శ్రీ కాటికొండ నారాయణరెడ్డి ప్రత్యేకించి భజనవరకే పరిమితం. ఇక చాతరాసి వెంకటయ్యగారు భజన గురువులే

కాదు ప్రధానంగ వీరు తాలూకా జిల్లా ఇతర గ్రామాల, నగరాల, రాజకీయ పరిస్థితిని ఇక్కడ వివరించటము, ఇక్కడి పరిస్థితిని, కార్యకలాపాలను, పైకి తెలియజేయుటము వార్తాహరుడుగ ఉపయోగపడుచుండే వారట.

గ్రామంలో గ్రంథాలయం నీడన పెల్లుబికిన రాజకీయ చైతన్యం, స్టేట్ కాంగ్రెస్, ఆంధ్ర మహాసభల పేరుతో కార్యకర్తలు ముందుకు వచ్చారు. ఈ పనిచేసినవారిలో పలు దృక్పథాలు కలిగిన వారున్నారు.

## గ్రామంలో అతివాద, మితవాద భావాలు

9, 10 మడికొండ (ధర్మసాగరం) హైదరాబాద్‌లలో జరిగిన ఆంధ్ర మహాసభలు కాంగ్రెస్ అనుకూలురైన శ్రీ మంగు వెంకటయ్యగారు, శ్రీ శ్రీభాష్యం రామాచారి, ఎల్లం సుబ్రయ్య, చిలువూరి పద్మయ్య, మడుక సర్వయ్య, కాగ చిన యెల్లయ్య, తెగ్గు లక్ష్మయ్య గారలు, ఇంకా మరి కొందరు కాంగ్రెస్ కార్యకర్తలుగా ప్రచార రంగంలోకి దిగి ఉత్సాహంగా పని చెయ్యటం ప్రారంభించారు.

10వ మహాసభలో శ్రీ కొండా వెంకట రంగారెడ్డిగారు అధ్యక్షులుగా గెలవటంతో అతివాద భావాలు కలిగిన వారు శ్రీ రావినారాయణరెడ్డిగారు, బద్దం ఎల్లారెడ్డి, ఆరుట్ల సోదరులు ప్రత్యేక ప్రచారం నిర్మాణం (organisation) చేపట్టి పల్లె, పల్లెకు ఆంధ్ర మహాసభ సభ్యత్వ పుస్తకాలు పంపటము,

చేర్పించటముతో పాటు, గ్రామాలలో ప్రజలు నిజ జీవితంలో
ఎదుర్కొంటున్న సమస్యల్ని పరిష్కరించుటకు పూనుకోవ
టము, ఆచరణలో ఆంధ్ర మహాసభ "సంఘం" పేరున ప్రజల
ప్రేమానురాగాలను చూరగొన్నది.

1944 లో భువనగిరిలో జరిగిన 11వ ఆంధ్ర మహాసభ
నాటికి గ్రామంలో అతివాద మితవాద భావాలు కలవారు ముం
దుకు వచ్చారు. అయినా కాంగ్రెస్ ఆంధ్రమహాసభ ఒకటేనన్న
భావం వున్నప్పటికి సంఘం వారు దొరలకు వ్యతిరేకంగా
పని చెయ్యటం, సామాన్య జనం సంఘం వైపు మొగ్గు చూపింది.

ఈ అతివాద భావాలు కలవారిలో పెర్మాండ్ల రామయ్య
(మా తండ్రిగారు), మాదరబోయిన పెద్దాపురం, కాసని క్రిష్ణ,
మిట్టెబోయిన రాజాలు, అడ్డగూడూరి నారాయణ, దాట్ల పర్వ
తాలు, లంబాడి సోమ్లా, కొర్ర గోద్యా, కొర్ర మొద్దు, కొర్ర
రాంసింగ్ గార్లు ముందుకు వచ్చారు.

దీనికి కారణం వీరందరు కూలిదార్లే. దొరలతో పీడింప
బడుచున్నవారే. అందువల్లనే సంఘములో చేరటం జరిగింది.

## 1946 లో కార్యకర్తల పట్టుదల
## కొన్ని విచిత్ర సంఘటనలు

గ్రామ కాంగ్రెస్ ముఖ్యనాయకుడైన శ్రీ మాగు
వెంకటయ్యగారు జిల్లా వెళ్ళి కాంగ్రెస్ సభ జరుపుటకు ప్రభుత్వ

అనుమతి మాత్రం పొందినారు కాని, ఉపన్యాసాలచ్చే నాయకులు, ఏ కారణం వల్లనో పైనుండి రాలేక పోయారు. (బహుషా ముందు నాయకుల అనుమతి పొందకుండ ఈ అనుమతి పొందినట్లున్నది). తెల్లవారితే సభ అనగా రాత్రిపూట శ్రీ దుడుక సర్వయ్య గారి నాయకత్వాన గోడల మీద సభగురించి వ్రాశారు. (గోడల మీద వ్రాయడం ఇదే ప్రారంభం, ఇంతకు ముందు ఎక్కడ ఎప్పుడు వ్రాసినట్లుగా తెలియరాలేదు) ఈ విషయం స్థానిక పోలీస్ వారికి తెలియనే తెలియదు. మధ్యాహ్నం వరకు ఉత్రాపెద్దా జిల్లా నుండి ఇదరు జవానులు వచ్చారు. స్థానిక పోలీస్ వారు మేము రిపోర్టు పంపందే మీరెందుకొచ్చారని, దీనితో వచ్చిన వారికి వీరికి మాటా మాటా పెరిగి ఘర్షణకు దిగారు. ఆ వచ్చినవారు ఇక్కడున్న వారిని కొట్టడముతో స్థానికులకు తల వంపు అయింది. ఈ గ్రామ యువకులతో కలసి ఆ వచ్చినవారిని చితుక బాది సాదరంగా సాగనంపారు. ఇది స్థానిక యువకులకు బాగా ఉపయోగ పడింది.

మరికొద్ది రోజులకే స్థానిక భజన మండలివారు యధా విధిగ భజన ప్రారంభిస్తే స్థానిక దఫేదారు తప్పత్రాగి భజన చేస్తున్న స్థలానికి రావడము దాని ఆపుచెయ్యమని, అడ్డగించటముతో రెచ్చిపోయిన యువకులు సమయం బాగా కలసి వచ్చిందని గ్రహించిన సరాబు నర్సయ్య, కలకుంట్ల జగ్గయ్య, హనుమాండ్ల నరహరి మొదలగువారు ఆ దఫేదారును చితుకబాది

నివాస స్థలం నుండి గెంటివేశారు.

ఇక రాజావారుగారు పైకి రిపోర్టు పంపలేక, జరిగిన అవమానాన్ని దిగమ్రింగలేక నానా రోజులు బయటకు వెళ్ళకుండా తనలో తానే మథనపడి, కుమిలి దిగమ్రింగుకున్నారు పాపం.



# ఆంధ్ర మహాసభ – కమ్యూనిస్టు పార్టీలపై నిషేధము

1946 లో మన గ్రామానికి తూర్పున ఉన్న కడవెండి లో ప్రజలు విస్నూరు దొర రాపాక రామచంద్రారెడ్డి దౌర్జన్య చర్యలకు వ్యతిరేకంగా నిజాం గద్దె దిగాలి, లెవీ రద్దు కావాలి, వెట్టిచాకిరి రద్దు, దున్నేవానిదే భూమి మొదలగు నినాదాలతో శాంతియుతంగా సాగుతున్న ఊరేగింపుపై దొరసాని గుండాలు (రామచంద్రారెడ్డి తల్లి కడవెండిలో వుంటుంది) రెచ్చిపోయి పొంచి ఉండి ఊరేగింపుకు అగ్ర భాగాన ఎర్ర జండా చేత ధరించి ముందుకు నడుస్తున్న వీరుడు దొడ్డి కొమురయ్యను ఆ పొంచి ఉన్న గుండాలు తుపాకీలో కాల్చి చంపారు.

ఈ సంఘటన తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటానికి నాంది పలికింది, కాదు నిజాం ప్రభుత్వ పతనానికి జమీందారీ, జాగీరుదారీ వ్యవస్థను బద్దలు కొట్టడానికి అది అంతిమ పోరాటానికి శంఖారావాన్ని పూరించింది. కొమురయ్య చిందించిన నెత్తురులో వందలు, వేలు వీరుల పుట్టల్లా అప్పటికప్పుడే

వేనకు వేలు నేల ఈనిన విధంగా చుట్టు ప్రక్కల గ్రామాలను గ్రామాలే తేచినవి. కడవెండి వైపుకు కదిలింది జనసముద్రం కదలి తరంగాలవలె. ఆ ప్రక్కనే పాలకుర్తిలో చాకలి అయిలమ్మ తన భూములను రక్షించుకొనుటకు విస్నూర్ దేశ్‌ముఖ్ వ్యతిరేకంగా అపర కాళికాశక్తి వలె లేచి పోరాడుచున్నది.

పడమట ఆకునూరు, మాచిరెడ్డిపల్లె, పోరాటాలు ఎగచిమ్మిన జ్వాలలు, ఆకాశంలో క్రమ్మిన పొగ మేఘాల నినదిస్తున్న ఉరుములు, చూస్తూ ఊరుకుంటుందా నిద్రాణంలో అణగి మణగి యున్న జనం, తల పైకెత్తి చూసింది. ఎగచిమ్మిన జ్వాలలు, క్రమ్మకు వస్తున్న పోరాటపు మేఘాలు జనగామనే కాదు, ఒక తెలంగాణనే కాదు, యావత్ భారత దేశాన్నే కన్నెత్తి చూడమంది కడవెండి. ఆనాటి ప్రముఖ పత్రికలన్నీ పతాక శీర్షికలు పెట్టి ప్రచారాన్నిచ్చాయి.

దీనితో నిజాం ప్రభుత్వం గడగడలాడింది. ఇక దొరలు, దేశముఖులు శలభాల్లా కాలిపోనక తప్పదనుకున్నారు. ఇక నిజాం ప్రభుత్వం చూస్తూ భరించలేక ఆంధ్ర మహాసభ కమ్యూనిష్టు పార్టీల మీద 1946 నవంబర్‌లో నిషేధం విధించింది.

## ఇక నా గురించి రెండు మాటలు

1946 లో నేను హన్మకొండలో మర్కాజి పాఠశాల లో చదువుకొంటున్న రోజులు. గ్రామాలలో జాతీయ ఉద్యమాలు, ఆంధ్రమహాసభ, కమ్యూనిష్టు పార్టీల కదలికలు. సభలు,

సమావేశాలు, మొదలగునవి చూస్తూనే ఉన్నాను.

తేది సరిగా జ్ఞాపకం లేదు. మహాత్మాగాంధీ గారు రేపే వరంగల్ వస్తున్నారని తెలిసింది. ఎప్పుడు తెల్లవారుతుందా! ఎప్పుడు చూడటం, అనే ఆదుర్దాతో రాత్రంతా ఒక్క కునుకు పాటు గూడ తీయలేదు.

తెలవారింది, నేను నాతోటి విద్యార్థులు మల్లారెడ్డి (నెమిలె, భువనగిరి తాలుకా) ఒంటెల అగారెడ్డి (మీదికొండ) మాదాశరథి (హన్మంతాపురం) ఇంకా మరి కొందరితో ఉదయం ఏడు గంటల వరకే వరంగల్ చేరుకున్నాము. అప్పటికే అజాంజాహి మిల్లు ప్రక్కన ఉన్న మైదానమంతా నిండి పోయింది. అప్పుడు మాకనిపించింది, ఇక గాంధీ గారిని చూచి నట్లేనని, నిరాశ నిస్పృహ కలిగింది. గాంధీగారు వస్తున్న సమ యం ఆసన్న మైన కొద్ది జనంలో త్రొక్కిసలాటలు, ఉరుకులు, పరుగులు కోలాహలం, పోలీస్ - కాంగ్రెస్ సేవాదళ కార్య కర్తలు చేస్తున్న అదుపు పట్టుదప్పి పోతున్న దనిపించింది. కొందరు పిల్లలు రైలు పట్టాల వెంబడి పరుగెత్తటం చూదాను. నా మిత్రులతో—వారే నాతో పరుగెత్తుకుంటూ వస్తారా లేక ఇక్కడే చస్తారా, అని వారి తిరుగు జవాబును కూడ విన కుండానే పరుగు లంఘించాను. పోలీసువారు కాంగ్రెస్ కార్య కర్తలు ఆగు ఆగు మని అరవటమే వారికి మిగిలింది.

బండి రానే వచ్చింది. రైలుపెట్టెలో నుండి గాంధి గారిని నెమ్మదిగా దించుతున్నారు. నేను నెమ్మదిగా పెట్టె

క్రింది భాగం నుండి మెల్లగా వచ్చి చేరాను. గాంధీగారికి 20, 30 గజాల దూరంలో ఇక అక్కడ పోలీసు సేవాదళ వలం టీర్లు, గోడ పెట్టినట్లున్నారు. అయినా నేను చక్కగా చూడ గలిగాను. వారు ఏమి చెప్పింది వినే ఓంత ఓపిక అసలు వుం డేగా నాకు.

తిరిగి సాయంత్రం వరకు ఇల్లు చేరేసరికి నా మిత్రులు నా కన్న ముందే వచ్చేశారు. వారు ఎంతో బాధ పడ్డారు. నేను ఏదో ఘనకార్యం సాధించినవాడిలా పోజులు పెట్టి చెప్పుకొనేది, నేను గాంధీగారిని దగ్గర నుండి చూచానని.

## బడి గంట కొట్టాలి

నేను 7వ తరగతిలో వున్నాను. హుస్మాకొండ అష్టు-కి బజారు చౌరస్తా వద్దనున్న మర్కజీతో, హూ సదర్ మొద రిస్ (ప్రధానోపాధ్యాయులు) గారి పేరు శ్రీ 'రషీదుల్ హసన్' గారు. చాలా మంచి వ్యక్తి అంటుకే పిల్లలంరూ గౌరవ భావంతో భయంగా ఉంటూరు. నీలం రంగు శేర్వాని ఆ బడి డ్రస్సు తప్పని సరి.

ఆ రోజు పెద్ద ఊరేగింపు విద్యార్థులది. అందుకో సాగానాలి, విద్యార్థి నాయకుల సమావేశం జరిపి నిర్ణయాలు తీసుకొన్నారు. అదేమి నాకు తెలియదు, నా మిత్రుడు మల్లా రెడ్డి స్కూల్లో ప్రార్థన అయిన తర్వాత, మొదటి గంటలోనే గంట కొట్టాలి, ఈ బాధ్యత వీరు తీసుకొన్నారట. అందు

శేనేమో, అదర్పుబాటు, బిత్తర పోయిన ముఖం, గొప్పకు తీసు కొన్న నిర్ణయం - గంట కొట్టక పోతే పరువు పోతుందనే ఆవేద నతో కంగారు పడుచున్నాడు.

ఖాజీపేట నుండి బయలు దేరిన ఊరేగింపు రానే వచ్చింది హన్మకొండ పోలీసు హెడ్ క్వార్టర్స్ వరకు; అప్పు డుగాని తెలిసింది నాకు. ఆ గంట సరిగ్గా సదర్ ముదర్రిస్ గారి ముందు ఉంది. అటు వెళ్ళితే ఆట్టే పసిగట్ట గలడు. అందు చే ఎటూ తోచక తికమక పడుచున్నారు. ఇది గమనించిన నేను ప్రశ్నించాను. సెలవు గంట కొట్టాలి అంటూ కళ్ళల్లో నీళ్ళు తిరుగుచున్నాయి. నన్ను ఒకే శాస్త్ర కొట్టిరారా; రాత్రికి మన అందరికీ సినిమా టికెట్లు కొంటారా - అంటూ దీనంగా అన్నాడు. ఓ దీనికె ఇంత ఇదారా అంటూ టక్కుని లేచి, మెరుపులా వెళ్ళి ఘణ ఘణ మంటూ గంట మ్రోగించానో లేదో అప్పటికే ఎదురుచూస్తున్న విద్యార్థులు బయట పడ్డారు. "కౌను హైరే బచ్చే" అంటూ లేచాడో లేదో మా సదర్ ముదర్రిస్ గారు గుంపులో కలిసిపోయాను. ఈ సంఘటనతో నాకు ఒక గుర్తింపు, గౌరవం లభించింది.

## జండాల నెగర వేసే కార్యక్రమం

15వ ఆగస్టు 1947, ఢిల్లీ ఎఱ్ఱకోట మీద జాతీయ జండా ఎగిరింది. ఇంతకు ఒక రో ముందే మా కార్య క్రమం [illegible] [illegible]

పదిమంది వరకు కలిశాము. తెల్లవారితే 15 ఆగష్టు అనగా చిన్న చిన్న జండాలు తీసుకొని మా బజారులో ముస్లింల ఇండ్లపై రహస్యంగాను, మన వారి ఇండ్లపై బాహటంగాను ఎక్కి ప్రతి ఇంటికి ఒక జండా చొప్పున ఎత్తి నెమ్మదిగా తెల్ల వారు జామున ఇల్లు చేరుకున్నాము. ఇట్లా ఎవరి వీధిన వారు ఎత్తటముతో తెల్లవారగానే హన్మకొండ యావత్తు ఎటు చూచిన జండాల మయమే. ఇది చూచి తెలుగువారు సంబర పడితే, ముస్లింలేమో చిందులు త్రొక్కి నానా రభస చేశారు.

## బ్రాహ్మణ వీధిలో మీటింగ్ - లాఠీ చార్జి

భారత్‌కు స్వతంత్రమొచ్చి సరిగ్గా నెల కూడా కాలేదను కుంటా. హన్మకొండలో బ్రాహ్మణ వాడలో ఒక కూడలి వద్ద నాడు కొద్దిపాటి స్థలం, ఆ స్థలంలో ఒక చిన్న చింత చెట్టు. దాని క్రింద ఒక నల్లా వుంది. వంద లేక రెండొందల మంది వరకు మాత్రమే కూర్చుండే స్థలం ఇది. విద్యార్థి నాయకుల ఆదేశానుసారం, అప్పటికి రాత్రి చురుకుగా కదలి, కార్యక్రమా లను నెరవేర్చి విద్యార్థుల బహిరంగ సమావేశము ఏర్పాటు చేసి తెలియ జేశారు. తెల్లవారే సరికి సభాస్థలం వద్ద ఉన్న ఎదురెదురు ఇండ్లకు చేరుకోవాలి. తర్వాత పది గంటలకు మీటింగ్ అన్నారు. అదే విధంగా చాలా మందిమి చేరు కొన్నాము.

ఈ వార్త పోలీసుకు ఎట్లా తెలిసిందో మరి, తెల్లవార

గానే ఆ వీధికి విద్యార్థులను రాకుండా గుమి కూడకుండాను కట్టుదిట్టం చేశారు. దాదాపు 144 సెక్షన్ విధించినట్లుగా వుంది ఆ వీధి మొత్తం. అంతకు ముందే మేము చేరుకొన్నాము. గనుక మాకెలాంటి ఇబ్బంది కలుగలేదు. దాదాపు వందమంది వరకు చేరుకొన్నాము ఇంకా ఎంతమంది ఎక్కడెక్కడ ఉన్నారో అంతుపట్టటములేదు. సమయం మించిపోతున్నది. సుమారు 11-00 గం॥ల ప్రాంతములో మా ఎదురుగా వున్న ఇంట్లోనుండి ప్రక్కనే వున్న చెట్టుక్రింది ప్రదేశంలోకి చేరుకొంటున్న విద్యార్థులను చూచి, వారితో కలిశాము. మా గుంపు ప్రశాంతంగా కూర్చున్నది.

అక్కడే కాపు కాస్తున్న పోలీసువారు మా గుంపు చుట్టూ వలయాకారంగా ఏ ఒక్కరూ తప్పించుకపోలేని విధంగా నిలబడినారు మా వెనకాల. ఒక పది నిమిషాలు అంతా నిశ్శబ్దము. మా గుంపులో నుండి ఒక విద్యార్థి లేచాడు. (ఆ విద్యార్థి హైదరాబాద్ నుండి వచ్చిన వాడు) స్వాతంత్ర్యం గురించి కొంత చెప్పి, ఇక నిజాం స్టేట్‌లో మనం గూడ స్వాతంత్ర్యం కొరకు పోరాడాలి అని చెప్పబోతున్నాడు కాని—

మాకు చెప్పే వారి వైపు కండ్లు, వెనుక వైపు చెవులు పోలీసు వారి కదలికలను కనిపెడుతున్నాయి. నాలాంటి వారికి అసలే కొత్త. ముందు ఏమౌతుందో నన్న బెంగ ఒక వైపు కుదిపి వేస్తుంటే, మరో వైపు ఉపన్యాసం యొక్క ఉత్తే జం. ఇది ముగిశాక ప్రతికి [illegible] చేసుకొంటూమా ఉన్నా

సంశయం వెన్నంటి పీడిస్తున్నది. పాపం పోలీసు వాటు కూడ ప్రశాంతంగా నిలబడి చూస్తుంటే కాస్త ధైర్యం కూడ కలిగింది. చివరకు నినాదాల పర్వం వచ్చింది.

—'ఎశాం సేట్ ఇండియన్ యూనియన్లో - చేరాలి'.

—కాంగ్రెస్ - జిందాబాద్.

—నిజాం నవాబు - ముర్దాబాద్.

అనే ఈ చివరి నినాదం ప్రతిధ్వనించిందో లేదో, అంతే ఒక్కుమ్మడిగా లాటీదెబ్బలు విరుచుకు పడుతున్నాయి. ఆ దెబ్బలకు ఆగలేక కొందరు అమ్మో! అయ్యో! అనేవారు కొంద రైతే, భారత్ మాతాకు జై అనేవారు మరి కొందరు.

క్షణాలలో గుంపు చెదిరింది. ముఖ్యులనందరిని చాప చాది పట్టుకొన్నారు. అట్లా కొద్దిపాటి తేలిక దెబ్బలతో పరుగు లంఘించి బయట పడ్డాను. సాయంత్రం అదుకు గాని ఇల్లు చేర లేదు. నాకు వీపులో 2, 3 వాతలు తప్ప ప్రమాదకరమైన దెబ్బలు తగలనందుకు సంబర పడ్డాను.

ఈ విషయం మా బాపుగారైన శ్రీ మిర్యాల వెంకటయ్య గారికి తెలిస్తే, ఆ దెబ్బలేమో కాని, వారి చీుడులు, చీవాట్లు భయం బాగా పట్టింది. తెల్లవారే చడీ చప్పుడు గాకుండా చదువుకు సలాం కొట్టి చెప్పకుండానే మా వూరు చేరుకొన్నాను.

## గ్రామంలో ప్రప్రథమంగా కాంగ్రెస్ ఆధ్వర్యాన గొప్ప బహిరంగ సభ

1947 ప్రారంభంలో గ్రామంలో ప్రథమంగా కాంగ్రెస్ ఆధ్వర్యాన సభ జరుపుటకు చురుకుగా ప్రయత్నాలు జరుగుచున్నవి. దాదాపు 15 సంవత్సరాల అవిరళకృషి ఫలితము యొక్క ఈ సభ. దీన్ని విజయవంతం చేయుటకు ఎంతో మంది సేవకులు సైనికులవలె క్రమశిక్షణతో, ఉత్సాహముతో, ఉరకలువేస్తూ, పరుగులు తీస్తూ, క్షణాల మీద సభా స్థలాన్ని శుభ్ర పరచి నాయకులకు వేదిక నిర్మించారు. గ్రామానికి పడమట వైపు ప్రదేశంలో.

ఈ సభకు తెలంగాణా కాంగ్రెస్ ప్రముఖ నాయకులైన శ్రీ కొండా వెంకట రంగారెడ్డి, సర్దార్ జమలాపురం కేశవరావు, మందుముల నర్సింగరావు గారలు, స్థానిక నాయకులు శ్రీ చౌడవరపు విశ్వనాథం, గూడూరు జగన్నాథరెడ్డి, కంచనపల్లి మధుసూదనరావు ఇంకా అనేక మంది పెద్దలు కార్యకర్తలు చేరుకొన్నారు. ఇంకా 10, 15 మైళ్ళ దూరాన వున్న గ్రామాల నుండి వేలకొలది ప్రజలు బండ్ల మీద, కాలి నడకన చద్దులు కట్టుకొని తిరునాళ్ళకు తరలినట్టుగా తరలింది జనసముద్రం.

ఈ సన్నాహాల పర్యవేక్షణ శ్రీ చొల్లేటి నృసింహ రామశర్మ, రామానుజపురం రంగనాథస్వామి, భాగంటి రాజయ్య, ఎల్లం నారాయణ, కలకుంట్ల రామయ్య, పెర్మాండ్ల

రామయ్య, కావటి కర్రెన్న మొదలగువారు, భోజన తదితర సదుపాయాలు చూస్తుండగా - శ్రీ ముంగు వెంకటయ్య, శ్రీ భాష్యం రామాచారి గారల పర్యవేక్షణలో — శ్రీ ఎర్రం భద్రయ్య, చిలువూరి పద్మయ్య, దుడుక నర్సయ్య, హనుమాంత్ల నరహరి, జెగ్గు లక్ష్మయ్య ఇంకా మరెందరో యువకులు వేదిక వద్ద జన సమూహాన్ని శాంతింప చేస్తూ చక్కటి వసతులు కల్పించటములో నిమగ్నమైనారు.

ఒక బండిని అందముగా అలంకరించారు. ఆ బండిపై నాయకులు కూర్చుండే వేదికనమర్చారు. పదహారు జతల ఎడ్లు కట్టి మేళతాళాలతో జగన్నాధ రథ చక్రం కదలి వస్తున్నదా! అన్నట్లు బయలుదేరింది బండి.

ఈ పదహారు జతలు మరెవ్వరివో కావు శ్రీ రంగారెడ్డి దొరవారివే ఎడ్లు, బండి. చాలీచాలని జీతంతో చావలేక బ్రతుకలేక బ్రతుకీడుస్తున్న దొరవారి జీతగాళ్ళే దొరవారి కొట్టము నుండి రావిచెట్టు వరకు ఆ రథాన్ని తెచ్చారు. ఇక్కడ నాయకులను రథం మీద ఎక్కించినారు. ఇక ఇక్కడి నుండి కాంగ్రేస్ యువ కార్యకర్తలైన హనుమాంత్ల నరహరి, పుప్పాల పాపయ్య ప్రథమ, ద్వితీయ జతలను అదలిస్తుంటె, మరెందరో యువకులు త్రివర్ణ పతాకాలు చేత ధరించి మిగతా ఎడ్ల జతలను అదలిస్తూ ముందుకు సాగిపోతుంటె, మరెందరో యువకులు రథం యిరువైపుల కదం త్రొక్కి నినదిస్తుంటె, వేలకొద్ది జనం, రథాన్ని అనుసరించింది, భారత్ మాతాకు జై!

మహాత్మాగాంధీకీ జై! అనే నినాదాలు భూనభోంతరాలు దద్దరిల్ల చేస్తుంటే భూమి క్రుంగి పోతున్నదేమో, కాదు-జనం త్రొక్కిన ప్రతి అడుగు నేల నుండి నిజాం ప్రభుత్వ, భూస్వామ్య నిర్బంధ విధానం, స్వేచ్ఛా స్వాతంత్ర్యము కొరకు వేస్తున్న ప్రతి అడుగు క్రింద భూస్థాపితమై పోతున్నదనిపించింది.

నాటి వరకు పులి పంజాక్రింది లేడి పిల్లలా పడికిన అమాయకత్వం ఒక్క పెట్టున లేచి తల ఎత్తి నలుదిశల కలియ చూచి, హమ్మయ్య అంటూ సంతృప్తితో శ్వాస పీల్చింది పల్లె ప్రజ.

ఇసుక వేస్తేరాలని జనం. ఆనాడు ఏ మైకు లేకున్నా నాయకుల సందేశాలను చివరి వ్యక్తి కూడ స్పష్టంగా వినేంత నిశ్శబ్దం క్రమశిక్షణతో జరిగింది సభ.

సభ ముగిసింది. ఏదో తెలియని స్ఫూర్తితో నిండుగా తిరుగు ముఖం పట్టింది జనం. వారు నడుస్తు వేస్తున్న ప్రతి అడుగు స్వతంత్రం అవుతున్నది ఈ నేల.

బహుశా ఇంత పెద్ద ఎత్తున ఈ విధంగా జరిగిన సభ మన తాలూకాలో ఇంతకు ముందు మరెక్కడా జరుగలేదు. ఇదే తొలి సభ అని చెప్పక తప్పదు.

నేను ఈ సభను కళ్ళారా చూచినందువల్ల, ఇప్పటికి ఈ సంఘటన జ్ఞాపకం వచ్చినపుడు, సాక్షాత్తు నాకళ్ళ ముందు కదలాడుతుంది. నాటి పట్టుదల, త్యాగదీక్ష, వెలలేనిది, చెప్ప

రానిది వ్రాయరానిది ధావం చాలదు.

## మన గ్రామాల పరిస్థితి

హైద్రాబాద్ స్టేట్‌లో ముస్లిం మత సంస్థ అయిన "ఇత్తెహాదుల్-ముసల్మాన్" కు అనుబంధ సంస్థగా "రజాకార్" (స్వచ్ఛంద సేవకులు) గా ముస్లిం యువకులను సాయుధంగా తయారు చేసి కాసింరజ్వీ నాయకత్వాన బరితెగించి గ్రామాల పైబడుచును పడుచున్నారు.

దీనికి ఐవాబుగా ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టు పార్టీలు రైతు వ్యవసాయ కార్మిక యువతీ యువకులను రహస్యంగా గ్రామ గ్రామాన సాయుధంగా ఎదిరించుటకు పను గ్రామాలను కాపాడుకొనుటకు పూనుకొంటున్నారు.

ఈ సమయంలో నా మిత్రుల గురించి : ఇక్కడ నా తోటి మిత్రులు, విద్యార్థులు అయిన స్వర్గీయ పేర్వారం నర హరి, రామానుజపురం వరదయ్య, పుప్పాల ఆచారి, మంగు యాదయ్య వ॥ రామచంద్రయ్య, బాగంటి మల్లయ్య గారలు శ్రీ పేర్వారం జగన్నాథం, బాగంటి వెంకటయ్య, మంగు సుదర్శనం, ఆరేటి యాదవరెడ్డి గారలు జనగామలో చదువు చుంచేవారు.

పేర్వారం నరహరి, వరదయ్య గారలు "ముష్టి" అనే దద్దూ ప్రత్యేక తెరస్సులోను, బాగంటి వెంకటయ్య, మల్లయ్య

గారలు మునీర్ హెస్కూల్ లోను మిగతా వారంత ఆంధ్ర భాషాభి వర్ధినీలో ౫వ తరగతి చదువుచున్న రోజులు.

వీరితో పాటు 1946 లో శ్రీ కొత్త నారాయణ రెడ్డి, కొత్త ముకుందారెడ్డి, కొత్త రాంరెడ్డి గారలు కూడ చదువు కొంటున్నారు. వీరంతా బహుశా 'మున్షీ' అనే ప్రత్యేక కోర్సులోనే యుండి యుండవచ్చును. అందువల్లనే పేర్వారం నరహరిగారికి వీరికి బాగా స్నేహం ఏర్పడింది. విశేషమేమంటే ఈ ఆంధ్ర భాషాభివర్ధినికి మా గ్రామానికి ఎంతో సన్నిహిత సంబంధం ఉంది. దాని పురోభివృద్ధికి మా గ్రామ పెద్దలు కూడ భూరి విరాళాలు అందజేశారు.

పురా గర్వకారణం ఏమంటే 1946 లో ప్రాథమిక పాఠశాల నుండి మాధ్యమిక పాఠశాలగా ఎదిగి ప్రారంభోత్స వం జరుపుకుంటున్న శుభసమయంలో మా గ్రామ నివాసి యైన శ్రీ బాదూరి వెంకటేశ్వరస్వామిగారు ప్రధానోపాధ్యాయు డుగా యుండటం మా గ్రామాని కెంతోగర్వకారణం.

మాధ్యమిక పాఠశాల ప్రారంభోత్సవం చేయుటానికి నిజాం విద్యాశాఖ డైరెక్టర్ గారైన "ఆలీ జనాబ్ యస్. అక్బర్ సాహెబ్ ఎం. ఎ (డి. పి. ఐ.) రావడం నిజంగా ఓ ప్రత్యేకతే. "(01-8-1946 పార్థివ నామ సంవత్సర మాఘ బ॥౧౩ శుక్ర వారం)" అని ఆనాడు మాతండ్రిగారికి మరికొంధరి పెద్దలకు శ్రీ పెద్ది నారాయణ కార్యదర్శి గారు ఆహ్వానం పంపారు.

అంతే కాదు తేది 2 అక్టోబర్ 1946 గాంధీ జయంతి రోజున జనగామలో వైశ్య ధర్మశాలలో శ్రీ దాగి నర్సింహులుగారి అధ్యక్షతన జరిగే సభకు తమ తమ రాట్నములను తీసుకొని రావలసిందిగా కోరటము, ఈ ఆహ్వాన పత్రాలు మా తండ్రి గారు ఎంతో జాగ్రత్తగా భద్ర పరచుకోవడం అవి నాకు లభించ డం నేనెంతో ఉప్పొంగి పోయాను.

ఇక 1946 చివరి నాటికి రజాకార్ల మతోన్మాదం దిన దినము పెరుగుచున్నది. 1947 ప్రారంభములో హిందూ ముస్లిం అన్న భేదభావం పెరిగి పెద్దదయింది. అందుకే జన గామలో ఉన్న నా మిత్రులు చదువుకు సలాంలు కొట్టి ఇంటి కొచ్చేశాము.

అప్పటికే గానుగుపహాడ్ నారాయణరెడ్డి గారు ఉపాధ్యా య వృత్తిని విడిచి గెరిల్లా దళంలో చేరి చేర్యాల ప్రాంత గ్రామాన్ని సమాయత్త పరుస్తున్నారు.

చీటకొడూరు పేర్వారం నరహరి గారి మిత్రులు ఆంధ్ర మహాసభ కమ్యూనిస్టు పార్టీ నాయకులగు కా॥ సుబ్బారావు గారి నాయకత్వంలో నారాయణరెడ్డి, ముకుందారెడ్డి, రాంరెడ్డి, వడ్ల కొండ నరహరి మొదలగువారు దళాలలో చేరి నర్మెట, జన గామ, ఉత్తర ప్రాంతం చూస్తున్నట్లున్నది.

అందుకే మన గ్రామంలో శ్రీ పేర్వారం నరహరి, శ్రీ మంగు యాదయ్యల పరిచయంతో వీరిని గెరిల్లా దళంలకు రావలసినదిగా కోరినట్లున్నది. అందుకే వీరిద్దరు మరికొందరు యువకులతో నరహరిగారి ఇంట్లోనే రాత్రులందు రహస్యంగా చర్చలు ప్రారంభించారు. వీరి రహస్య చర్చలు జరుగుచున్న

దోటికి నన్ను ససేమిరా రానివ్వకపోవటంతో నాకు మరింత పట్టుదల పెరిగింది.

ఇట్లా ప్రతిరోజు రాత్రి వీరు కూడటము, మాట్లాడుకోవటము ప్రత్యేక శ్రద్ధతో చివరకు ధైర్యంచేసి ఇంట్లోకి ప్రవేశించాను. (ఆ ఇల్లు ఎక్కడో కాదు నా ఇంటికి కాస్త ప్రక్కకు ఎదురుగానే ఉంది.)

శ్రీ పేర్వారం నరహరిగారు నా వైపు కోపంగా చూస్తు అరె నువ్వెందుకొచ్చావురా అన్నాడు. అదేరా నేనెందుకు రాకూడదురా (మేమంతా లంగోటి మిత్రులము గనుక అరె అనే పదాన్ని సహజంగా వాడుకుంటాము) మీరేనారా మొనగాళ్ళు, మీరు చేసే పనులు నేనే చెయ్యలేనారా? అంటూ అట్లాగే నిలబడి ఇక నా ప్రతాపం చెప్పుకపోసాగాను.

మీరేం చేస్తార్రా? నేను మా బడిలో అందరికన్నా ధైర్యం చేసి ఘట్టిగంట కొట్టాను. హనుమకొండలో రాత్రులందు తురకోళ్ళ ఇండ్లపై జండా ఎగురవేశాను. మహాత్మాగాంధీని 10,20 గజాల దగ్గరికి వెళ్ళి చూశాను. చివరకు పోలీసులుండగానే సభ జరుపుకొని లాఠీ దెబ్బలు తిని వచ్చాను తెలుసా అంటూ ఏకరువు పెట్టాను. నా డిగ్రీలు, నేను చేసిన ఘనకార్యాలను సగౌరవంగా చెప్పాను.

ఇదంతా విని పోరా పో నీవు నీ ఖాతాలు, చివరకు తన్నులు తినే గదరా వచ్చావు అంటూ హేళన చేశాడు. అయినా వారి గుసగుసల రహస్యం చెప్పనే లేదు నాకు. రాత్రి తః దర్చ జరిగింది.

తెల్లవారింది. అప్పటికే దళంలో చేరిన మసి మల్లయ్య

గారు ఒక నిలువు కత్తిని (తల్వార్) భుజాన వేసుకొని శ్రీ పేర్వారం నరహరిగారి ఇంటి ముందు ప్రత్యక్షమైనాడు. అప్పుడు నేను నరహరిగారింట్లోనే ఉన్నాను. శ్రీ ముకుందారెడ్డిగారు వ్రాసిన ఉత్తరం ఇదిగో అంటూ తీసి చేతికిచ్చాడు.

## ఉత్తరం సారాంశము

మేము, మీతోపాటు మరికొందరు మిత్రులతో వస్తామని చెప్పిన తేదీనాడు చాలావరకు ఎదిరి చూశాము మీరు రాలేదు. ఇప్పటికే మీరు సిద్ధంగా వుండవచ్చును గాన ఈ క్రామేడ్‌తో వస్తే మేము కలువగలము. మీరు వస్తున్నారని ఎదిరి చూస్తూ అంటూ వుంది లేఖ.

ఈ విషయం మా వాడకంతటికి తెలిసింది. ఇక వారి కుటుంబాల వారు ఏడుపులు, అరుపులు, బ్రతిమిలాటలు ఆరంభ మైనవి. మసిమల్లయ్యను బ్రతిమిలాడసాగారు.

అది కాదమ్మా నే చెప్పేది వినమ్మా. నేనేమి బలవంత ముగ తీసుకపోవటానికి రాలేదమ్మా - వీరే వస్తామని చెప్పారట. మరి వారు రాలేదెందుకోనని తోలించారే తప్ప బలవంతమేమి లేదంటూ వెళ్ళిపోయాడు.

ఈ ఘటన నా మనస్సులో ఒక మెరుపులా మెరిసింది. అంతకు ముందు గ్రామంలో జరిగిన సంఘటనలు నన్ను మరింత ఉత్సాహపరచినవి. కాని మరో విచారం మొదలైంది. తీరా నేను వెళ్ళితే రానిస్తారో లేదో కుర్రోదని, ఏమిటి చెయ్యటం అన్న ఆలోచనలతో మునిగి తేలుచున్నాను.

## గృహ దహనాలు - హత్యలు

ఒక వైపున రజాకార్లు పోలీసుల అండతో ప్రతి రోజు

ఏదో ఒక ఊరిమీద పడి ఇండ్లు తగలబెట్టటమో, లూటీలు, మానభంగాలు, అమాయకుల కాల్చివేతలు సర్వ సాధారణమై పోయింది. చీటకోడూరు, హన్మంతాపురం మొదలగు గ్రామాలు బూడిద పెంటలుగా మారిపోయినవి. "సంఘపోళ్ళు" - గెరిల్లా దళాలు అక్కడికక్కడ మెరుపుదాడులు చేసి రజాకార్లను మట్టు పెడుతూనే ఉన్నారు. ఇవన్నీ కథలు కథలుగా చెప్పుకోవటము గ్రామాన ప్రజలకు నిత్యకృత్యమైంది.

## గ్రామానికి మొదటి గెరిల్లా దళ ప్రవేశము

శతాబ్దాల తరబడి రాజరికపు ఉక్కు పాదాల క్రింద అణగి మణగి చితికి జీవచ్ఛవంలా పడియున్న పల్లె ప్రజలకు నిస్సహాయ స్థితిలో గమ్యం దొరకక ఎదిరి చూస్తున్న యువకు లకు ఆశాకిరణంలా ప్రప్రథమంగా కామ్రేడ్ సి. యాదగిరిరావు, నల్లా నర్సింహులు, నాయకత్వంలో సుమారు 30 మందితో ఉన్న గెరిల్లా దళం తుపాకులు, కత్తులు కటారులు ఇతర మారణాయుధాలతో గ్రామంలో ప్రవేశించి,

"తెలుగు తల్లి బిడ్డలం - తెలంగాణ వీరులం
మాతృదేశ ముక్తికొరకు - పోరు సల్ప కదిలినాం"

అని కదం త్రొక్కి పదం పాడుతూ, ఊరేగింపు సాగింది. ఆ వింత, ఆ కొత్తదనాన్ని చూచిన జనమంతా వారి వెనకాలే వారిలో కలుస్తూ ఆ పాటనే అందుకొని నడిచింది. గ్రామ నలుమూలలు సాగిన ఊరేగింపు, బావడి వద్ద బహిరంగ సభగా మారింది. నిజాం పాతకాలపు నరక కూపమైన పోలీసు థానామీద ఎర్ర జెండా నెగురవేశారు, అది ఆకాశంలో స్వేచ్ఛ గా రెపరెపలాడుచున్నది.

ఆ ఇద్దరు నాయకులు ఉపన్యాసాలిచ్చారు. నిజాం నవాబును గద్దె దింపి జమీందారీ, జాగీరుదారీ విధానాన్ని రద్దు పరచి, వెట్టివాకిరి రూపుమాపి, దున్నేవానికే భూమినిచ్చి, విశాలాంధ్రలో ప్రజారాజ్యం స్థాపించేవరకు ఈ పోరాటం ఆగదని, అందుకు యువతీ యువకులు ముందుకు రావాలని, తమ గ్రామాలను తామే రక్షించుకొనుటకు పూనుకోవాలని ఉద్బోధించారు.

ఆ వెంటనే వడేలు పట్వారీల దఫ్తరాలను (రికార్డులను) షాహుకార్ల ఖాతా పుస్తకాలను, అప్పు పత్రాలను, చావడి ముందు పడవేసి అందరి సమక్షములో తగులబెట్టారు. ఇక ముందు సర్కారీ రకంగాని, కౌల్లుగాని, కౌరలకు మరే విధమైన చెల్లింపులుగాని వుండరాదు. కల్లు గీయుగూడదని హెచ్చరించి మరో గ్రామానికి బయలుదేరింది గెరిల్లా దళం.

ఈ దృశ్యాన్ని కళ్ళారా గాంచిన యువతీ యువకులకు అవధుల్లేని ఆనందం గట్లు త్రెంచుకొని పొంగి పొరలింది ఉత్సాహం।

## పోరాటానికి సన్నాహాలు

గెరిల్లా దళ నాయకులు ఇచ్చిన సలహాలు, ఆదేశాల ప్రకారము అన్ని కులాల పెద్దలు, గ్రామ పెద్దలు ఏకమయ్యారు. రజాకార్ మూకలతో పోరాడటానికి, గ్రామాన్ని రక్షించుకోవటానికి యువకులను సమీకరించారు. ఆ యువకులు తుపాకి, పత్తి, లాఠీ, వడిశెల, మొదలగునవి ఉపయోగించటానికి తర్ఫీదు పొందుచున్నారు. కావల్సిన మందుగుండు సామగ్రి శ్రీ పేర్వారం సంతాజీగారి ద్వారా రహస్యంగా మా తండ్రి గారైన శ్రీ పెర్మాండ్ల రామయ్యగారికి అందేవి. తర్వాత ఆ అందిన ముడి

సరుకును కమ్మరి వెంకట పాపయ్యగారి ఆధ్వర్యములో తయ్యారు చేసేవారు. అట్లాగె బరిసెలు, బల్లాలు, వడిశెలలు అల్లటం, తుపాకి గొట్టాలతో సహా శరవేగంగా మారణాయుధాల ఉత్పత్తి ప్రారంభమైంది.

స్త్రీలు మీకన్న తెనిపోము లెమ్మని రజాకార్ల తమపై అత్యాచారాలకు ఒడిగితె కారపు పొళ్లు ఎప్పుడు ఎలా ఉపయోగించి తమ మాన ప్రాణాలను రక్షించుకొనుటకు తమలో తాము చర్చించుకోవటము, ఆ దుష్కృరులకు ఒంటరిగా దొరుకకూడదని అందుకే ఎటు వెళ్ళినా కారపు పొడుల మూటలు దగ్గరుంచుకొని మనలటం జరుగుచున్నది.

గ్రామ రక్షణ దళం ఏర్పడింది. ఇందుకో శ్రీ గొల్లపల్లి రామమల్లయ్య ప్రధాన కావలాదారుగాను, శ్రీ గుజ్జుల వీరయ్య గారు పోరాట దళాల ప్రధాన బాధ్యతుగా నియమించి, వీరిద్దరికి గ్రామం ఉమ్మడిగా నెలవారీ జీతం చెల్లించుటకు నిర్ణయించారు.

అంతకు ముందు కల్లాకపటం తెలియని ఈ జనం, నీ బాంచెను దొర, నీ కాళ్ళు మొక్కుత దొర, సన్నొదులు దొర అంటూ భార్యా పిల్లలతో సహా దీనాతి దీనంగా ఎంత విలపించినా, వినని కర్కోటకులకు ఈజనమే కొదమ సింగాలై సింహ గర్జనలు వినిపించుటకు సిద్ధమైయున్నారు.

## రజాకార్ల తొలి ప్రవేశం - యువతుల విజృంభణ

(సరిగా తేదీ జ్ఞాపకము లేదు, అది 1947 నవంబరు ఆఖరు వారమో లేక డిసెంబరు మొదటి వారమో అనుకుంటాను)

అది కటిక చీకటి కాళరాత్రి. గ్రామమంతా గాఢమైన నిదురలో మునిగి ఉంది. మిన్ను విరిగి మీద పడినా, ప్రళయం

సంభవించినా ఆ నిశీథంతో హాహా కారాలు తప్ప, మరేమి చెయ్యలేని పరిస్థితిలో సర్వం నీట ముంచినా, పాలముంచినా గ్రామ రక్షణ దళం బాధ్యతేనంటూ హాయిగా నిదురిస్తుంది ప్రజ.

కంటికి రెప్పలా కాస్తున్న దళాలు తప్ప మరెవ్వరూ మెలకువగా లేరు. మొదటి దళం తూర్పు దిశ రావిచెట్టు వద్ద, రెండవది దక్షిణం బడి వద్ద, మూడవది కటిక బండల వద్ద, నాల్గవది ఉత్తరం నక్కోని కాల్వవద్ద. ఈ నాల్గు దిశల కాపలా కాస్తున్న స్థలాలలో మంచెలు, ఆ మంచెలపై పంతుల వారిగా యువకులు ఇద్దరేసి చొప్పున మంచెలపై నిలబడి, కండ్లను కాగడాలుగా చేసుకొని ప్రతి అంగుళం భూమిని నిశితంగా పరిశీలిస్తూ ఆ కటిక చీకటిలో ఎటువంటి చపలికనైనా ఇట్టే పసిగట్టి అట్టే హెచ్చరిక చెయ్యటానికి సంసిద్ధమై పహారా కాస్తుండె క్రింద ... ...

అది అసలే చలికాలం, పళ్ళు పంతరలు తిరిగే ఈదురు గాలులు, ఎంతటి యువకుడైనా ఆ చలిని తట్టుకొని ఎంతసేపు ఉండగలడు. అందుకని మంచె క్రింద చలి మంటల నెగళ్ళు నెగలు గ్రక్కుతుంటె ఆ యువకులు తమ ఆయుధాలను భుజాన తగిలించుకొని, వడిశెలలు నడుముకు బిగించుకొని, ఆ నెగళ్ల చుట్టూ కూర్చుండి, తమ చేతులను ధగధగ మండే మంటల వైపు చాచి చలి కాగుతున్నారు. కాదు తమ చేతులు చాచి అగ్ని ముందు ప్రమాణం చేస్తున్నారు.

ఏమని, ఏ సాక్షిగా, తరతరాల నుండి వస్తున్న బానిసత్వం నుండి, వెట్టి చాకిరి నుండి, విముక్తి కొరకు, దున్నే వానికె భూమి కోసం, భుక్తి కోసం, స్వేచ్ఛ కోసం, స్వతం

త్రం కోసం, నిజాం రాజరిక నిర్మూలన, జాగీర్దారీ, జమీందారీ రద్దు కోసం, మా గొంతులో ప్రాణాలున్నంత వరకు పోరాడ గలమని శపథం తీసుకొంటున్నారేమో అనిపించింది. పాపం ఈ నెగళ్ళలో, ఈ మంటల్లో ఈ మహా యజ్ఞంలో ఇంటులోని యువ కులు ఎందుకు ఆహుతైపోతారో ఎవరికేమి తెలుసు, భవిష్యత్తు గురించి?

ఇక ఐదవది అతి ముఖ్యము, కీలకము అయిన చరిత్ర ప్రసిద్ధి గాంచిన సర్వాయి పాపడు నిర్మించిన కోటలోని మధ్య బురుజుపై యుంది కాపలా.

మూడు వేల అమాయక ప్రాణులను రక్షించటమో, లేక భక్షించటమో నిర్ణయించేది ఒకే ఒక వ్యక్తి. ఆ వ్యక్తి కాస్త కునికిపాటు తీసినా, లేక అజాగ్రత వహించినా, ఎన్ని గృహ దహనాలు, ఎన్ని లూటీలు, మరెన్ని మానభంగాలు, ఎన్ని ప్రాణాలు గాలిలో కలిసిపోయేవో. అందుకే అన్నిటికి తనకు తానే సాటిగా నిలిచిన ఆ మహావీరుడు అదే గౌడ కులానికి చెందిన రాంమల్లయ్య ఆ కోట బురుజుపై ఒంటరిగా నిలబడి, ఏ మాత్రం తొనకకుండా నిశ్చలంగా, నిర్భయంగా, నలుదిశల తన కళ్ళల్లో కోటి సూర్యకాంతులను ఇముడ్చుకొని నలుదిశల విరజిమ్ముచు కొన్ని మైళ్ళ దూరం దృష్టిని సారించి పహరా యిస్తున్నాడు.

మంచి నిదురపాటున హైద్రాబాద్ నుండి హన్మకొండకు వెళ్ళే రోడ్డుపై శరవేగంగా దూసుక వస్తున్నది లారీ. అది గమ నించాడు కాపలావీరుడు. ఆ లారీ రఘునాథపల్లి ఉత్తర ఓళ నుండి పడమటి వైపు తిరిగి వెలుతురు ప్రసరింపించిందో లేదో,

అంతే మరుక్షణంలో కోట పైనుండి యుద్ధ నగారా మ్రోగింది, హెచ్చరికగా. అర్జునుడు పాంచజన్యాన్ని పూరించినట్టుగా తన కంచుకంఠంతో కొండ కేకలేచాడు. ఇంకేముంది క్రింద నలు వైపుల పహరా యిస్తున్న దళాలు గ్రామమంతా ప్రతిధ్వనింప చేశారు డప్పుల చప్పుడు.

అమాయకంగా నిదురిస్తున్న జనం అదురుపాటున లేచింది. అదును కొరకు నిరీక్షిస్తున్న యువ వీరులు లేచారు. ఉత్సాహం, ఉద్రేకం, పొంగి పొరలింది వారిలో. తమ వీర త్వాన్ని, నైపుణ్యాన్ని ప్రదర్శించే ఘటనమయం రానే వచ్చిం దని కర్రలు, కత్తులు, వడిశెలలు ధరించి తరలి వెళ్ళింది యుద్ధ భూమికి, అదే రావి చెట్టు వద్దకు.

తుపాకుల దళం నడిమి బావి వద్ద మాటేసి కూర్చు న్నది. చూస్తుండగానే వందలు వేలు పోగయ్యారు. పిల్లలు మేము అందివ్వందె యుద్ధమెట్లా చేస్తారంటూ చేరుకున్నారు యుద్ధ రంగానికి (వడిశెల దళానికి రాళ్ళు, నిప్పుకణికలు, అందివ్వ టము వీరి వంతు). రాళ్ళ దళం, నిప్పుల దళం మూడు భాగా లుగా చీలి, ఉత్తర దక్షిణ, పడమర ఎదురుగా చీలి నిలుచు చున్నది. కర్రలు, కత్తులు, బరిశెల దళాలు మూడవ దాన్ని కొరకు ఎదిరి చూస్తున్నది. వెనుక తట్టున ఉన్న పెద్దలు సైన్యాధిపతులవలె ధైర్యం ఉత్సాహాన్నిస్తూ సమయం కోసం వేచి చూస్తున్నారు. గుట్టల వీరయ్య క్షణక్షణానికి ప్రతి విభా గంలోకి వెళ్ళి నేనున్నా ఫర్వాలేదన్నట్లుగా కనిపిస్తున్నాడు. లారీ సమీపిస్తున్న కొద్ది యువకుల ఓపిక హద్దులు దాటుతున్నది.

గఫూర్ ఖాన్ నాయకత్వాన రజాకార్ల లారీ వెంకటేశ్వర్ల

నుంటపడ్డ దారికి అడ్డంగా తీసిన గొయ్యివద్ద ఆగింది. లారీ లైట్ల వెలుగుచో దట్టమైన ఆ పొదుగులలో అతికష్టంమీద మెలికలు తిరిగి అంబడిపుంటు గౌరవారి పటపుల కొట్టం దాటి సాగరంలోకి ప్రవేశించిందో లేదో సైన్యాధిపతుల ఆజ్ఞలు వెళ్ళివెళ్ళకముందే వందలు వేలు వడిశెల దళాలు అగ్ని గోళాలను లారీలోకి కుమ్మరిస్తున్నవి. రాళ్ళదళం ఏకధాటిగా వడిశెలలతో విసురుతున్నవి మూడు వైపుల నుండి. మాకూ తుపాకులున్నవి సుమా అంటూ హెచ్చరికగా ఒక దెబ్బాయి ప్రేలింది, భూనభోంతరాలు దద్దరిల్లే విధంగా - ప్రజల భీకర నినాదాలు ఆ ప్రదేశమంతా ప్రతిధ్వనిస్తున్నవి.

ఇక గ్రామంలో యువతులు తమ ధన, మాన, ప్రాణ రక్షణ కొరకు, ఒక్కొక్క యువతి ఒక కాళికాదేవి, రుద్రమాంబలు, ఝాన్సీలుగా వీధి కూడలి మధ్య చేరారు. నడుమున కొంగు బిగించికట్టి కొందరు కారప్పొడులు, మరి కొందరు రాళ్ళు, ఇంకొందరు రోకలిబండలు ధరించి గుంపులు, గుంపులుగా ఆ ముష్కరులను ఎదిరించుటకు చివరి తెగింపు సాహసంతో ఎదిరి చూస్తున్నారు.

ఆ క్షణంలో వారికి ఏ యువకుడైనా కనిపిస్తే నాల్గు చివాట్లే కాదు, సవాలక్షంగా దీవించి, హేళన చేస్తూ తూర్పున జరుగుచున్న రణరంగానికి రోషంతో వచ్చి చేరే విధంగా హెచ్చరిస్తున్నారు, ఆ యువ వీర నారీమణులు.

ఇక లారీ ముందుకు సాగలేదు. తల లేపి చూస్తామా ఈ చింత నసుకుంటె లేచిన తల లేచినట్లే పగిలేటట్లున్నది. ఇటు రాళ్ళ దెబ్బలు, అటు నిప్పు కణికలు వర్షంలా వచ్చి పడు

చుస్నవి. లారీలో వున్న రజాకార్లపైన పడికాలుతుంటె హాహా కారాలు బయలుదేరినవి. తుపాకులు ప్రేల్చి కాల్చుదామన్నా ఆ కటిక చీకటిలో ఎటువైపు కాల్చుదామన్నా అంతుపట్టనట్లున్నది. అందుకె "యా అల్లా—యా ఖుదా, బచావో హమె" అంటూ లారీ వెనక్కి త్రిప్పి బ్రతుకు జీవుదా యని పరారయ్యారు వచ్చిన దారినె—

విశేషమేమంటె ఈ రణరంగంలో అన్ని తరగతుల వారు అన్ని కులాలవారు ఒకే తల్లి పిల్లలవలె ఐక్యమై ఆత్మ రక్షణకు, గ్రామరక్షణకు అంకితమైనారు. ఉదాహరణకు శ్రీ చొల్లేటి లక్ష్మయ్య సిద్ధాంతిలాంటివారు, వేద గ్రంథాలను బట్టె ఆ చేతుల్లో నాడు ఆయుధం (బల్లెం) చేత ధరించి ఆత్మరక్షణకు పూనుకున్నాడంటె రజాకార్లు ఎంతటి ఘాతుకాలకు ఒడిగట్టారో తెలుపుతుంది ఈ సంఘటన.

## తెల్లవారింది - తిరిగి వొచ్చింది లారీ

మధ్య రాత్రి మంచి నిదురపాటున జరిగిన సంఘటన గ్రామ ప్రజలు తమ తమ ఇండ్లకు చేరి విజయోత్సవ వేడుకలుగా చెప్పుకొంటూ నిదురించారో లేదో తెల్లవారింది. రాత్రంతా నిదురలేక యువకులు కాస్త అలసట చెందినట్లుగానే యున్నారు. అయినా తమ విధులను మాత్రం మరువలేదు. యదావిధిగా కావలా ఉండే వుంది.

స్త్రీలు లేచి తమ తమ పనులు చూచుకొంటున్నారు సరిగ్గా ఉదయం 7-8 గంటల మధ్యే వచ్చేస్తున్నది రజాకార్ల లారీ, కాని యిప్పుడు యుద్ధానికి కాదు, సంధికన్నట్లుగా వచ్చింది. రాత్రి విజయం సాధించిన గ్రామ ప్రజలు మరెంత

రెట్టింపు ఉత్సాహంతో అదే రావి చెట్టు వద్ద క్షణాలలో ప్రోగ య్యారు.

లారీ సాగరంలో ఆగింది. అందులో నుండి రజాకార్ నాయకుడు గఫూర్‌ఖాన్ చేతులు పైకెత్తి చూపి లారీ దిగి తన వెంట ఒక అంగరక్షకుడిని తీసుకొని తిరిగి చేతులు పైకెత్తి మెల్లగా ముందుకు నడుస్తూ "హమ్ నహీ మారేంగె అప్ లోగోంకో, - తుమారేమె కోయి బడె ఆద్మీతో మేరే పాస్ ఆవ్‌లో, వున్‌సే హం బాత్ కరేంగె" అన్న శబ్దాలు వినగానే జనంలో కలవరం బయలుదేరింది. ఎవరు వెళ్లాలని, తర్వాత ఎవరెందుకు నేనే వెళ్తానని అంటూ ముందుకొచ్చారు గ్రామ పోలీస్ పటేలు గారైన శ్రీ పేర్వారం సంతాజీగారు. మరొకరి మాట వినకుండానే, అదే మోస్తరుగా చేతులు పైకి ఎత్తి గఫూర్‌ఖాన్‌కు ఎదురుగా ముందుకు నడుస్తున్నాడు. క్షణంలో శ్రీ గుజ్జుల పేరయ్య ముందుకొచ్చి, వాడితో వాడి వెనకాలే మరొకడు వస్తున్నాడు ఆయుధం చేత ధరించి; అందువల్ల నేనూ నీ వెంట వస్తానంటూ భుజాన ఉన్న తుపాకిని తీసి పేల్చటానికి సిద్ధంగా ఉండే విధంగా పట్టుకొని ఆ సంతాజీ వెనకాలే నీ ప్రాణంతోపాటు నా ప్రాణమంటూ ఆ వెనకాలే నడిచాడు. ఉభయ పెద్దలు ఒకరికెదురు మరొకరు సమీపిస్తున్న కొద్ది జనం శ్వాసను సహితం పీల్చకుండ, నిశ్శబ్దంగా కండ్లప్పగించి చూస్తున్నారు ఏమి జరుగుతుందోనని.

## వారి సంభాషణ సారాంశం

గఫూర్‌ఖాన్ వాదన ఏమిటంటె 1) మీ గ్రామాన్ని ఏ మాత్రం ముట్టుకోము. 2) మీ జనానికిగాని, మీ గృహాలకుగాని

ఏ మాత్రం మరే విధంగాగాని చెరుపు హాని చెయ్యం. మేము కోరేది మీ గ్రామం నుండి అవతలి గ్రామాలకు వచ్చి పోయేందుకు దారివ్వమని వారు కోరటం జరిగింది.

దానికి శ్రీ సంతాజీగారి సమాధానం : ఎట్టి పరిస్థితిలో గూడ మా గ్రామం మీదుగా మీకు దారి యివ్వబోము. మా గ్రామం పై నుండి వెళ్ళి అవతలి గ్రామాలలో నానా బీభత్సం చేసి చివరకు కొంపలు గాల్చి మానభంగాలు, హత్యలు చేసి వస్తారు. అందుకు మేమెంత మాత్రము అంగీకరించబోము, అని నిర్మొహమాటంగా చెప్పి, ఇక మీరేమి చెప్పినా అసలు వినే సమస్యే లేదని వెనుదిరిగి వచ్చి జనంతో కలిశాడు.

వీరిట్లు తిరిగి గుంపులో చేరే అంత వరకు గ్రామం యేమవుతుందో, ఇంకేం ప్రళయం ముంచుకొస్తుందో అన్న బెంగలో వున్న జనం ఈ విషయం చెప్పగానే హమ్మయ్యా అంటూ బిగబట్టిన శ్వాసను వదిలినారు.

ఇక వారు చేసేది లేక వెనుదిరిగి పరాభవాన్ని, మ్రింగ లేక, కక్కలేక, చచ్చిబ్రతికిన విధంగా కుములుతు వెడలి పోయారు.

ఈ గ్రామంమీద గఫూర్‌ఖాన్ దెబ్బతిన్న త్రాచులా బుసలు కొడుతున్నాడు. అవును మరి చర్చలు విఫలమైతే సమరమే శరణ్యం. ఈ చర్చలు ఈ ఒక్క ఊరికి సంబంధించినవా? కాదు, ఈ సమరం నవసమాజ నిర్మాణానికి సాగుచున్నది. ఇదెందు కాగుతుంది?

## గ్రామంలో జిల్లా రిజర్వు పోలీసు దళ ప్రవేశం

వారం రోజులు తిరక్కముందే నల్లగొండ జిల్లా పోలీసు

మొహత్‌షీనుగారు (S. P.) రెండు లారీల నిండా తమ పోలీసు బలగాలను పెద్ద ఎత్తున తీసుకొని మిట్ట మధ్యాహ్నం గ్రామానికి చేరుకొన్నారు. అదే రావిచెట్టు వద్ద లారీ లాగినవి. ఇది వరకటి మాదిరిగా ఊరి జనం ముందుకు రాలేకపోయింది. వీరు అత్యంత అధునాతన ఆయుధాలతో దిగినారు. ఇందులో ఒక్క రజాకార్ గూడ లేడు. జనాన్ని దూరంగానే చెదిరి పోమ్మన్నారు. జనం దూరంగా ఉంది.

ఆ పోలీసు అధికారి తన క్రింది పోలీసును పంపి సేథీ సిందీలను పిలిపించుకొన్నారు. వారితో గ్రామాధికారులను వెంటనే తీసుకరమ్మని ఆజ్ఞాపించారు. వారు వెళ్ళి వెంట తీసుకొచ్చారు.

ఈ ముగ్గురు గ్రామాధికారులు : శ్రీ మంగు యాదయ్యగారు (పట్వారి) శ్రీ శ్రీభాష్యం కృష్ణమాచారి (మాలి పటేలు) శ్రీ పేర్వారం సంతాజీగారు (పోలీసు పటేలు).

ఈ ముగ్గురు రాగానే వరుసలో నిలబెట్టించాడు. తన వద్దనున్న ఆయుధాన్ని వారికి చూపిస్తూ హెచ్చరించాడు. "హోగయా, హోగయా (జరిగిందేదో జరిగింది) అబ్ సే వో సంఘంవాలే గాంవ్ మె ఆయేతో పకడ్ లేనా, నహీతో తుమ్ తీనోంకో గోలిసే ఉడాదేయింగె ఖబర్దార్ (ఈ రోజు నుండి సంఘపోళ్ళు ఊళ్ళోకి వస్తే పట్టుకోవాలి, లేకపోతే మీ ముగ్గురిని కాల్చి పారెయ్యగలం) అని హెచ్చరించారు. ఇందులో పట్వారిగారైన శ్రీ మంగు యాదయ్యగారు హమారేసే కైసే హోసక్తా సాబ్ అన్నారు (మాతో ఎట్లా సాధ్యమవుతుంది అయ్యా) అంతే! చెంప ఛెళ్ళుమంది. ఇక సంతాజీగారు ముందే వసుయు స్ఫూర్తి

గలవారు. ఇది చూచాడు. జీ అచ్ఛా సాబ్ ఆప్‌కి హుకుమ్ హమ్ బరాబర్ అమల్ కరింగె సాబ్ అన్నాడు (మీ ఆజ్ఞను తప్పక పాటించగలము)

ఇక ఇంతటితో ఆ పోలీసు బలగం వెనుదిరిగి వెళ్ళింది.

## పలాయన మంత్రం పఠించిన గ్రామ పెత్తనదార్లు

ఇంగుతిన్న రజాకార్లు పరాభవాన్ని భరించే స్థితిలో లేరు. ఏ క్షణంలోనైనా ఈ ఊరు బుగ్గిపాలౌతుంది. ఇటు గెరిల్లా దళాలు రాకమానవు. అటు రజాకార్లు ఊరుకోరు. పైగా పోలీసు వెంట వస్తున్నారు. ఇది గ్రహించిన పెద్దలు, గ్రామాధికారులు, వనికులు, భూస్వాములు గ్రామాన్ని వదిలి పట్టణాలకు ఎగ బ్రాకారు. షాహుకార్లు మూటా ముల్లె సర్దుకొని కాందిశీకులుగా ఆంధ్ర ప్రాంతం తరలినారు. ప్రశాంతంతో హుషారు చేసిన కాంగ్రెస్ కార్యకర్తలు కంటికైనా కనిపించడంలేదు. ప్రజలను నట్టేట వదిలారు. ఇక మిగిలింది ప్రజల కష్టసుఖాలలో భాగం పంచుకొని జీవన్మరణ పోరాటం సాగిస్తున్నది కమ్యూనిస్టు - ఆంధ్ర మహాసభ కార్యకర్తలే.

## అరాజక శక్తుల స్వైర విహారం

ఇంత వరకు గ్రామ రక్షణ దళంలో యున్న కొందరు ముఖ్యంగా పాసుగంటి లింగబ్రహ్మం వీరి తమ్ముడు సిద్ధయ్య, కొండం రాములు, గంధమల్ల మల్లయ్య మరి కొందరు అదుపు లేని అరాచక శక్తులుగా మారినారు. వీరు గ్రామ ప్రజలనుండి బలవంతంగా డబ్బు, ధాన్యం, వసూలు చేసుకొని ప్రతినిత్యం తప్ప త్రాగి బెదిరించటం మొదలుపెట్టారు. వీరి రక్షణ ఏమో కాని భక్షణ ప్రారంభమైంది. వీరి వద్ద రెండు మూడు తుపా

కులు గూడ ఉండేవి. వీటిని గ్రామ రక్షణ కొరకు ఇవ్వటం జరిగింది. గ్రామస్తులకు వీరి బెడద చివరకు ప్రాణాంతకమైంది.

ఎట్టకేలకు గెరిల్లా దళానికి కబురు పంపగా వారు వచ్చేశారు. ఈ అరాచక శక్తులు బలపాలబోడు రంగనాయకుల గుడి వద్ద సాయంత్రం పూట తప్ప త్రాగి మైకంలో ఉన్న అదును కనిపెట్టి ఏమరుపాటున వారిపై బడి మొదట తుపాకులు లాగుకొని తర్వాత చితుకబాది ఇకముందు బుద్ధిగా మసులుకోకపోతే ప్రాణాలు దక్కవని హెచ్చరించి వెళ్ళింది.

గెరిల్లా దళంతో కుదుటబడింది గ్రామం.

## పోరాట స్వరూప స్వభావాలు మారినవి

అటు రజాకార్లు ఒంటరిగా గాక నిజాం పోలీసు మిల్టరీ సహాయం లేనిదే గ్రామాలలో అడుగిడటం అసంభవమైంది. అత్యంత ఆధునిక ఆయుధాలతో కదిలి గ్రామాలకు గ్రామాల్నే కాల్చి బూడిద పెంటలుగా మార్చుతున్నారు. కనబడ్డ వారిని పిట్టలవలె కాల్చిపారేస్తున్నారు. ఇటు ప్రజల వద్దనున్న నాటు తుపాకులు, బాకులు, బల్లాలు, సరితూగటం లేదు.

అందుకే ముఖాముఖి పోరాటాల స్థానే గెరిల్లా యుద్ధ తంత్రం ముందుకు వచ్చింది. దాని పర్యవసానమే మిల్టరీ దళమని, గెరిల్లా దళమని, విధ్వంసక దళాలని, సాధారణ దళాలని ఎత్తుగడలతో పోరాట స్వభావం మారింది. దారికాచి దెబ్బ తీసే విధానం, మెరుపు దాడులు వగైరా వగైరాలు వచ్చినవి. ఇక ప్రజలు ఆత్మరక్షణకు కాపలాదారు హెచ్చరించటంతోటె ఇల్లు - వాకిళ్ళు వదిలి గుట్టలు వాగులు వర్రెలు చెట్టు కొకరు పుట్ట కొకరుగా పరుగెత్తి తలదాచుకోవటం రజాకార్లు వెళ్ళగానే

తిరిగి ఇండ్లకు ప్రవేశించటం నిత్యకృత్యమైంది, కాదు అల వాటుగా మారింది. ఆడా, మగ, చిన్నా పెద్దా తేడాలేదు. అంతా హెచ్చరిక అందగానే పరుగు పందెంలో నెగ్గటానికి వెళ్ళినట్లు గానే ఉండేది ఆదృశ్యాలు

## గుజ్జుల వీరయ్యకు చిత్రహింసలు - పూసల ఓగులును కాల్చివేత.

మా గ్రామం ప్రక్కనే ఉన్న వెల్ది అనే గ్రామానికి నాడు పట్వారీగావున్న శ్రీ మంగు రాంచంద్రయ్యగారి పిలుపు మేరకు స్థానిక నివాసులు, ప్రభుత్వోద్యోగులు, శ్రీ ఎర్ర బాల కిష్టయ్య, శ్రీ పెర్మాండ్ల దాశరథి ఇంకా మరికొందరితోపాటు శ్రీ గుజ్జుల వీరయ్యగారు కూడ వెళ్ళటం జరిగింది వన మహోత్సవ విందుకు. ఈ విషయం సమీపంలోనేయున్న రఘునాథపల్లి రజాకార్ల క్యాంప్‌కు తెలిసింది. వెంటనే రజాకార్లు పెద్ద సంఖ్యతో బయలుదేరి ఆ వనాన్నంతా చుట్టేసి పట్టు కొన్నారు. తర్వాత వివరాలడిగి పేర్లు, వారు చేస్తున్న పనులు తెలుసుకొని ఈ వీరయ్యను, పూసల ఓగులు అనే స్థానిక వ్యక్తిని పట్టుకొని మిగతా వారందరిని విడిచి పెట్టారు. ఇక వీరిద్దరిని వెనుకకు విరిచికట్టి తమ క్యాంపుకు తీసుకవెళ్ళారు. ఆ రాత్రంతా చిత్రహింసలకు గురి చేశారు. తెల్లవారగానే జన గామలో ఉన్న కేంద్ర క్యాంపుకు తరలించినారు.

ఈ వీరన్న గ్రామదళ సభ్యుడుగావుండి గ్రామాన్ని రక్షించటములోనూ ప్రముఖపాత్రను వహిస్తున్నాడని, ఇతని కారణంగానే మనం గ్రామంలో అడుగు పెట్టలేక పోతున్నామని వారికి కక్ష ఉంది. ఇక వెల్ది పూసల ఓగులుకూడ గ్రామంలో

చురుకైన యువకుడు. సంఘం పేరుతో చెలామణి అవు తున్న వ్యక్తి.

ఈ వార్త మన గ్రామంలో సంచలనం రేపింది. అప్ప టికే గ్రామాన్ని వదిలి రఘునాథపల్లిలో తలదాచుకొంటున్న పెద్దలు గ్రామాధికారులు ముఖ్యంగా శ్రీ పేర్వారం సంతాజీ గారికి (పోలీసు పటేలు) మన గ్రామ స్థానిక ముస్లింలకు కల వరం ఉయలుదేరింది. ఇతన్ని చంపితే మన కొంపలు గ్రామంలో ప్రతీకారంగా బూడిద పాలగునని గుర్తించారు. నాటి ముస్లింలలో కూడ నిజాయితీ, మానవతా దృక్పథం కలిగినవారు లేకపోలేదు. ఆ కోవకు చెందినవారే జనగామ నివాసి డా॥ అజీజుల్లాగారు. శ్రీ పేర్వారం సంతాజీగారు ఎంతో శ్రమపడి ఏసయ్యను వదిలి పెట్టించారు. ఇక వూసల ఓగుల్ని మాత్రం బాంజీపేట గుట్టల మధ్యన తీసుకెళ్ళి కాల్చి చంపారు.

## గెరిల్లా దళాలలో గ్రామ యువకుల ప్రవేశం

గ్రామాల పరిస్థితి రోజురోజుకు, గంటగంటకు మారి పోతున్నది. ఉద్యమం తీవ్రరూపం ధరించింది. ఈ పోరాటా లతో నాకేమి పని ? అని అన్నవారు అసలు లేరనే చెప్పవచ్చు. ఎప్పుడు ఎవరు మరణిస్తారో, ఏం జరుగుతుందో ఊహకందని వేగాన్ని పుంజుకున్నవి పోరాటాలు. ఏ ఒక వ్యక్తిగాని, గ్రామం గాని, పోరాటానికి దూరంగా లేదంటే అతిశయోక్తికాదు. తెలంగాణా ప్రతి అడుగు నేల పోరాట రణరంగంగా మారింది.

ఈ పరిస్థితిలో ఏ యువకుడు మాకేంది అని చేతులు ముడుచుకొని కూర్చుండే వాతావరణమే లేదు. అందువల్లనే ఎందరో యువకులు మేమంటే మేమని చేరుచున్నారు దళాలలో.

ఇక శ్రీ గుజ్జుల పేరయ్య గ్రామంలో ఉండే పరిస్థితే లేకుండా పోయింది. అందువల్ల దళంలో చేరిపోయారు. ఇంతకు ముందే మని మల్లయ్య చేరినాడు. ఇంకా నాగ అగమల్లయ్య, నాగ నర్సయ్య, ఎల్దెండ నర్సింహులు, కోతి వెంకటయ్య, పెంతల బుచ్చిమల్లయ్య, మిసాల యాదగిరి, వాడికాల యాదగిరి, ముత్యాల మల్లయ్య, దూడల సాలమ్మ, గుజ్జుల నారాయణ, పిట్టల నారాయణ, ఆది నర్సయ్య, సుతారి మల్లయ్య, గుండె నారాయణ, బండి బాలయ్య, నీల భిక్షపతి, వీరంతా రెగ్యులర్ దళాలలోకి వెళ్లగా మరెందరో యువకులు గ్రామ కమిటీలలోను, గ్రామ రక్షణ దళాలలోను పనిచేసేవారు.

## దళంలో నా ప్రవేశం

నేను ముందే వివరించినట్లుగా, నా మిత్రులు దళాలలో ప్రవేశించుటకు చర్చలు జరపటము, కామ్రేడ్ మని మల్లయ్య లేఖ అందించటము, నా మిత్రుల కుటుంబీకులు దుఃఖించటముతో నా స్థైర్యం అస్థిరపడి వెనుకడుగు వేశారు. ఇక నాకు మరింత పట్టుదల పెరిగింది ఎలాగైనా గెరిల్లాలలో చేరాలని. గుజ్జుల పేరయ్య మొదలగువారు వారి భుజాన తుపాకులు వేసుకొని వచ్చి పోతున్నారు. ఒక రోజు పేరయ్యగారి దళం సాయంకాల సమయంలో వచ్చింది, వారిని చూడగానే నాలో ఉత్సాహం పొంగింది. ధైర్యం చేసుకొని దళం దగ్గరికి వెళ్ళి పేరయ్య గారిని అడిగాను నేను మీతో వస్తానని. అమ్మో మీ నాన్న నిన్ను రానిస్తాడా అన్నాడు. మా నాన్నకు ఎలా తెలుపుతే కదా నన్ను రానివ్వంది, అన్నాను. సరే మంచిదన్నాడు.

అంతే. ఇక వారితోటే అప్పుడే ఒంటిమీది బట్టలతోటే బయలుదేరా. దళం మంతెలగూడెం తాళ్లగుట్ట మీదుగా ఎల్ల గొల్ల పహాడ్ గ్రామానికి అవలనున్న టేకు వనంలోకి వెళ్ళింది. బహూషా రాత్రి 8-00 గంIIలు కావచ్చు. అంతకు ముందే అక్కడ కొత్త ముకుందారెడ్డి, కొత్త రాంరెడ్డిగారల దళా లున్నవి. ఈ మూడు దళాలు కలువగానే ఈ ముగ్గురు దళ కమాండర్లు సమాచారాలను సేకరించి తెచ్చిన కొరియర్లు, వేదే చోట మాకు కాస్తంత దూరంలోనే ఉన్న ఓ పెద్ద మనిషివద్దకు వెళ్లారు. ఏవేవో మాట్లాడుకొన్నారు ఓ అరగంట సేపు. తర్వాత మమ్మల్నందరినీ రమ్మన్నారు. అందరం వెళ్లాము. గుండ్రంగా వరుసగా కూర్చున్నాము.

తలకు పెద్ద రుమాలు, కండ్లకు మందంగా ఉన్న కళ్ళ జోడు పెట్టుకొన్న ఆ పెద్ద మనిషి అందరినీ పరీక్షించాడు. పరిచయం చేసుకొన్నాడు. ఆ వరుసలోనే నన్ను చూడగానే ఈ కుర్రో డెవరు ? ఇతన్నెందుకు తీసుక వచ్చారు ? అని కాస్త బెదిరింపుగానే అడిగాడు. ఎవరూ చప్పుడు చెయ్యలేదు. కాస్త అగి ఇతన్ని రేపు వారి తల్లిదండ్రులకు అప్పజెప్పిరాండి, అని ఆదేశ పూర్వకంగానే చెప్పినాడు. ఇది విని నాకు కోపం, ఏడుపు వచ్చినంత పనైంది.

ఆ వెంటనే నన్ను దగ్గరికి పిలిచి నువ్వెందుకు వచ్చావని అడగ్గానే మీరంతా వచ్చినట్లే నేనూ వచ్చాను. మీరంతాపోతే నేను పోతా. నేను వచ్చింది తిరిగిపోవటానికి కాదు, అన్నాను కాస్త ధైర్యంతో, ఆ పెద్దమనిషి ముందు. అట్లె పోవా? అన్నాడు. ఇంతలో ఊళ్ళోనుండి అన్నం వచ్చేసింది. తలా కాస్తతిన్నాం.

ఆటు తర్వాత ఎవరి ప్రాంతాలకు వారు బయలుదేరి వెళ్ళారు. ఆ పెద్ద మనిషితోపాటు మా దళం కూడ లేచి వెళ్ళి అడవి కేశవాపురం దగ్గరిలోనేయున్న అడవిలోకి వెళ్లి పడుకొన్నాము.

తెల్లవారింది, నన్ను మరింత దగ్గరికి పిలిచాడు. బాగా ఎగాదిగా చూచాడు. నీవు నీ ఇంటికి వెళ్లదలచలేదా ? నీ తల్లి దండ్రులు నీ కొరకు ఏడ్వరా ? అన్నాడు. ఏడుస్తారు కానేపు, తర్వాత ఊరుకుంటారు అన్నాను. నన్ను ఇంకా బాగా చూశాడు. ఆయన మనస్సులో ఏమనుకున్నాడో తెలియదు. తర్వాత సరే, ఈ అబ్బాయి విసుగుచెందితే వారి ఇంటికి చేర్చండని అన్నాడు. అంటే వారి దృష్టిలో నేను రెండు మూడు రోజులు తిరిగితే అలసట చెంది నేనే పోతానని ఊహించవచ్చు.

ఆ పెద్ద మనిషి ముందు అంత ధైర్యంగా నిలబడి జవాబిచ్చినందులకు మిగతా వారంతా ఆశ్చర్యపడ్డారు. తర్వాత నాతో చెప్పారు. ఆయన ఎవరనుకున్నావు ? మన తెలంగాణా అన్ని జిల్లాలకు పెద్ద నాయకుడు. నీవు వారితో అట్లా తెగించి మాట్లాడుతావా? మరికొందరు, వారెవరనుకున్నావు? కా॥ రాజా రాంగారు తెలుసా? అని. మరికొన్నాళ్ళకు తెలిసింది, వారు ఎవరో కాదు, కా॥ బద్దం ఎల్లారెడ్డిగారని.

ఆ విధంగా నాకు మొట్టమొదటి రోజే కా॥ బద్దం ఎల్లా రెడ్డిగారి పరిచయం కలుగటం నాకెంతో గర్వకారణమైంది. ఇక అటు తర్వాత ఎప్పుడు కూడ ఇంటికి వెళ్ళి పొమ్మనే మాట లేవనెత్తలేదు. నిజంగా వారు ఓపిక పట్టక నన్ను ఇంటికి పంపిస్తే నా చరిత్ర మరోవిధంగా ఉండేదో ఊహించలేక పోతున్నాను.

అందువల్ల గ్రామంలో పిల్లలు, ముదుసలులు మాత్రమే ఉంటారు. పైగా ఎప్పుడైతే ఒంటరిగా దొరుకగలడో ముందే సమాచారం ఉండి గనక అతి సునాయాసంగా ఆ రాక్షసుల చేతిలో చిక్కాడు.

అక్కడికక్కడే చేతులు వెనక్కి విరిచికట్టి అడుగడుగునా చిత్రహింసలు పెడుతూ లాక్కెళ్లారు. ఈ విషయం గ్రామమంతటికి హెచ్చరించి చెప్పే నాథుడే దొరకనప్పుడు ఇక చెప్పేదెవరు? హెచ్చరించేదెవరు? అందుకే ఊరివారికి తీసుకెళ్లిన తర్వాతనే తెలిసింది,

ఈ రాంమల్లయ్యను వెల్ది మీదుగా, రఘునాధపల్లినుండి ఖాంజీపేట వైపు తీసుకెళ్ళి చాలాసేపు నమాచారం రాబట్టుటకు చిత్రహింసలు పెట్టి చివరకు కాల్చి చంపి, కోలుకొంచ మీదుగా బాబుగాడి గుంపు వెళ్ళితే, గఫూర్‌ఖాన్ గుంపు రఘునాధపల్లి మీదుగా జనగామ చేరుకొంది.

ఆ మహావీరుడు గ్రామం కొరకు ఈ ప్రాంత ప్రజల శ్రేయస్సుకొరకు ఎన్ని చిత్రహింసలు పెట్టినా, చలించలేదు. శత్రువుకు లొంగలేదు. ఈ మహాసంగ్రామంలో తన ప్రాణాలను పణంగా పెట్టి అమరుడైనాడు.

ఎప్పుడైతే ఆ మహావీరుడు వెళ్లిపోయాడో అప్పుడే గ్రామం వెలవెల పోయింది. విషాదచ్ఛాయలు అలుముకొన్నవి. కన్నీరుమున్నీరుగా ఏడ్చింది పల్లెప్రజ. నిన్ను పట్టించిన నీచుల్ని నిన్ను వధించిన రాక్షసుల్ని వదలబోమని శపథం తీసుకొన్నది గ్రామ యువత.

## గఫూరుఖాన్ రాక్షసత్వం

మన ప్రాంతంలో గఫూర్‌ఖాన్ రజాకార్ రాక్షస గుంపుకు నాయకుడు. జనగామ నివాసి. ఇతడు చెయ్యని దుర్మార్గమంటూ లేదు. ప్రతిరోజు ఓ పెద్ద రజాకార్ పటాలాన్ని వెంటేసుకొని గ్రామాలమీద విరుచుకపడటం, గృహ దహనాలు, మానభంగాలు, లూటీలు, చివరకు పిట్టల కాల్చివేసినట్లుగా మనుషుల కాల్చివేతలు వాడికి సరదాగా ఆడుకునే ఆటగా పరిణమించింది. ఇండ్లల్ల వారి పచ్చళ్ళతోసహా తీసుకపోయె వాడు. మన గ్రామంలో నా అనుభవంపొంది ప్రతీకారం కొరకు ఎప్పుడెప్పుడా అని ఉవ్విళ్ళూరుచున్నాడు.

## వీరుడు రాంమల్లయ్య కాల్చివేత

ప్రసిద్ధిగాంచిన పాపడు నిర్మించిన కోటే తన నివాస గృహముగా ఉంచి గ్రామ ప్రజల్నేగాక ఈ ప్రాంతానికే ముఖ ద్వారంగావున్న కోటపై నుండి పహరాకాస్తూ ఎప్పటికప్పుడు పోలీసు రజాకార్ల ఉనికిని పసిగట్టి ప్రజల్ని హెచ్చరిస్తూ కాపాడుతున్న మన వీరుడు రాంమల్లయ్యను, మనలోనే ఉన్న రజాకార్ తొత్తు, నీచుడు, దుర్మార్గుడు అయిన దుబ్బాక బక్కయ్య అను నరుడు యిచ్చిన సమాచారాన్నిబట్టి, విస్నూరు దొర కుమారుడైన బాబుదొర, గఫూర్‌ఖాన్ మరికొందరు రజాకార్లు గెరిల్లా దళ రూపంలో మిట్ట మధ్యాహ్నము కంచనపల్లి మీదుగా కాలినడకన వెళ్ళి గ్రామం ప్రక్కనుండి దారులు తప్పించి, అడ్డదారిన చేరుకున్నారు.

ఆ మిట్ట మధ్యాహ్నం సాధారణంగా పల్లెప్రజలు తమ పంట పొలాలు, చెల్కలలో పని చేసుకుంటూ ఉంటారు.

## గృహదహన - మానభంగ ప్రయత్న విఫలం

శ్రీ రాంమల్లయ్యను కాల్చి చంపిన తర్వాత, రెండు మూడు రోజులకే తిరిగి రజాకార్లదండు గ్రామం ప్రవేశించింది. ప్రొద్దస్తమానం పొలాలలో పని చేసుకొని ఇండ్లల్లకు చేరు కొంటున్న స్త్రీల గుంపులలో ఒకరైన పెంతల లచ్చమ్మ అనే యువతి ఈ రాక్షసులచేతికి చిక్కింది. బజారులోనే ఆ యువతి వేసే కేకలు, పెడబొబ్బలు అరుపుల చప్పుడు విని, అక్కడి కక్కడే నేల ఈనినట్లుగా చేరి కాళికా స్వరూపులైన స్త్రీలు ఎదురు తిరిగి ఆ యువతిని రక్షించుకోగలిగారు.

మరికొందరు రజాకార్లు, దీలి దళ సభ్యులకు బట్టలు కుట్టిస్తున్నాడని నెపంతో ధనాలకోటి రామయ్య అనే దర్జీని చితక బాదారు. తర్వాత వారు పోతూ పోతూ గుజ్జుల ఎరయ్య, పెంతల బుచ్చిమల్లయ్య గుడిసెలకు నిప్పుపెట్టారు.

ఈ రెండు గుడిసెల్ని స్త్రీలే చీమల్లా చుట్టి అంటు కొంటున్న ఆ గుడిసెల్ని ఆర్పివేయ గలిగారు.

ఈ రెండు ఘటనలలో పురుషుల అండలేకుండా స్త్రీలే శక్తి స్వరూపులై నిలిచి తమ పటిమను నిరూపించుకోగలిగారు. ఇది మాగ్రామానికే గర్వకారణం.

## చాగంటి రాజయ్య మరణం

అది ఆగష్టు నాలుగు 1948 ఉదయం 9-10 గంటల మధ్యన జనగామ నుండి గఫూర్‌ఖాన్ నాయకత్వాన 50-60 మంది వరకు రజాకార్లు భారీ నిండ అత్యంత అధునిక ఆయుధాలు ధరించి, నిజాం మిల్ట్రి తోడుగా వచ్చేసింది. ఇద

గమనించిన జనం చెట్టుకొకరు పుట్టకొకరు అయ్యారు. ఆ లారీ నేరుగా గ్రామంలో ఆగకుండానే మందెలగూడెం వైపు వెళ్ళి పెద్దగుట్టవద్ద ఆగింది. (గుట్టమీది బాట ధ్వంసం చెయ్యటంవల్ల లారీ పోలేకపోయింది). పటాలం రెండుగా చీలింది. మందెల గూడెం చుట్టేసింది. అప్పటికే గూడెం ప్రజలు చెల్లాచెదరైనారు. రజాకార్లు గ్రామమంతా గాలించారు. ఇక కాపులను, పశువుల దొడ్లను చుట్టేస్తూ పోతున్నారు. శ్రీ చాగంటి రాజయ్య తన చేనుల కొట్టంవద్ద వుండి గమనిస్తున్నాడు. ఆ ముష్కరులు ఈ కొట్టాన్ని గూడ చుట్టబోతుండగా ప్రాణరక్షణ కొరకు, మాలగుట్ట దిగి మాదారం వైపుకు అతి ప్రయాసతో ఉరుకుతున్నాడు.

గఫూర్ ఖాన్ మాల గుట్ట ఎక్కి గమనించాడు. ఆ పెద్ద మనిషి పరుగెత్తటం చూశాడు. "అరె ఐస్మాష-ఖడేరహో -ఖబర్ దార్" అన్న హెచ్చరిక విని వెను దిరిగి గురిపెట్టిన తుపాకిని గమనించి నిలువునా చేతులెత్తి ప్రార్థిస్తున్నాడు. ఢాం అంటూ గుండెను చీల్చుకుంటూ దూసుకు వెళ్లింది గుండు. ఆ ప్రార్థిస్తున్న చేతులతోటే నేలకొరిగాడు రాజయ్య. అప్పటికి వారి వయస్సు దాదాపు 60 సం॥లకి పైనే వుంటుంది.

ఈ విధంగా ఒక్కొక్క ఘటన వ్రాస్తూపోతే మహా గ్రంథమే అవుతుంది. మచ్చుకు కొన్ని మాత్రమే ఇచ్చాను.



# మన గ్రామ యువకులు దళాలలో చేరి నిర్వహించిన విధులు సాహస కృత్యాలు

---

## మసీ మల్లయ్య

వీరి పని దాదాపు పోస్టు పనియని చెప్పవచ్చు. ఉత్తర ప్రత్యుత్తరాలు ఒక దళం నుండి మరొక దళానికి చేరవేయటము, సెంట్రల్, జోనల్, ఏరియా కమిటీల నుండి సర్క్యులర్లు, సాహిత్యము మొదలగునవి అతి రహస్యంగా వివిధ వేషధారణతో చేరవేయుటము వీరి పని.

## గుండె నారాయణ

శత్రువు స్థావరాలకు ప్రాణాలకు తెగించి పోవటము, శత్రువు సమాచారాన్ని సేకరించటము, దాడికి అనువైన స్థలాల పరిశీలన, శత్రువు యొక్క బలం, వారు ఏ వేళలో ఏం చేస్తారో కనిపెట్టటము, మొదలగు పూర్తి సమాచారము సేకరించి అందించటము, వీరి కర్తవ్యము. ఈ సమాచారము తోటి దళం జయాపజయాలు ఆధారపడి ఉంటవి. ఈ సమాచారం తోటి మెరుపుదాడులు చేసి శత్రువును ఛిన్నాభిన్నపరచి విజయవంతంగా తిరిగి రావటం.

## కోతి వెంకటయ్య

స్కౌట్‌గా ఉండి, దళం నిర్ణయించుకొన్న స్థలానికి

అది ఎంత దూరమైనప్పటికి నిర్ణీత సమయానికి శత్రువే కాదు మరెవ్వరి కంటబడకుండ అంతుచిక్కని దారులలో ఆకాశంలో మెరిసే చుక్కల ఆధారంగా అక్కడక్కడ ఉన్న చెట్లు గుట్టల ఆనవాళ్ళ ఆధారంగా ముందు నడుస్తుంటె వెనుకదళం సాగి పోయేది. పయనించే సంచర్యములో ఏ ప్రమాదం ముంచు కొచ్చినా మొదట గురికావాల్సింది ఈ స్కౌటే.

## ఒక సంఘటన

అప్పుడు నేను క్రామేడ్ ఏసిరెడ్డి నర్సింహారెడ్డిగారి దళంలో పున్నాను. అది సిద్దెంకి ప్రాంతం. రోడ్ల మధ్య ప్రాతం నుండి బయటపడాలి. శత్రువు ఆ ప్రాంతాన్ని చుట్టివేయవచ్చని తెలి సింది. (ఆలేరు, పెంబర్తి, జనగామ, బచ్చన్నపేట, కొలను పాక - దీన్ని రోడ్ల మధ్య ప్రాంతమంటారు) దళం బయలు దేరింది. స్కౌట్ ముందు నడుస్తున్నాడు. హైదరాబాదు, హన్మకొండ రోడ్డు అతి సమీపంలో వుంది. ట్రక్కులు, లారీలు అటు ఇటు ఎడతెరిపి లేకుండా నడుస్తున్నవి. పటేలుగూడెం, బంటుగూడెం, గుండ్లగూడెం మధ్యన నడుస్తున్నది దళం. ఇంతలో ముందు నడుస్తున్న స్కౌట్ ప్రమాదపు సౌంజ్ఞ చేశాడు.

దళం ఆ సౌంజ్ఞను వెంటనే పాటించి ఎవరి ఆయుధాలు వారు ప్రేల్చటానికి సిద్ధంగా పొజిషన్‌తో నేలపై పడుకున్నారు. మరో సౌంజ్ఞ శత్రువు ముందుకొస్తున్నాడని, దళమంతా ప్రాణాలు బిగపట్టింది. కనపడ్డ శత్రువు కదిలినట్లే కనపడు తున్నది కాని, ఎంతకూ ముందుకు ధావటం లేదు. ఒక వేళ

మనమే ముందు దెబ్బ తీస్తే పోతున్న ట్రక్కులు, లారీలు అక్కన్నే నుట్టి వేస్తే ఎంత ప్రమాదం అని ఆలోచిస్తున్నాడు తా॥ ఏసిరెడ్డి గారు.

కొంత సేపటికి స్కౌటును సౌంజ్ఞ చేసి వెనక్కి పిలిచి, మనం ఎక్కడికి వచ్చాము, ఇప్పుడు మనమున్న స్థానమేమిటి? అని ప్రశ్నించే సరికి; మనం బంటుగూడెం, గుండ్లగూడెం సరిహద్దుకు కొన్ని గజాల దూరంలోనే ఉన్నామని చెప్పటంతో కాస్త తమాయించుకొని అయితే యిక్కడ సరిహద్దు స్తంభం వుండాలి, కొంప దీసి అది కాదు గదా! ఇంకాస్త ముందు కెళ్ళి చూడమన్నాడు. స్కౌట్ మరికొంత ముందుకెళ్ళి పరిశీలించగా అది రాతి స్తంభమేనని స్పష్టపడింది. భ్రమలోపడి, ఆలోచన లేక ఇంతసేపు తికమక పడ్డాము. ఇక నడువు ముందుకన్నాడు.

ఈ విధంగా ఒక్కోసారి ముందు నడుస్తున్న స్కౌటు ఏ మాత్రం అజాగ్రత్త వహించినా, మరో ఆలోచనలో పడి కర్తవ్యాన్ని మరిచినా అసలు ప్రాణాలకే ముప్పు. ఇది అతి సున్నితమైన కఠినమైన పని అనటంలో ఏలాంటి సందేహం లేదు.

## తాటికొండలో రజాకార్ల దాడిని త్రిప్పికొట్టుట

వరంగల్ తాలూకా, తాటికొండ గ్రామానికి అతి సమీపంలోనే కొత్తపల్లి అనే గ్రామం ఉంది. ఇక్కడ ముస్లింల ప్రాబల్యం ఎక్కువ. వీరి జనాభా పెద్దది. ఈ గ్రామానికి దొరలు భూస్వాములు గూడా వీరే. వీరి దురాగతాలకు అంతు లేదు. ఇదో పెద్ద రజాకార్ల శిబిరంగా మారింది. ఈప్రాంతానికి

రు శిబిరం పెద్ద తలనొప్పిగా వుంది. లూటీలు, హత్యలు తదితరములు మామూలే. వీటి ఆగడాలను తుదముట్టించాలనే నిర్ణయం దళాలు తీసుకొన్నవి. సమయం కొరకు కాపు కాస్తున్నవి; దళాలు, వారి రోజువారీ కార్యక్రమం ప్రకారం ఆ రోజు తాటికొండపై దాడికి సిద్ధమై బయలు దేరాయి. ఇది దళాలకు కబురు అందింది. అవి మాటేసి కూర్చున్నవి. 50, 60 మందికి పైగా వున్న రజాకార్ల గుంపు, గ్రామంపై దాడికి సిద్ధపడి "అల్లాహో అక్బర్- ఖాసిం రజ్వీ జిందాబాద్" అంటూ కేకలేస్తూ గాలిలోకి తుపాకులు ప్రేల్చుకుంటూ విజయ గర్వంతో మైమరచి గ్రామం చేరి చేరకముందే, మాటేసి కూర్చున్న దళాలు ఒక్క పెట్టున మెరుపు దాడి చేసింది. నలువైపుల నుండి తుపాకి గుండ్లు విరుచకపడినవి. అక్కడి కక్కడే ఆరుగురు నేలకొరిగారు. మరెందరో గాయపడ్డారు. ఈ దెబ్బతో చెల్లాచెదరై శవాలను సహితం గొనిపోకుండా పలాయన మైంది రజాకార్ల గుంపు. బెదిరిన రజాకార్లు తెల్లవారే సరికి మూటాముల్లె సర్దుకొని ఘనపురం స్టేషన్ చేరుకొన్నారు.

## పెంబర్తి స్టేషన్‌పై దాడి - ఆయుధాలు లాక్కోవటము

ఆ రోజుల్లో ఆయుధాల సేకరణకున్నంత ప్రాముఖ్యత మరి ఏదానికి లేదు. అందుకే పెంబర్తి రైల్వే స్టేషన్ దాడికి మంచి అనువుగా నున్నదని గెరిల్లా దళం నిర్ణయించుకొన్నది. ఈ రైల్వే స్టేషన్‌లో 12 మంది నిజాం రైల్వే పోలీసు దళం ఉన్నదని తెలిసింది. వారు సాయంత్రం మత్తుగా త్రాగి ఉంటా

రన్న సమాచారం అందింది. 11 తుపాకులు వరుసక్రమములో గోడకు నిలబెట్టి అదే వరుస క్రమములో పోలీసువారు పడుకున్నారు.

సమయం రాత్రి సుమారు 1½ గంటలు. విజయవాడ వెళ్ళే బండి సికింద్రాబాద్ నుండి వస్తున్నది. స్టేషనుకు గెరిల్లాలు ప్రయాణికుల రూపంతో చేరుకున్నారు.

సెంట్రీ మీద పడేవారు, రైఫిల్సు లాగుకునేవారు నిదురిస్తున్నవారి పైబడి కదలనివ్వకుండా వుంచేవారు, వారి వారి విధులు అప్పటికే నిర్ణయమైనాయి. ఇక జరుగవలసినదల్లా దాడి మాత్రమే. ఇంతలో బండి అవుటర్ సిగ్నల్ దరిదాపులోకి చేరుకుంది. లైన్లు క్లియర్ అంటూ సిగ్నల్‌మెన్ సిగ్నల్ యిచ్చాడు. ఆ విభాగం చూస్తున్న మరో దళం సిగ్నల్ వైరును త్రెంచి వేసింది. బండి ఆగింది. దానికి ఎప్పుడాయని శ్వాసనైతం బిగబట్టి ఎదురు చూస్తున్న కొదమ సింహాలు ఎవరికి నిర్దేశించిన పని వారు ఒక్కుమ్మడిగా విరుచుకపడ్డారు. క్షణాల మీద ఆయుధాలు వశమైనవి. శత్రువు తెప్పరిల్లక ముందే మెరుపులా మెరిసి మాయమైనారు. ఇందులో పాల్గొన్న ఏ ఒక్కరికి గోటగిల్లినంత గాయం కూడ కలుగకుండా బైటపడ్డారు. ఇందులో కామ్రేడ్ కొత్త ముకుందారెడ్డి, ఏసిరెడ్డి నర్సింహ్మారెడ్డి, గుజ్జుల వీరయ్య, కొత్త వెంకటరెడ్డి గారలతో పాటు నాటి మేటి యువకులెందరో మృత్యు ముఖం నుండి విజయ ఢంకా మ్రోగిస్తూ బైటపడ్డారు.

## కొన్ని వింత సంఘటనలు

మెరుపులా దాడి చేసింది దళం. చేజిక్కించుకున్నారు

రైఫిళ్ళను, కాని మందుగుండు సామగ్రి పెట్టెను ఎవరు మోసు కెళ్లాలి అను తర్జన భర్జనకు తావు లేకుండానే శ్రీ కొత్త వెంకటరెడ్డి బాధ్యతయని వేరే చెప్పవలసిన పనిలేదు. ఎందు కంటే వీరు దాడిలో పాల్గొన్న వారందరిలో మహా బలిష్ఠుడు. ఆజానుబాహుడు. ఎత్తుకు తగ్గ లావు, కండ పుష్టిగలవాడు కనుక ఆ పెద్దమ్మ గుడిలా వున్న ఆ కర్ర పెట్టెను అమాంతం లేపి వారి నెత్తినేశారు. అవలీలగా వారు పెంబర్తి స్టేషన్ నుండి ఎల్లంల బండ క్రిందివరకు మోసుకొచ్చారు. ఇక అడుగు ముందుకు వెయ్యలేక పోయాడు. దళం కూడ ఆగింది. ఈ పెద్ద గుడిని దింపారు. తాళం బద్దలు కొట్టారు. దాని నిండ మందు గుండు సామగ్రి పుష్కలంగా ఉంది. ఇక నే మోయలేనం టాడు ఈ పెద్దమ్మ గుడిని. అప్పటి నుండి పెద్దమ్మ గుడి పెద్దన్న వస్తున్నాడని పలకరించేవారు ఆప్యాయంగా.

## వింతలు - వినోదాలు

సాధారణంగా దళ సభ్యులు తిండికి వాచినట్లే ఉంటారు. కారణం దళం ఎప్పుడు ఎక్కడ ఉంటుందో, ఏమి జరుగు తుందో అసలు ప్రాణాలతో ఇందులో ఎందరుంటారు అనేది పెద్దగా పట్టించుకోకున్నా ఈ రోజన్నా కడుపునిండా తిండి దొరుకుతుందా అనే బెంగమాత్రం చాలా మందిలో ఉండేది.

దళం ఒక గ్రామానికి వెళ్లిందంటే గ్రామ కమిటి సభ్యులు ఇంటికొకరు చొప్పున పంపి తిండి పెట్టించే వారు. ఆ దళం వరుసక్రమంలో వెళ్ళుచుంటే గడప కొకరి చొప్పున పంపిస్తుంటే ఆ ఇలు చూడగానే దాంట్లో అన్నం దొరకుతుందా?

లేక గటక అనేది ఇల్లు వాలకం చూడగానే తెలిసేది. మారు మాటాడకుండా ఇష్టం ఉన్నా లేకున్నా తిని తిరిగి రావలసిందే, ఇందులో ఎవరి అదృష్టం వారిది. గ్రామం వదిలాక పెరుగన్న పోడు, గటుక నీళ్ళోడు, కోడి కూరోడు, మిరంమెతుకులోడు అంటూ నవ్వుతూ సాగేది దళం ముందుకు.

ఒక సారి మన గ్రామం లాగ నర్సింహులుకు (ఇతన్ని చచ్చేంత వరకు కమ్యూనిష్టు నర్సింహులు అని ఊరంతా పిలిచేది) బ్రాహ్మణుల ఇంట్లో భోజనం వంతు వచ్చేసింది. ఫర్వా లేదని సంతోషంగా వెల్లాడు. ఆ అమ్మ గారు విస్తారాకు యిచ్చి కూర్చుండమంది. ఆ అమ్మగారు వడ్డిస్తూ పోతుంటే వీరు లొంచేస్తూ పోయారు. భోజనం ముగిసింది. ఎంగిలి మెతుకులు ఏరి ఓస్తారి తీసి అవతలపారేశారు. అమ్మగారు పోతున్నానన్నాడు. అవిడగారు మరికాస్త నీళ్ళు తెచ్చి తిన్న కాడ చల్లి కాస్త శుద్ధిచేయి నాయనా అంటూ ఇంటో కెల్లింది. ఈ శుద్ధి ఏంటబ్బా అంటూ నిలుచుండి పోయాడు. మరికొంత సేపటికి ఆ అమ్మగారు వచ్చి ఏమి నాయనా అంది. అమ్మా మీరు శుద్ధి చేయమన్నారు. అదేందో తెలియక నిలబడ్డానన్నాడు. అయ్యో మీరు తిన్న కాడ కాస్త నీళ్ళు చల్లి అలికి వెళ్ళమంది. ఓష్ ఇంతేనా అంటూ భుజాన వున్న తువాలని ప్రక్కకు పెట్టి ఆ మనసాలా అంతా మొత్తం మీద నీళ్ళు చల్లి అలుకసాగాడు అతికష్టం మీద. అప్పుడే తిన్నందువలన నడుము వంగదు కదా! ఇక్కడ దళ మంతా తిని గ్రామం వెలుపలికి వచ్చింది. ఈ కామ్రేడ్ రాలేదు. ఎందుకు రాలెదో అని మరో సభ్యుడు వెల్లి చూడగానే ఆ ఇల్లంతా అలుక్కుంటు పోతున్నాడు. ఇది చూచిన సభ్యుడు ఏందిదంతా

అన్నాడో లేదో ఈ తిండి పాడుగాను తిన్నది మొత్తం ఇక్కడే అరిగింది. అమ్మగారు చెప్పిరి చెయ్యకపోతేనో పీరితోను లేక పోతే మీతోను తంటా అంటూ బయలుదేరాడు. ఇక ముందు నన్ను బాపనోళ్ళ యింటికి తోలొద్దు సుమా! మరోసారి.

అది ఫతేషాహపురం గ్రామం. రాత్రి సుమారు ఎనిమిది కావస్తున్నది. దళమంతా భోంచేసింది. అకాశం మేఘావృత మైంది. అందుకు తోడు అమావాస్య చీకటి. ఇంకో అరగంటలో బయలుదేరాలి మరో చోటికి. తీరా సమయానికి చిన్నచిన్నగా చినుకులు ప్రారంభమైనవి. అయినా బయలుదేరింది దళం తప్పదుగా మరి.

మన శాగ కోతి వెంకటయ్యగారికి వీరన్నగారు పోవల సిన గమ్యం చెప్పారు. మరిగడి పట్నాల రామయ్యగారి బావి కాడికిపోతేనే విశ్రాంతి. స్కౌటుగా బయలుదేరాడు ముందు వెంకటయ్య. స్కై చూడాడు. చుక్కలనుబట్టి నిర్దేశిత ప్రాంతా నికి, కాని పైన చుక్కలు అగుపడటంలేదు. చెంపకొట్టి దాక్కు న్నంత సీకటిగా వుంది. కుండపోత వర్షం. బట్టలన్నీ తడిసి నవి. చౌడారం ప్రక్కనుండి వెళ్ళాలి. ఒక కోసిన జొన్న చేల్లోనుండి కంధిసాళ్ళు తప్పించుకుంటూ అడ్డంగా పోతున్నాం. ఆ చెలుకల్లో నిలువెత్తు రేగుచెట్లు విపరీతంగా పెరిగి వున్నవి. ఇంకేముంది కానక చెట్టుకు తాకడం, బట్టలు అంటుకోపటం, అది వదిలించుకొని ఒక అడుగు వేశామోలేదో మరో రేగు పొదలో చిక్కటం ఇందులోనే యమయాతనలు పడుతున్నాం. ఎవరికి ఎవరు సహాయపడే స్థితిలోలేరు. పైగా ఒకటె వాన జల్లులు. ఎవ్వరు ఎటు వైపున్నారో తెలియదు. అ రేగు కంపను

విడదీయరేక బట్టలన్నీ చినిగిపోయినవి. ఒళ్ళంతా రేగుముళ్లతో గుచ్చుకొన్నవి.

అప్పుడు ఎవరికేమో గాని నాకు మాత్రం ఎందుకొ_స్తిరా భగవంతుడా ఇంతకన్న కష్టం ఇక ఈ జన్మకు చాలురా ఆ రజాకార్ల చేతచిక్కి నాల్గు దెబ్బలు కాకపోతే కాల్చివేత నయంగా ఉండేని గదా ఈ రేగుల్లోపడి చచ్చేదానికన్నా, అని నాలో నేను వాపోతుంటే మరికొందరు నాతోటి కామ్రేడ్స్ ఏం పటేలా! పిల్లంచే లేదుగాని అవ్వ యాదికొచ్చిందా లేక అయ్యా? ఊకె ఇంటికాడ ఉండి నెయ్యోయిక్క బువ్వోయిక్క తినక అంటూ ఎగతాళి, నవ్వులూ- నాకేమో కోపం ముంచు కొస్తున్నది. కాని ఏం లాభం?

తీర తెల్లారబోతున్నది. దాదాపు అందరం ఆ రేగుల్లోనే చెలకల్లోనే పడి చచ్చాం తెల్లార్లు. ఈ సంఘటన శారీరకంగా కష్టభరితమైనా ఒకరి కొకరు ఎగతాళులు ఎత్తిపొడుపులు చలోక్తులు విసురుకుంటూ ముందుకు సాగింది దళం. ఇట్లా ఎన్నెన్నో మరెన్నో సంఘటనలు.

## ప్రజల్లో రాజకీయ-సాంఘిక చైతన్యం కల్గించుట

ఆ రోజుల్లో ప్రజలకు తెలిసిందల్లా దొరలు చెప్పిందే బ్రహ్మ వాక్కు. మూఢ విశ్వాసాలు, ఛాందసపోకడలు, కుల పెద్దలు ఏది నిర్ణయిస్తే అదే అమలు జరిగి తీరాలి. అంటరాని తనం మహమ్మారిలా ఉండేదని మనం ముందే తెలుసుకోవటం జరిగింది.

అందుకు గెరిల్లా దళాలు ఒక వంక పోరాడుతూనే మరొక వంక రాజకీయ చైతన్యాన్ని, కాసిన కట్టుబాట్లను బ్రద్దలు చేయడం, మూఢ నమ్మకాలపై మోజును దూరం చేయుటం, ఇంకా అనేకమైన సమస్యలను సభలు జరిపిచెప్పటం, పాటలద్వారా కోలాటాలద్వారా మరెన్నో విధాలుగా ప్రచారం చేయటం, సాంఘిక దురాచారాలకు దూరంగా ఉంచటం, నవ చైతన్యాన్ని కలిగించుటకు ప్రధాన సమస్యలుగా తీసుకొని పని చేసేది.

ఆ రోజుల్లో నేను ప్రధానంగా ప్రచార విభాగంలో వుండి, ఊరేగింపులు, సభలలో పాటలు పాడటం, రాజకీయ ప్రచారం గావించటం గ్రామస్తులకు ఏదైనా చిన్నచిన్న జబ్బులువస్తే వాటికి మందు లివ్వటం జరుగుతుండేది. ప్రధానంగా ఈప్రాంతములో పసరమద్ల గ్రామస్తులైన శ్రీ యిరెడ్డిగారు డాక్టరుగా పని చేసేవారు.

మాకు కా॥ బద్దం ఎల్లారెడ్డిగారు తర్వాత రామారావు గారు (S V K. ప్రసాద్) రాజకీయ క్లాసులు తీసుకొని బోధించేవారు. ఆ క్లాసుల ప్రభావంచేత గ్రామాలలో ప్రజల్ని రాజకీయ చైతన్యం కలిగించుటకు బాగా ఉపయోగపడినవి.

ఈ క్లాసులు కమ్యూనిజం - సోషలిజం - సమానత్వం అంటే ఏమిటో దోపిడి, పీడన వీటి ప్రభావం ప్రజలకు అర్థ మయ్యే విధంగా వివరించటమేకాదు, ఆచరణలో చూపెట్టడం జరుగుతుండేది. ఉదాహరణకు భూస్వాముల భూములను భూమి లేని పేదలకు పంపకం చేయుట, దున్నుకోవటానికి పశువులు,

పనిముట్లు వాటితోపాటు విత్తనాలు దొరల గడీలనుండి పంపకం చేసేది. పశువులు మాత్రం ఒక చోటివి మరో చోటికి తరలించి పంచేది. వీటన్నిటిని చూచుటకు గ్రామాలలోని పెద్దలు యువకులతో గ్రామరాజ్యాలను యేర్పరచి వాటి ఆధ్వర్యాన పనులు సాగేటట్లుగా చూచేది. విద్య, ఆరోగ్యం గురించి వివరించటము, సాంఘికముగా వెనుకబడిన వారికి అన్ని విధాల వివరించి చెప్పేది. ఉదాహరణకు ఆ రోజుల్లో వడ్డెర కులస్త్రీలు రవికెలు తొడగటం నేరం. అందుకు ప్రచారంతోపాటు ఆచరణలో సంఘం తరఫున రవికెలు కుట్టించి తొడిగించేది. స్త్రీలలో ప్రచారం చేయడానికి శ్రీమతి దూడల సాలమ్మగారు దళాల వెంట తిరుగుచు బాగా కృషి చేసినారు. అటాగే ఎరుకలి కులంలో మగవారు గోచీపేలికలు ధరించడం వారి ఆచారం. అట్టివారికి పంచెలు కట్టించడము జరుగుచుండేది. ఒక్కొక్కసారి ఈ రవికలుగాని, పంచెలుగాని ధరించకపోతే అవసరమైన బెదిరింపులకు గురిచేసి వారికి అలవాటు చేయడం జరిగింది. రాత్రి పాఠశాలలు పెట్టించి యువకులకు అక్షర జ్ఞానంతోపాటు దేశమంటే ఏమిటో, ఈ పోరాటం ఎందుకో వివరిస్తూ దోపిడికి వ్యతిరేకంగా సాగుచున్నదని, దున్నేవానికే భూమి ఉండాలని దున్నని వానికి అసలు భూమెందుకని చెప్పటమేకాక ఆచరణలో ప్రతినిత్యం కండ్లారా చూస్తున్న సంఘటనలన్ని చెప్పటంతో వారిని విజ్ఞానవంతులుగా చేసేది.

గ్రామంలో ఏ సమస్యయైనా, పరిష్కారమైనా ప్రజలందరి సమక్షములో తీర్పులు జరుగుతుండేవి. అందువల్ల లంచగొండితనంగానీ ఏ ఒక పక్షం కొమ్ముగాచే విధానం లేకుండా

పోయింది. గ్రామం అంటే మనందరిది. ఏదో వెనుకటి దొర ఒడో లేక పెత్తందార్లదో కాదు అని గ్రహించి నడిచే స్థితికి చేరుకుంది జనం. ఆరోగ్యానికి వస్తే- జ్వరం వచ్చినా, దగ్గు పడిశెం పట్టినా ఏ డయేరియాకో ఘాతానికో వదిలేసి కోడిపిల్లలు, టెంకాయలు కొట్టి మొక్కితే పోవని విడమరచి చెప్పటం జరిగేది. బొండ్లవాడు (రిస్సారివాడు) మంత్రించిన ఊదుపొగతో పోదని ఆచరణలో వారికి మందులు ఇంజెక్షనులు స్వయముగా ఇచ్చి జబ్బులు నయం చేసేది. 1948 లోనే పెద్ద ఎత్తున గత్తర సోకింది (కలరా సోకింది). రోజూ పదులు వందల సంఖ్యలో గ్రామాలలో గత్తరకు బలియైపోతున్నారు ప్రజలు. ఆ సమయంలో ఈ దళాలు పెద్ద ఎత్తున కదిలి కలరా మందులు, టీకాలు యివ్వడం జరిగింది. నాటు ఎంత మూఢ నమ్మకముందో చూడండి, కలరా సోకిన వ్యక్తి యింటికి ఎవరూ పోకపోవటం అటుంచి, చచ్చిన వారిని పూడ్చి పెట్టడానికి సైతం సాహసించేవారుకాదు. గత్తర అంటే అదేదో పెద్ద దయ్యం, భూతం, పిశాచం అని నమ్మేది. ఇక బొండ్ల వారికి గత్తర వచ్చిందంటే పంటపండినట్లె లెక్క. డబ్బు, ధాన్యం, కోళ్ళు, గొర్లు, కల్లు సారాయి తెగత్రాగి తినేవారు. రాత్రులందు తూలుతూ గడపకింత పసుపురాస్తూ పోయేవారు. 'ఓం హ్రీం క్రీం' అంటూ బజార్లు తిరిగేవారు. చచ్చేవారు చచ్చిన తర్వాత కలరా ఆగిపోగానే ఇక దాటుడు తీయాలంటూ మేక పోతుల, గొర్రెపోతులను అమ్మోరికి బలియిచ్చి బాగా మెక్కి చేతులు దులుపుకునేవారు.

అందుకే దళాలు చచ్చినవారిని స్వయంగా మోసుకెళ్ళి పాతిపెట్టడంతోసహా అన్ని విధాల ప్రజలకు అండగా నిలిచేది. మా గ్రామంలో దాదాపు 100 మందివరకు చనిపోయారు. అడవికేశవాపురం, ఎల్లగొల్లపహాడ్, మేకలగట్టు, మలకపేట రండాలలో మా గ్రామ దళాలు మందులివ్వటము, చచ్చినవారిని మోసుకెళ్ళి పూడ్చిపెట్టడములాంటి పనులు చేసి ప్రజల మన్న నలను పొందింది.

## నాడు పంచిన భూముల వివరాలు

మా గ్రామంలో దొరలగు శ్రీ నెల్లుట కేశవరావు, శ్రీ లింగాల వెంకట రంగారెడ్డి, శ్రీ రంగరాజు కేశవరావు ఇంకా శ్రీ మంగు సింహాద్రిగారలవి స్వంత సేద్యానికి కొంత వుంచి మిగతా భూములను వారి పశువులను,పనిముట్లను, ఆస్తు లను గ్రామ కమిటీలద్వారా పంపకము చేయటము జరిగింది. నాడు పంచిన భూములలో అత్యధిక భాగం నేటికి దొరల దానాలక్రింద, వినోబాభావే గారికి భూదానము క్రింద నాడు పార్టీ పంచిన భూములనే ఏపేరుతో నైతేనేమి పేదలు నేటికి కాస్తుచేస్తూ జీవిస్తున్నారు.

1) మంచినీళ్ళ బావి 10-00 ఎకరాలు గొల్లవారికి
2) గంగ బావి 12-00 ఎకరాలు పద్మెరవారికి.
3) చౌల్లల్ల పొలం, కులికపంపు, మొద్దులపంపు దాదాపు 300-00 ఎకరాలు హరిజనులకు.
4) గరుగుబావి ఆయుకట్టు అత్యధిక భాగం గౌండ్ల వారికి (నాడు పేరికి కల్లుగీత రద్దువల్ల ప్రత్యా మ్నాయ జీవనోపాధి కలిగించుటకు చేసినఏర్పాటు)

5) సాయికుంట-గరుగుబావి మరికొంత భాగం (మాల మాదిగలకు) హరిజనులకు

6) పడమటి పంపు పద్మశాలి మొదలగు చిల్లరజాతులకు

7) జాఫరగూడెం - మండెల గూడెంలలో వున్న శ్రీ సింహాద్రిగారి భూములు మాలమాదిగలకు పంచడం, ఇందులో 80.00 ఎకరాలు మాదిగవారికే యివ్వటం జరిగింది.

## బలవంతంగా లాక్కున్నవి తిరిగి యిప్పించుట

1) తీగారపు బావి :

తీగారపు పోలయ్య అనే హరిజనుని పొలం తిరిగి సింహాద్రి పంతులుగారినుండి లాగి యివ్వటం జరిగింది. అట్టి బావి నేటికీ హరిజన రైతు స్వాధీనములోనే ఉంది.

2) గౌడవారి ఇల్లు :

లగిశెట్టి పాపయ్య మొదలగువారు కోతి రామస్వామి గౌడ కుటుంబీకుని యిల్లు మిత్తి క్రిందనే లాక్కొన్నారు. దాన్ని తిరిగి ఆక్రమింపజేయడంతో నేటికి ఆ యింట్లో కోతి రామస్వామి కుటుంబము కాపురం చేస్తున్నది.

3) పోరంబోకు, పంచరాయి భూములు మరెన్నో భూములులేని పేదలకు పంచటం జరిగింది.

4) కౌలుదార్ల బేదకల్లు రద్దుపరచడం, లంబాడీలవి, ఇతర జాతులవారివి తిరిగి యిప్పించిన సంఘటనలు కోకొల్లలు

వాటి నన్నిటిని రాస్తూపోతే తరగవు. అందుకే కొన్ని మాత్రమే మచ్చుకు చూపటం జరిగింది.

ఇవ్వన్నీ ఒక వైపు నిజాం పోలీసు, రజాకార్లు విరుచుక పడుతున్నా, విధి విరామంలేకుండా ప్రాణాలకు తెగించి వారితో పోరాడుతూనే మరో వైపున భూముల పంపకము, రాజకీయం గాను, సాంఘికంగాను ప్రజల్ని చైతన్యవంతులుగా గావించుచు మూఢ నమ్మకాలకు వ్యతిరేకంగా పోరాడుతు ఎంతో కృషి చేయడం జరిగింది.

ఒక్క మాటలో చెప్పాలంటే గ్రామాలలో అంతకు ముందున్న దోపిడి, పెత్తనం, దొరతనం స్థానంలో ఒక క్రొత్త జీవనం ప్రారంభమైంది.

## ఈ పోరాట ఫలితాలు

— ఈ పోరాటం : నిజాం రాజరిక పీఠాన్ని కూకటివేళ్ళతో పెకలించి వేసింది తిరిగి చిగురించకుండా.

— ఈ పోరాటం : సంస్థానాలను, జాగీరులను, దొరతనం దోపిడీలను బ్రద్దలు కొట్టింది.

— ఈ పోరాటం : అంటరానితనం, అస్పృశ్యతను తూర్పార పట్టింది.

— ఈ పోరాటం : మూఢ నమ్మకాలను, కులతత్వ, మత తత్వ పరదాలను చించిపారేసింది.

— ఈ పోరాటం : గ్రామాలలో స్వాతంత్ర్యం అంటే ఏమిటో కళ్లార చూపటంకాదు, నిజ జీవితంతో అనుభవింప జేసింది.

— ఈ పోరాటం : అదే తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం, ఎలాంటి దోపిడిలేని ఒక వినూతన వ్యవస్థను ప్రజల ముందుంచింది.

— ఈ పోరాటం : కులమత భేదాలను ద్వేషించింది. ముస్లిం మతోన్మాదాన్ని వ్యతిరేకిస్తూనే హిందూ ముస్లిం ఐక్యతకై పోరాడింది.

మా గ్రామంలో ఇంత పోరాటం జరిగినా ముస్లిం మతోన్మాదం రగులకుండా చూచింది. అంతేకాదు, వారి ఇండ్లు, ఆస్తిపాస్తులకు ఏలాంటి హాని జరుగకుండా కాపాడటము జరిగింది. వీరు గ్రామం వీడి వెళ్లినా రజాకార్లతో కలిసి రాక్షసత్వం చేయలేదు.

అందుకే నాడు గ్రామాలలో బహిరంగ సభలలో మేము, అందులో నేను ఈ క్రింది పాటను బాగా పాడేది. ఒక విధంగా ఈ పాట నాకు బాగా వచ్చింది. దళ సభ్యులు, గ్రామాలలో జనం ఈ పాటనే నాతో మళ్ళీ మళ్ళీ పాడించేవారు.

"ఖబర్దార్ ఖబర్దార్
నైజాం పాదుషాహె
జానిసత్వ విముక్తికై
రాక్షసత్వ నాశముకై
హిందూ ముస్లిం పీడిత
శ్రమ జీవులు ఏకమై
తమపై స్వారిచేస్తే

దేశముఖుల ప్రతిఘటించి
ప్రజాకోటి పోరుతుంది.
ఖబర్ దార్ — ఖబర్ దార్
నైజాం పాదుషా షా"

ఇది ఊరికే రాలేదు. ఎంతోమంది వీరుల బలిదానం తోను, త్యాగాలతోను వచ్చింది.

ఆ అమర వీరులను నాడు నేడు పనికిమాలిన వెధవలని, తిండిపోతులని, లూటీకోరులని, అరాచకశక్తులని, దోపిడి ముఠాలని ఏవేవో ముద్దు పేర్లతో, మానవ రక్తం త్రాగే నీచులు, లంచగొండులు, పుండాకోరులు, ప్రజల ధన మాన ప్రాణాలను బలిగొన్న రాక్షసులు, శ్రమశక్తిని దోచుకుంటున్నవాళ్ళు ఈ ముద్దు పేర్లతో పిల్చినంత మాత్రాన చరిత్ర, చరిత్రగాకుండా పోతుందా।

చివరకు 1948 సెప్టెంబర్ 13 నుండి 17 తేదీలలో భారత ప్రభుత్వం నిజాం స్టేట్ పై జె. యన్. చౌదరిగారి నాయకత్వాన సైనిక చర్య జరపటంతో తెలంగాణా సాయుధ రైతాంగ గెరిల్లా పోరాటం మరో మలుపు తిరిగింది

ఈ మలుపు భూమికోసం, భుక్తికోసం, స్వేచ్ఛకోసం నేలకొరిగిన అమరయోధుల ఆశయాలు ఈ మలుపు పూర్తి చేస్తుందో లేక మరే విధమైన బాటను నిర్దేస్తుందో భవిష్యత్తుకు వదిలి వేద్దాం. ప్రతికుంటే వేచి చూద్దాం।



శ్రీ పేర్వారం జగన్నాథం రచించిన "సాహిత్యావలోకనం" లోని "ప్రజాసాహిత్యం-తెలంగాణా విమోచనోద్యమం" అనే వ్యాసం చదివి పొందిన మధురానుభూతితో శ్రీ పెర్మాండ్ల యాదగిరి శ్రీ పేర్వారం జగన్నాథంకు రాసిన లేఖ.

---

చి॥ జగన్నాథం ను దీవిస్తూ ...

నీవు వ్రాసిన "సాహిత్యావలోకనం" అను వ్యాస సంపుటి మొన్న ప్రేమతో పంపిన ఈ గ్రంథం శివాజీద్వారా అందింది.

వ్రాసింది జగన్నాథుడు, పంపింది శ్రీనాథుడు, అందించింది శివాజీ; నేను చదివింది ప్రశాంత వాతావరణంలో ఏకాంతంగా ఉండే వట వృక్షం నీడలో; అందుకే అన్నీ ప్రత్యేకతలే.

ఆ రోజు మన హైస్కూలుకు వచ్చి ఆ వెనువెంటనే వెళ్ళిపోయారని తెలిసింది. ముందు తెలిస్తే నేనూ పాల్గొనే వాణ్ణి. ఇక—

మీ గ్రంథంలో "ప్రజాసాహిత్యం-తెలంగాణా విమోచనోద్యమం" అను వ్యాసం చదువుతున్న సందర్భంలో వాస్తవంగా నాకు నేను మరిచిపోయి దాదాపు 45 సం.రాలు వెనక్కి వెళ్లినట్లుగా అనుభూతి పొందటమేకాదు, నాటి గెరిల్లాగా ఉన్నానా! అని అనిపించింది. నేను కూర్చుండి చదువుచున్న ప్రదేశం, నా పొలం వద్దనున్న మఱ్ఱిచెట్టు నీడలో (ఇక్కడ ప్రతిరోజు కూర్చుండటం సహజమే) చదువునాపి తల పైకెత్తే సరికి, సరిగ్గా ఉత్తరాన మన గ్రామ పొలిమేరలను కాపలా కాస్తున్న, హిమాలయాలలాంటి పెద్దగట్లు, తూర్పున మన బావులవద్ద ఉన్న చిన్నబోళ్ళు, పటేలు చెఱువు గట్టు, మరి కాస్త వెనుతిరిగితే మన వీరుడు సర్వాయి పాపన్న నిర్మించిన కోటపై అమరుడు రాంమల్లయ్య నిటారుగా నిలుచింది

గ్రామాన్ని గ్రామ ప్రజలను ప్రత్యేకించి మా గెరిల్లా దళాలను హెచ్చరిక చేయుటకు సంసిద్ధురై ఉన్నట్లుగా భావించాను. మరుక్షణంలోనే ఈ ప్రదేశాలన్నీ కలిసికట్టుగా తిరిగి నన్ను వెలవెలబోతూ దయనీయంగా పిలిచినట్లయింది. మరో వంక నా వరి పొలం కావలి.

నాడు గెరిల్లాగా రజాకారు ముష్కరులు ఎటువైపు నుండి వచ్చి ఏ విపత్తును సంభవింపచేస్తారో యని వారిని కని పెట్టి ఎదుర్కొనటం కొరకు గ్రామ గెరిల్లా దళసభ్యులు ఎదురు తెన్నులు చూస్తూ మాటిసీ గాయటం నాటి పని. నేడు ఒక ఆశక్తునిగా జీవితాధారం కొరకు వేసుకున్న ఈ వరి పైరును ఈ పశువులు ఆ కాస్త మేసిపోతే తింతికే తిప్పలౌతుందని గాపలా కాస్తున్నాను. అందుకే పరస్పర విరుద్ధమైన ఈరెండు సంఘటనలు నా కళ్ళముందు సాక్షాత్తు నిలుచున్నవి.

నీ వ్యాసం ఇంకాస్త ముందుకు వెళ్ళేసరికి నాగుండెల్లో గునపాలుపెట్టి పెకిలించినట్లుగా, నానెత్తిన సమ్మెట దెబ్బలు పడుచున్నట్లయి కళ్ళల్లో నీళ్ళుక్రమ్మటమేకాదు, ప్రవాహంలా జారటమే జరిగింది.

నాడు జిల్లా ఖమ్మం మిలటరీ కాన్సంట్రేషన్ క్యాంపు లలోని బాధలను అందరితోపాటు నేను ఆనందంతో అనుభ వించాను. కాని నీ ఈ వ్యాసం అంతకన్నా బాధను కలిగిం చింది. ఒక క్షణం ఏడిపించింది మరోక్షణం ముందుకు నడు వంటూ వెన్నుతట్టి హెచ్చరించింది.

ఇదిగో నీ వ్యాసంలోని ఈ వాక్యం "కారు చీకట్లలో రాలుతున్న నెగళ్ళు మండుతున్న తెలుగు తల్లి గుండెలా కనుపించేవి; ఓటమి పొందిన నాడు ఆ నెగళ్ళే అమర వీరులకు చితులుగా మారేవి"——, అవును నీ వన్నట్లుగా ఆ నెగళ్ళే చితులుగామారి నాతో కలిసి పనిచేసిన అమరులైన ఆ వీర యోధులు ఒక్కొక్కరే నా కళ్ళముందు నిలుచుండి నవ్వుతూ మృత్యువును ఆహ్వానించుచున్నట్లు అనిపించింది. వారి వీర మరణ స్మృతులు వెండితెరపై కదిలిపోతున్నట్లనిపించింది. ఆ అమరులను చూడగానే ఒక వంక సిగ్గుతో తల వంచుకోవాలనిపించింది. మరోవంక ఆ అమరవీరుల సరసనే వుండే మహద్భాగ్యం కలుగనందులకు ఏడుపు బాధాను. ఏది ఏమైనా ఈ వ్యాసంతో ఆ అమరవీరులను జ్ఞాపకం తెచ్చుకొని హృదయ పూర్వక జోహార్లు అర్పించే మరో అవకాశం కల్పించావు గనుక నీకు కృతజ్ఞతలు.

నాటి చరిత్రలను తిరగేసి ఆనాటి గాథలను బాధలను నేటి యువ సమాజానికందించి ఆ ఆదర్శాల స్ఫూర్తితో ఇప్పటి తరాన్ని ఏ కాస్త ముందుకు నడిపించే ఆశయం నెరవేరాలని అందుకు నీ రచనలు తోడ్పడగలవని నమ్మేవారిలో నే నొక్కడిని.

అయితే నాలాంటి వారికి నాటి గాథలు, బాధలుగా పరిణమించుచున్నవి. ఎందుకంటే మీరు, మీలాంటివారు వ్యాసాలలో పుస్తకాలలో లేక పత్రికాముఖాన ప్రచురించే వాటిని చూసేసరికి గుండెలు పగిలినంత పనౌతుంది. చివరకు అశ్రుధారలతో పూర్తౌతుంది, ఆవేదన.

ఈ లేఖతో మీ వ్యాస సంకలనాన్ని నేను మెచ్చుకొని ప్రశంసా పత్రం వ్రాసే అంత యోగ్యతాలేదు; మరి విమర్శ చేసి చూపే స్థాయిలేదు.

అందుకే, ఎందుకో వ్రాయాలనిపించింది, ఏమిటో వ్రాసేశాను.

నాకున్నదంతా, నాటి పోరాట ఫలితాలు, నాలాంటి వారు ఆశించిన ఆశయాలు కల్లలై పోతున్నందులకు బాధ. మరో ప్రక్క మీరు మీలాంటి వారు నాటి చరిత్రను ఉన్నదున్నట్లుగా చిత్రించి నేటి యువసమాజానికి స్ఫూర్తిని కలిగించే విధంగా అందించినందులకు ఎంతో సంతృప్తి. ఆ సంతృప్తితోనే ఈ లేఖ వ్రాశాను. బరువుదించుకున్నాను.

ఇట్లు

ఆప్తుడు

ఖిలాషాహాపురం పెర్మాండ్ల యాదగిరి

22-6-1982